# చతుర ప్రపంచం

## పూర్ణాయుర్దాయ రహస్యం

"శతమానం భవతిశతాయుష్షు..." అంటూ పెద్దలు దీవిస్తారుగానీ, నిజంగా అన్నేళ్లు, ఈ రోజుల్లో బతికున్నదెంతమందీ అంటే వేళ్లమీద లెఖ్ఖపెట్టవచ్చు. ప్రాకృతిక ఉత్పాతాలు, యా




క్సిడెంట్లు, అంతుపట్టని రోగాలు... ఒకటేమిటి... ఎన్నో వింత సంఘటనలు జరిగి జననష్టాలు అవుతూనేవున్నాయి. ఎప్పుడు ఎక్కడ ఏ అంటురోగం ప్రబలుతుందో, ఎందుకు, ఎప్పుడు భూమి చీలి లక్షలాది మంది ప్రాణాలు విడుస్తారో... జలప్రళయాలు, శీతల పవనాలు, వడగాలుల విజృంభణలు... ఎప్పుడు ఎంతమందిని బలితీసుకుంటాయో తెలియకుండా వుంది. వీటన్నిటినీ అధిగమించి సంపూర్ణాయుర్దాయంతోనేగాక, ఆనందోత్సాహంతో జీవితం గడుపుతున్న శతాధిక వృద్ధుడు నరేందసేన్‌గుప్తా తన ఆయుష్షుకి గాని, లేదా ఆరోగ్యవంతమైన తన శరీరానికి గానీ ఎలాంటి రహస్యంలేదని, తనెప్పుడూ ఎలాంటి ఆరోగ్యసూత్రాలు పాటించలేదనీ అంటున్నాడు. అయితే....వంద సంవత్సరాల సుదీర్ఘజీవనంలో ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కొన్నాడాయన. ఆయనకి అరవై అయిదు సంవత్సరాల వయసులో భార్య గతించింది. అయినా ఆ లోటు తెలియకుండా ఆయన అయిదుగురు కొడుకులు, నలుగురు కూతుళ్లు కలిసి కంటికి రెప్పలా చూసుకున్నారాయన్ని. ఆయనకి నలుగురు మునిమనవలు కూడా ఉన్నారు. ఈమధ్యనే జరిగిన ఆయన శతవార్షిక జన్మదిన వేడుకలో కొడుకులు, కోడళ్లు, మనుమలు, మునిమనుమలు కూడా పాల్గొని కార్యక్రమాన్ని దిగ్విజయంగా ముగించారు. ఆయన్ని చూడ్డానికి సినీనటి

షబనాఅజ్మీ, క్రికెట్‌ప్లేయర్ ఇమ్రాన్‌ఖాన్ కూడా వెళ్లారు.

ఇమ్రాన్‌ఖాన్ సేన్‌గుప్తాతో అన్నమాటలేమిటంటే "నేను క్రికెట్ ఫీల్డ్‌లో ఎన్నో సెంచరీలు చేసివుండచ్చుగాని, నిజజీవితంలో మాత్రం మీలా వందేళ్లు సంపూర్ణ జీవితాన్ని గడుపుతానో లేదో అన్నది అనుమానమే'' అని.

ఇప్పటికీ సేన్‌గుప్తా సాయంత్రం 5 గంటలయ్యేసరికి ఈవినింగ్ వాక్‌కి వెడతాడు. ప్రతిరోజూ ఓ గంటసేపు టి.వి. చూస్తాడు. చక్కటి మసాలాకూరలు వగైరా అన్నీ సుష్టుగా తిని అరిగించుకుంటాడు. నెత్తిమీద వెంట్రుకలు కొంచెం నెరిసినా ఒత్తుగా మాత్రం వుంటుంది జుట్టు. ఇంతవరకు పళ్లు కట్టించుకోకపోవడమేకాక గట్టిపదార్థాలను కూడా కరకర నమిలి తినగలడాయన. ఆయన జ్ఞాపకశక్తి అత్యద్భుతం. ఎప్పుడో తన చిన్ననాటి సంఘటనలెన్నో తూ.చ. తప్పకుండా చెప్పుకొస్తాడు. ప్రస్తుతం ఆయనకి వచ్చిన ఒకేఒక్క సమస్య సరిగా వినిపించకపోవడం.

ఆయన సంపూర్ణ ఆరోగ్య, దృఢజీవనం వెనుక రహస్యం ఏంటేదని ఆయన చెప్పినా, ఆయన కూతురు చెప్పేదేమంటే "నాన్నగారు చిన్నప్పటినుంచీ నిర్ణీత సమయానికి భోజనం, నిద్రమేలుకోవడం... వగైరా నియమాలన్నీ పాటించేవారు ఒకప్పటి బ్రిటిష్ గవర్నమెంటులో జడ్జిగా పనిచేసి రాయబహద్దూర్ బిరుదు కూడా పొందిన ఆయన అంత బాధ్యతాయుతమైన ఉద్యోగం చేస్తూ కూడా ఎప్పుడూ ఎలాంటి టెన్షన్లకీ, మానసిక ఉద్రిక్తలకీ లోనయ్యేవారు కారు'' అంటుంది. అందుకనే ఆయన జీవితం అలా సంపూర్ణంగా ఆరోగ్యంగా సాగిపోతోందని ఆమె నమ్మకం.

అయితే ఆయన్ని అతిగా కలవరపెట్టిన విషయం "పెరుగుతున్న ధరలు'' అలాగే ఆయన్ని అతిగా ఆనందింపచేసిన విషయం "అభివృద్ధి పథంలో ముందుకెడుతున్న స్త్రీ"

---

## మహమ్మద్ ఖ్వాజాగవాన్ మదరాసా

**క**ర్నాటక రాష్ట్రంలోని బీదర్‌లో 'దిఖ్వాజాగవాన్ మదరాసా ఎడ్యుకేషన్ ఎకాడమి'ని చూస్తే భారతీయ, విదేశీ సంస్కృతుల మేలు కలయికగా కనపడుతుంది. కళాచాతుర్యం, కట్టడ నిర్మాణములేకాక దాని గత చరిత్ర వైభవం కూడా కలసికట్టుగా విదేశీ పర్యాటకులను ఆకర్షిస్తోంది. ఇది 500 సంవత్సరాల నాటి కట్టడ విశేషం. ఇస్లాము దేశాలనుంచి వేలాది విద్యార్థులొచ్చి ఇక్కడ చదువుకొనేవారు. ఈ కట్టడానికి సంబంధించిన కొన్ని చారిత్రక ధృవీకరణ పత్రాల ఆధారంగా,దీన్ని 'సౌత్ యూనివర్సిటీ' అని గుర్తించడం జరిగింది. దీనియందు ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరికి గుర్తుగా ప్రకృతి బీభత్సాలలో విరిగిపడిన శిధిలాలు అలాగే వున్నాయి. దాన్ని బాగుచేయడానికి ఏ ప్రభుత్వమూ పూనుకోలేదు.

క్రీ.శ. 1436 నుండి 1540 మధ్యకాలంలో బహమనీ రాజ్యం పరిపాలనలో వుండేది. ఈ కాలంలోని రాజు మూడవ మహమ్మద్ షాహి. ఈ కాలంలోనే మహమ్మద్ ఖ్వాజాగవాన్ అనే ఓ సంఘసంస్కర్త బీదర్ ప్రావిన్స్‌కి ప్రధానిగా వుండి ఎన్నో అభివృద్ధి పథకాలను ప్రారంభించాడు. ఈ కాలంలో రాజు సర్దారుల చేతుల్లో వుండేవాడు. ఖ్వాజాగవాన్ ఈ పద్ధతిని ఎదుర్కొని బీదర్‌ను పాలించిన ఆఖరిరాజైన మూడవ షాహీని సర్దారుల ఆధిపత్యంనుంచి తప్పించాడు.

బహమనీ రాజ్యంలో సర్దారులు వాళ్ళిష్టమొచ్చినట్లు పన్నులు వసూలుచేయడం, అన్యాయార్జితంతో పెద్దపెద్ద భవంతులు నిర్మించుకోవడంలాంటి దుష్కార్యాలలో మునిగితేలేవారు. వీటన్నిటినీ సంస్కరించి, సైన్యమంతా రాజు అధీనంలోకి వచ్చేలా చేసి సర్దారుల పొగరణిగేలా కొన్ని పద్ధతులను చేపట్టాడు గవాన్. రాజు ఒప్పందంమీద





ధనాగారంలోని ధనాన్ని బీదర్ అభివృద్ధికి వినియోగించాడతడు. ముఖ్యంగా బీదర్‌నొక ముఖ్య విద్యాకేంద్రంగా మార్చడానికి కృషి చేశాడు గవాన్. ఆ కృషికి ఆకారరూపమే 'మహమ్మద్ ఖ్వాజాగవాన్ మదరాసా' అనే పేరుతో వెలసిన విద్యాకేంద్రం. ఆసియాలోకెల్లా అతి పెద్ద గ్రంథాలయం ఈ విద్యాలయంలో వుండేది. వివిధ ముస్లిం దేశాల్నుంచి కూడా విద్యార్థులు వచ్చి ఇక్కడ చదువుకునేవారు. శాస్త్రవేత్తలకి, పండితులకు ఇది కూడలిగా వుండేది.




చరిత్ర పరిశీలిస్తే ఇందులో చదువుకున్న విద్యార్థులకు ఉచిత విద్యా, భోజన, వసతి సౌకర్యాలను కలగజేసినట్లు తెలుస్తోంది. 3000 మంది విద్యార్థులు ఒకేసారి పాఠాన్ని వినవచ్చును ఈ విశాలకట్టడంలో సాహిత్యం, చరిత్ర, థియాలజి, పాలిటిక్స్ మొదలైన కోర్సుల్లో విద్యార్థులు మిగతా రాష్ట్రాల విద్యార్థులపై ఎక్కువ మార్కులను తెచ్చుకునేవారు.

దేశవిదేశాలకు చెందిన పండితులందరూ ఇక్కడ సమావేశమయ్యేవారు. ఈ కట్టడ నిర్మాణం పర్షియన్ నిర్మాణాలని పోలి వుంటుంది.

ఇప్పుడు ఈ కట్టడం శిధిలావస్థలో వుంది. 1695లో తగిలిన ఓ పిడుగుదెబ్బకు కట్టడంమీది అందమైన గోపురం నేలమట్టమయింది. ఇప్పటికీ దీని గోడలమీద అక్కడక్కడ కనిపించే రంగురంగుల పెయింటింగ్‌లు ఎక్కడా చెక్కుచెదరకుండా కాంతులీనుతున్నాయి అంటున్నారు సందర్శకులు.

ఇప్పుడు ఈ కట్టడం ఆర్కియలాజికల్ విభాగంవారి అధీనంలో వుంది. దీనికున్న చారిత్రక ప్రాముఖ్యతని దృష్టిలో పెట్టుకుని ఇది మరింత శిధిలమైపోకుండా కాపాడవలసిన బాధ్యత ప్రభుత్వంపైన వుంది.



'భయం', 'ది రోడ్', 'మనిషి', 'భువికి దిగిన తార' నవలలద్వారా 'చతుర' పాఠకులకు ఇంతకుముందే పరిచయం అయ్యాను. అనిల్ అవార్డుపొందిన 'దేముడు ఏడ్చాడు' నవలతోపాటు తొమ్మిది నవలలు రాశాను. ప్రారంభదినా ల్లో అపరాధపరిశోధన కథలు రాసిన నేను ఆ తర్వాత బాలల నవల 'అందమైన పూలతోట'కి బహుమతి పొందాను. నా రచనా జీవితంలో 'స్వాతి', 'చతుర' పత్రికలు అందించిన ప్రోత్సాహంవలననే కొన్ని ప్రత్యేక రచనలు చేయడానికి ధైర్యంచేశాను. అటుతర్వాత ఎందరో పెద్దలు నాతో అంగీకరించ కపోయినా నన్ను ప్రోత్సహించారు, ప్రోత్సహిస్తున్నారు. ఈ ప్రత్యేక సంద ర్భంలో వారికి శిరసువంచి అభివాదాలు అర్పిస్తున్నాను.

ఈ పోటీలో బహుమతి రావడం ఎంత అనుభూతి కలిగిస్తుందో, అంత భయాన్ని కలిగించింది. నా రెండువందలపైచిలుకు కథల్లో కొన్నింటికి బహుమతులు వచ్చాయి. కథలు, నవలలు, రేడియో నాటికలు, అప్పుడప్పు డు కవిత్వం, ఇంకా ఫీచర్స్ ఇలా విభిన్న ప్రక్రియల్లో కృషిచేస్తున్నాను. బాలసాహిత్యం నా ప్రాణం. ఈ పోటీని నిర్వహించిన పత్రికాధిపతులకీ, సంపాదకవర్గానికీ, న్యాయనిర్ణేతలకూ, బహుమతి విషయం తెలియగానే అభినందనలు పంపిన పెద్దలకూ, మిత్రులకు, సోదర రచయిత(త్రు)లకు వినమ్రపూర్వకంగా ధన్యవాదాలు అందచేస్తున్నాను.

ఈ సందర్భంగా నేను ప్రత్యేకంగా పేర్కొనవలసింది ఇద్దరిని. మొదటి వ్యక్తి శ్రీ కూనవరాజు కుమార్, రెండోవ్యక్తి నా శ్రీమతి జానకి. వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

# చతుర

సంపుటి: 18 సంచిక: 4 మే 1995

చక్కటి ఉద్యోగం, స్వంత ఇల్లు, అనుకూల దాంపత్యం, ముద్దులొలికే పసివాడు, చీకూ చింతా లేని జీవితం...

ఇలా సంతృప్తికరంగా, సాఫీగా గడిచిపోతున్న అతని జీవన స్రవంతిలో అలలు చెలరేగాయి.

అవి అలా, అలా పెరిగి, అత్యంత సహజంగానే... అతనిచేత... అందని సౌధాలకి నిచ్చెనలేయించాయి.

సరికొత్త వ్యాపారావకాశాలు అతన్ని రారమ్మంటుంటే, షేర్ మార్కెట్ల సంరంభం అతని భార్యని సగౌరవంగా ఆహ్వానించింది.

వాటిమధ్య అడ్డుగా వున్నాడనుకున్న పసివాడిని వేలమైళ్లదాకా తరలించారు.

అలా... ఆశల పల్లకిలో ఊరేగజూచిన ఆ భార్యాభర్తల చివరి మజిలీ ఏమిటి?

ధనంవెంబడి పరుగుతీస్తున్న నేటి మనిషి మేథోవేగాన్ని అక్షరబద్ధం చేసి, 'చతుర' నవలల పోటీలో ద్వితీయ బహుమతినందుకున్న చంద్రశేఖర్ ఆజాద్ నవల 'గట్టుమీద చేప'

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

# గట్టుమీద చేప

## పి. చంద్రశేఖర అజాద్



"నేను శ్యామ్‌ని మాట్లాడుతున్నా"

"శ్యామ్... ఎక్కడినుంచి" ఫోన్‌లో అరిచి నంతపని చేశాడు రవీంద్ర.

"హొటల్ బంజారానుండి"

"అసలెప్పుడు వచ్చావ్? ఎన్ని సంవత్సరా లయిందిరా మనం కలుసుకొని"

"అవన్నీ హాయిగా ఇక్కడ మాట్లాడుకోవచ్చు. నీ ఆఫీస్ ఎన్ని గంటలకి క్లోజ్ చేస్తారు?"

"రాత్రి ఎనిమిదిగంటలదాకా తెరిచే వుంటుంది"

"నీ విషయం చెప్పు. నువ్వెన్ని గంటలకి బయటపడతావ్?"

"అయిదు గంటలకి"

"షార్ప్‌గా ఫైవ్‌కేనా?"

"విషయం ఏమిటో చెప్పు"

"నీకు వేరే ఎంగేజ్‌మెంట్స్ లేవుగా"

"ఏమీ లేవు"

"నీకు వెహికల్ ఏముంది?"

"హీరో హొండా"

"అది ఆఫీస్‌లో ఉంటే ప్రాబ్లమ్ లేదుగా"

"ఫర్వాలేదు. అంతగా అయితే నేను మా వాడితో ఇంటికి పంపిస్తాను"

"దట్స్ గుడ్. నేను అయిదుగంటలకల్లా కారు పంపిస్తా. నువ్వు బయలుదేరి వచ్చేయ్. ఈ సాయంకాలాన్ని నువ్వు నా కోసం కేటాయిస్తున్నావ్"

"నో" అన్నాడు సీరియస్‌గా రవీంద్ర.

"ఏమైందిరా?" అన్నాడు నవ్వుతూ.

"మనకోసం కేటాయించుకుందాం"

"ఓ... సరే. నేను కారు పంపిస్తాను"

"అలాగే"

ఫోన్ పెట్టేసి 'యాద్గిర్' అని పిలిచాడు.

"సార్" అంటూ వచ్చాడు.

"నువ్వోపని చేయాలోయ్. నా బండి తీసుకెళ్ళి ఇంట్లో వదలాలి. రెండోది నా చిన్ననాటి స్నేహితుడు వచ్చాడు. రాత్రికి భోజనానికి రానని అమ్మగారికి చెప్పాలి"

"సరే" తలూపాడు.

డ్రాయర్ సొరుగులోని తాళం చెవు లందించాడు.

టైం చూశాడు.

"ఇంకోగంట వెయిట్ చేయాలి" అనుకున్నాడు.

రవీంద్రకు చాలా ఉత్సాహంగా ఉంది. అసలు శ్యామ్ ఫోన్ చేయటమే ఓ విశేషం.

"ఎన్ని సంవత్సరాలయిపోయింది" అనుకున్నాడు.

ఏపనీ చేయాలనిపించటం లేదు. పని కూడా పెద్దగా లేదు. శ్యామ్‌తో చిన్ననాటి నుండి స్నేహం. దాదాపు ఇంటర్‌వరకూ కలసి చదివారు. తర్వాత వేరే వేరే చోట్లకి వెళ్ళటంతో దాదాపు సంబంధాలు తెగిపోయినట్లే. శ్యామ్‌కి ఉత్తరాలు రాసే అలవాటు లేదు. అయితే వాడికో మంచి అలవాటుంది. ఏ ఊర్కు వెళ్ళినా అక్కడ స్నేహితులు ఎవరైనా ఉన్నారా అని విచారిస్తాడు. వారిని కలుసుకుంటాడు. ఆప్యాయంగా మాట్లాడతాడు.

అదంతా అలా ఉంచితే అసలు సిసలు ఆశ్చర్యం శ్యామ్‌గాడు హొటల్ బంజారాలో దిగటం. కారు పంపిస్తాననటం. ఇంతకూ వాడేం చేస్తున్నాడు? ఆ నడుమ ఎవరో చెప్పారు. వేరే రాష్ట్రాల్లో ఉంటున్నాడని. అందులోనూ ఏవేవో కాంట్రాక్టులు చేస్తున్నాడని. బాగా సంపాదించి ఉంటాడు. కంట్రాక్టర్ అంటే ఇంక చెప్పేదేముంది?

రవీంద్రలో రకరకాల ఆలోచనలు. సమయం గడిచినట్లే తెలియదు, 'యాద్గిరి' వచ్చి పిలిచేదాకా.

"సాబ్ మీ కోసం ఎవరో వచ్చారు"

రవీంద్ర లేచి బయలుదేరుతూ మరోసారి చెప్పాడు.

"నేను చెప్పింది గుర్తుందిగా"





తలూపాడు.

ఆఫీస్‌నుండి బయటకు రాగానే స్మార్ట్‌గా సెల్యూట్ చేశాడు అతను. లేత ఎండలో మెరుస్తోంది మారుతి-1000 సి.సి. విన యంగా డోర్ తెరిచి నిలబడ్డాడు. కూర్చోగానే డోర్ లాక్‌చేసి కారుని ముందుకు పోనిచ్చాడు. రవీంద్ర అంతకుముందు మారుతీ చాలా సార్లు ఎక్కాడు. ఇప్పుడెందుకో చాలా హాయిగా ఉంది.

కారు ఏ.సీ. చేయబడి వుంది. డ్రైవింగ్ సీట్‌ముందు ప్రత్యేక ఏర్పాట్లున్నాయి. ఓ పక్కగా క్యాసెట్లు కనిపిస్తున్నాయి. రకరకాలవి, హిందీ, ఆంగ్ల సినిమాలనుండి తెలుగు పాత పాటలదాకా.

కారు చాలా మెత్తగా కదులుతున్నట్లుంది.

"నీ పేరేంటి?" అన్నాడు.

"మోహన్ సార్"

ఇరవైఎనిమిది అంతకంటే తక్కువ వయసు ఉంటుందేమో అనిపించింది. కుర్రవాడు చాకులా ఉన్నాడు. కారు నడిపే తీరు సైతం ఎంతో ముచ్చటగా అనిపించింది. కారు అద్దాలనుండి మనుషుల్నీ, వాహనాల్నీ చూస్తుంటే పెదవులమీద నవ్వు వెలిసింది. కారుకేసి విభ్రాంతితో చూస్తున్న కొందరు వ్యక్తులు రవీంద్ర దృష్టిని దాటిపోలేదు.

"శ్యాం... నీ టేస్ట్ చాలా బాగుందిరా" అనుకున్నాడు.

బంజారాలోకి ఎంటర్ కావటం ఇది రెండవసారి. మొదటిసారి ఓ పెళ్ళి తాలూకు రిసెప్షన్‌కు వెళ్ళాడు.

"వెల్‌కమ్ మై ఫ్రెండ్ రవీంద్రా"

రెండు చేతులూ సాచి ఆహ్వానించాడు. మనిషి చాలా మారిపోయాడు. ఇదివరకు ఇంత రంగులో ఉండేవాడు కాదు. ముందు వాడి జుట్టు అంతా మాయం అయిపోయింది. బట్టతల వచ్చింది. అయినా కూడా చాలా ఆకర్షణీయంగా కనిపిస్తున్నాడు.

"ఏమిట్రా అలా నిలబడిపోయావ్?" శ్యామ్ అడుగుతున్నాడు.

"ఆ రంగేమిటి... అసలా జుట్టు ఏది? ఇంత లావయిపోయావ్. నాకంతా గందరగోళంగా ఉంది"

"తర్వాత అదంతా. ముందయితే ఫ్రెష్‌గా స్నానం చేసిరా"

రవీంద్ర ఇంకేం మాట్లాడకుండా అక్కడున్న టవల్ అందుకుని బాత్‌రూంలోకి వెళ్ళాడు. పదిహేను నిమిషాల తర్వాత మెత్తటి లుంగీ కట్టుకున్నాక తల దువ్వుకుంటూ చూశాడు. చిన్న మేకప్ బాక్స్‌లో రకరకాల ఫెర్ఫ్యూమ్స్ కనిపించాయి. అందులో ఒకటి రెండు రకాలు ఇంతకుముందు తను చూడలేదు కూడా.

అప్రయత్నంగా అందుకొని స్ప్రే చేసుకున్నాడు.

"కమాన్" అన్నాడు శ్యాం.

వేడిగా కాఫీ పొగలు కక్కుతోంది.

కాఫీలు తాగాక శ్యామ్ విదేశీ సిగరెట్ వెలిగించి ఆఫర్ చేశాడు.

రవీంద్ర అందుకున్నాడు.

"ఇప్పుడు చెప్పరా. నీ భార్య పేరేంటి? నీకు పిల్లలెంతమంది? ఏం చదువుతున్నారు? నీ జీతమెంత? వగైరా వగైరా విశేషాలన్నీ" అన్నాడు శ్యామ్.

"నా భార్య వసుంధర. మాకు ఓన్లీ సన్. సంకేత్. ఇంక నేను ఓ ప్రైవేట్ కంపెనీలో ఇంజనీర్. ఐమీన్ ఏయీగా చేస్తున్నా. నా జీతం నెలకు ఏడువేల చిల్లర వస్తుంది. ఐయామ్ వెరీ హ్యాపీ" అన్నాడు నవ్వుతూ.

"సంకేత్ పేరు బాగుందిరా. ఇంజనీర్‌గారబ్బాయి పేరులానే ఉంది. అది సరే వసుంధరగారిది అయిన సంబంధమా?"

"కాదురా. బయట సంబంధమే"

"తనేం చదవలేదా?"

"గ్రాడ్యుయేషన్ డిస్‌కంటిన్యూ చేసింది. ప్రస్తుతం ఏమీ చేయటం లేదు. ఇంక నీ

గురించి చెప్పు''

"అది సరే. ఒకబ్బాయేనా? వద్దనుకు న్నారా ఏమిటి?"

"అవును. వాడికి అన్ని అవకాశాలు కల్పిస్తే చాలు''

శ్యామ్ నవ్వాడు.

"ఇందాక ఓ మాటన్నావ్... ఐయామ్ వెరీ హ్యాపీ అనేనా. నాకు అర్థంకాక అడుగుతున్నాను. నాకెందుకనో అలా సంతోషంగా ఉండటం సాధ్యం కావటం లేదు. ఏడువేల రూపాయల ఉద్యోగంతో అంత మైమరిచిపోయే సంతోషం ఎలా దొరుకుతుందో చెప్పు'' అన్నాడు.



రవీంద్ర శ్యామ్‌కేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"అలా చూస్తావేమిట్రా బాబూ నాకు ఏవరేజీన రోజుకి వెయ్యి రూపాయలు ఖర్చవుతుంటాయి. అంటే నెలకు ముప్ఫైవేలు. సంవత్సరానికి నాలుగు లక్షలు. ఎప్పుడన్నా ఓ రాత్రి క్లబ్బులో కూర్చుంటానా? ఓ ఏభై పోవటమో ఒకటి రావటమో జరుగుతుంది. ఒకసారి జస్ట్ టూ లాక్స్ పోయాయి. ఇంకోసారి ఓ లక్ష. ఇంత జరుగుతున్నా నాకు నీ సంతోషం రాదు''

"పోనీ డబ్బులు పోయినప్పుడు బాధగా ఉంటుందా?"

"లేదురా. అప్ అండ్ డౌన్స్ అలవాటయిపోయాయి''

"అది సరే. ఇంతకూ నువ్వేం చేస్తున్నావ్?"

"విప్లవంలో భాగం పంచుకుంటున్నా'' తాపీగా అన్నాడు.

"విప్లవమా!" అదిరిపోతూ అన్నాడు రవీంద్ర.

"మరీ అంత భయపడిపోకురా. నీలి విప్లవం. మనదేశంలో అన్నీ విప్లవాలే. కొంత కాలం హరిత విప్లవం. మరికొంతకాలం శ్వేతవిప్లవం. ఇప్పుడు నీలివిప్లవం అంటే చేపల చెరువులు. రానున్నది ఆక్వా ప్రపంచం" అన్నాడు.

"అబ్బా... కొంచెం వివరంగా చెప్పరా..."

"ఏంలేదురా. నాకు రెండువందల ఎకరాల చేపల చెరువులున్నాయి. అందులో సీడింగ్ ప్లాంట్ ఉంది. ఇంకా మేమే ఫీడ్ తయారుచేస్తాం. పెద్ద ఐస్ ఫ్యాక్టరీ ఉంది. ఇలా చేపల ప్రపంచానికి అవసరమైనవన్నీ మనకున్నాయి''

"అదేంటిరా... రెండువందలెకరాలు ఉండొచ్చా?"

"మనదేముందిరా బాబూ. చిన్న చేపలమే. అంతకంటే ఎక్కువ ఉన్నవారు ఎంతో మంది ఉన్నారు''

"లాండ్ సీలింగ్' అన్నాడు అనుమానంగా.

"ఎక్కడుంది? పేపర్ మీదుంది. ఎక్కడా అమలు జరిగి చావదు. కొద్దో గొప్పో ఆ బెంగాల్‌లో ఉంది. అయినా ఏవో బినామీ





పేర్లుంటాయిలే. ఇంత సంపాదిస్తున్నా నాకు సంతోషం లేదు. అదే విషయం"

"అదే ఎందుకు?"

"తీరికుండదురా. ఇంతకూ రాజధాని ఎందుకొచ్చానో తెలుసా? మన కోస్టల్ ఏరియాలో కొన్నివేల ఎకరాల లాండ్ ఉంది. ఒకప్పుడు అది ఎందుకూ పనికిరాని చవిటిపర్ర. ఈరోజు అందులోనుండి కోట్లు పుడతాయి. ఓ మినిస్టర్‌గారిని కలిశా. ఆయన వంద ఎకరాలకు ప్లాన్ చేస్తున్నాడు. పేరు ఆయనది ఉండదు. లాభాలు మాత్రమే పుచ్చుకుంటాడు''

"పనయిందా?"

"అవుతుంది. గొడవలుగా ఉంది. అంతా ఇంటర్నల్ ప్రాబ్లమ్. రొయ్యల చెరువులు ఎవరికి చేదంటావ్?"

రవీంద్ర నవ్వాడు.

"అలా ఎందుకు? కొంతమంది గ్రానైట్ పొలాల్నీ ఇంకొందరు ఇతర ఖనిజాల్నే పంచుకుంటే గొడవ ఉండదుగా''

"చాలకేగా ఈ గోలంతా. అది సరే. నీకో పదెకరాలపైన పొలం ఉండాలికదా. ఉందా?"

"ఉందిలే. ఏం చేయాలో అర్థంకాదు. మనం ఇటు వచ్చాం. అది కౌలుకిచ్చాం. సంవత్సరానికి కొంత మొత్తం వస్తుంది. బ్యాంక్ వడ్డీ కూడా రాదు. అమ్మి ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో పడేస్తే నయమనిపిస్తూంది'' అన్నాడు.

"పిచ్చివాడా. అసలు ఆ ఏరియా అంతా చేపల చెరువులు అయిపోతుంటే ఇప్పుడు అమ్ముకోవటం ఏమిటి? అసలు నువ్వే ఎందుకా చేపల చెరువులు తవ్వించకూడదు. నా దగ్గర పొలాలుండే ఇదంతా చేశాననుకున్నావా? లీజ్‌కి తీసుకున్నాం. చాలా చమత్కారాలు చేశాం"

"నేనా? నాకేం అనుభవం ఉంది''

"భలేవాడివే. ఎవరికి మాత్రం ఏ అనుభవం ఉంది. అందరూ మొదట్లో నేర్చుకున్నవారే. కష్టాలు పడ్డారు. నష్టాలు పడ్డారు. అనుభవం వచ్చింది. ఈరోజు జీవితాన్ని ఎంజాయ్ చేస్తున్నారు. అందులోనూ ఇంజనీర్‌వి. అయినా ఇలా ఎంతకాలం ఈ ఉద్యోగంలో ఉంటావ్. ఆ డబ్బులు చాలవూ-చాలకుండా ఉండవు. మరేం అనుకోనంటే చెబుతా. నీ జీతంతో రెండురోజులు తృప్తిగా ఈ బంజారాలో ఉండగలమా?"

రవీంద్ర కళ్ళు విశాలం అయ్యాయి.

"అలా చూడకురా. నాకంతే చాలనుకుంటే అది వేరే విషయం. ఇంతకీ నీకు ఇక్కడ ఓ ఫ్లాట్ ఉందా?"

"లోన్‌మీద తీసుకున్నా. నాలుగు సంవత్సరాలవుతోంది''



అంటే మరో దశాబ్దానికి ఆ ఇంటి ఓనరువి అవుతానంటావ్. ఈరోజు దేశంలో చాలా మార్పు వచ్చింది. ఇంతకుముందెప్పుడూ ఇలాంటి అవకాశం రాలేదు. ఇప్పుడు తెలివిగలవాడిది ప్రపంచం. నువ్వు ఎలా అయినా సంపాదించు. నో ప్రాబ్లమ్. నీ దగ్గర

ఎంత ఉంది అనేది కావాలి. ఈ పిరియడ్ ఓ టెన్ ఇయర్స్ ఉంటుంది. ఈలోగా నాలుగు రాళ్లు వెనకేసుకోకపోతే వాడో వెర్రివాడి కింద లెక్క. అందుకు మొదటి మార్గం పాలిటిక్స్. ఆ పని మనం ఇప్పుడు చేయలేం. ఓ ప్రాసెస్‌లో ఆ కెరీర్ నిర్మించుకోవాలి. అందుకని నీలి విప్లవంలోకి నువ్వొ వచ్చావనుకో వితిన్ ఫోరార్ ఫైవ్ యియర్స్ నీ స్టేటస్ మారిపోతుంది. ఉద్యోగానికి రాజీనామా చేయమననుగానీ అంతగా అయితే ఎక్స్‌పెరిమెంటల్‌గా రెండు సంవత్సరాలు శెలవు పెట్టి చూడు.

రవీంద్ర వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు.

ఆలోచిస్తుంటే తను శ్యామ్‌ముందు అల్పుడిలా కనిపిస్తున్నాడు. ఇంతకుముందు ఎప్పుడూ చదువులోనూ, ఆటల్లో కూడా శ్యామ్ తన దగ్గరికి కూడా చేరుకోలేకపోయేవాడు. అలాంటిది ఈరోజున వాడిని చూస్తుంటే అసూయ కలగటం లేదుగానీ చాలా ముందున్నాడు.

వాడి మాత్రం తెలివితేటలు తనకులేవా?

"ఏమిట్రా ఆలోచిస్తున్నావ్?"

"ఏం లేదురా?" అన్నాడు అడ్డంగా తలూపుతూ.

"ఆలోచించుకో. చేతిలో నయాపైసా లేకుండా వ్యాపారం చేస్తున్నవారున్నారు. బ్రెయిన్... బ్రెయిన్ కావాలి. నువ్వు పెట్టుబడి పెట్టనవసరంలేదు. బ్యాంక్స్ లోన్స్ ఇస్తాయి. ఎక్కడన్నా పనికాలేదనుకో. ఓ పీటర్‌స్కాట్ బాటిల్‌తో పని అయిపోతుంది. ఈ దేశంలో కొన్ని పనులు మందుతో అవుతాయి. మరికొన్ని డబ్బుతో. ఎక్కడ ఏది అవసరం అయితే అది ఉపయోగించాలి. అది సరే. డ్రింక్ చేస్తావా?"

తల అడ్డంగా ఊపాడు.

"అసలు అలవాటు లేదా ఏంటి కొంపతీసి"

"అదేంకాదు. ఎప్పుడన్నా పార్టీలు చేసుకుంటాం. రెగ్యులర్ హాబిట్ లేదు"

"నిజమేలే. ఆ జీతంతో రోజూ తాగితే నాశనమేకదా. ఈరోజు మన సంతోషం కోసం నేను 'షివాజ్ రీగల్ ఓపెన్ చేస్తా" అన్నాడు.

రాత్రి పదిగంటలు దాటింది.

శ్యామ్ మాట్లాడుతూనే ఉన్నాడు.

"నా భార్య దమయంతి. ప్రతివ్రతల పేరా?" అని నవ్వి తిరిగి కొనసాగించాడు.

"ఇద్దరు పిల్లలు. ఓ ట్వంటీ లాక్స్‌తో ఇల్లు కట్టించా. నువ్వోసారి రావాలి. గదుల్లో ఎక్కువభాగం ఏ.సీ. చేయించా. పాలరాతితో గోడలు మెరుస్తుంటాయి. చుట్టుపక్కల వారందరికీ మనమంటే ఈర్ష్య. నేను ఖర్చుపెట్టినంతగా ఎవరూ ఖర్చుపెట్టరు. సాయంకాలం అయితే చాలు. ఫ్రెండ్స్... కబుర్లు... మందు... అదో ప్రపంచం. బాగానే ఉంది. కానీ నీలా ఎవడన్నా హాపీగా ఉన్నా అంటే కోపం వస్తుంది. యూస్‌లెస్ ఫెలోస్ ఆ మాట అంటారు. వెయ్యికీ నాలుగువేలకీ సంతృప్తి పడతాననేవాడు దేశద్రోహి తెలుసా?"

"అవును" అన్నాడు రవీంద్ర.

పదకొండుగంటలయింది.

"తిన్నా. చికెన్‌లో ఇదో వెరైటీ... అసలు నీకు తెలుసా... ఓ వందరకాల చికెన్ స్పెషల్స్ నేను తిన్నా. ఇంకెన్ని ఉన్నాయో ఈ ప్రపంచంలో. ముందీ దేశాన్ని చూడటం పూర్తయితే ఈ ప్రపంచం చుట్టిరావాలనుంది. నువ్వు ఏం చూశావురా. భాగ్యనగరమూ, మన ఊరూ అంతేగా. చూడ్రా... మారుతీకారులో ఈ ప్రపంచాన్ని చూడు"

"తప్పకుండా" అన్నాడు రవీంద్ర.

పన్నెండుగంటలు దాటింది.

"నా థీరీ ఏమిటంటే మనిషికి తృప్తి ఉండకూడదు. ఉంటే వాడు మనిషి కాదు. దేశం తృప్తి ఎక్కువై చెడిపోయింది. మరి నువ్వు ఏమైపోతావో నువ్వే నిర్ణయించుకో. ఐ




డోంట్ కేర్. నేను రేపు ఉండను. తెల్లవారగానే వెళ్ళిపోతా. మళ్ళీ ఎప్పుడు కలుస్తామో నాకు తెలియదు. ఇంతకూ నువ్వు ఇంజనీరుగా ఉంటావా? నీలి..." ఆగిపోయాడు మాటలు రాక.

రవీంద్ర తలూపాడు.

ఒంటిగంటయింది.

రవీంద్ర తిరిగి తన బట్టలు ధరించాడు.

"నాకు చాలా సంతోషంగా ఉంది రవీంద్రా. నీకెప్పుడన్నా ఏమైనా సహాయం కావాలంటే నాకు ఫోన్ చెయ్యి. నా విజిటింగ్ కార్డ్ తీసుకో అన్నాడు"

కార్లో ఇంటికి వెళ్తున్నప్పుడు మరే ఆలోచనలూ లేవు.

ఎందుకో ప్రశాంతంగా ఉంది. ఈ ప్రపంచాన్ని జయించినంత సంతోషం కలిగింది.

నల్లటి అద్దాలనుండి రంగు రంగుల లైట్లు దర్శనమిస్తున్నాయి. నగరమే తన ఎస్టేట్‌లా అనిపించింది.

రాత్రి పడుకున్నాడేగాని శ్యామ్ చెవుల దగ్గరికి చేరి అరుస్తున్నట్లుగా అనిపించింది.

ఎప్పటికి నిద్రపట్టిందో తెలియదు.

★ ★ ★

లంచ్ అవర్లో మాధవరావుని బండిమీద ఎక్కించుకొని ఓ హెూటల్‌కు వెళ్ళాడు రవీంద్ర. ఇంటి దగ్గర ఉదయం వసుంధరతో ఎక్కువగా మాట్లాడలేదు. అసలు నిద్రలేవటమే ఆలస్యంగా లేచాడు. ఇంటికేసి చూస్తుంటే అసంతృప్తిగా అనిపించింది. ఇంతకు ముందు గృహప్రవేశం చేస్తున్నప్పుడు ఎందుకో గర్వంగా అనిపించింది. ఇంత విశాల నగరంలో నాకూ ఓ ఇల్లుంది అనుకోగానే అనేకరకాల భావాలు కలిగాయి. అందులోనూ ఆ రోజు ఇల్లు లేనివారు వచ్చి చాలా బాగుందని అంటున్నప్పుడు మరికాస్త గర్వం కలిగింది.

టూ బెడ్‌రూమ్ ఫ్లాట్ అది. రెండు గదుల్లో షోకేసులున్నాయి. వాటిని రకరకాల బొమ్మల్తో అలంకరించింది వసుంధర. కలర్ టీవీ ఉంది. వీసిపి కూడా కొన్నారు. ఆ నడుమ అది ఎవరికైనా అమ్మేసి వీ.సి.ఆర్. కొనుక్కుంటేనో అనిపించింది. ఇంతలోనే రకరకాల ఛానల్స్‌తో కేబుల్ టీవీలు వచ్చాక అనవసరం అనిపించింది. గాడ్రేజ్ ఫ్రిజ్ ఉంది. వాషింగ్ మెషిన్ ఉంది. ఇంకా కిచెన్‌కి చెందిన రకరకాల సామాన్లు ఉన్నాయి.

వాటన్నింటినీ చూసుకుంటే ఎంతో సంతోషంగా అనిపించేది.

వసుంధరతో కూర్చున్నప్పుడు వారి సంభాషణల్లో ఈ అంశాలే వచ్చేవి.

"ఇంకా మనకేం కావాలి?"

"ఇంకా ఏమీ అవసరం లేదండి. ఆ స్వీపింగ్‌మిషన్ కొంటే చాలు''

పంట తాలూకు కౌలు రాగానే అవి కొనేయటం జరిగేది. అదేమిటో ఎప్పటికప్పుడు ఈ ఒక్క వస్తువు కొనుక్కుంటే చాలుకదా అనిపిస్తుండేది. అది కొనేలోగా ఇంకో వస్తువు తయారై మార్కెట్లో కొచ్చేది. అదే అవసరంలా అనిపించేది.

ఏదిఏమైనా అలా కొనటంలో ఓ ఆనందం. కొనేదాకా ఎదురుచూడటంలో మరో ఆనందం లభించేది.

కింద ఫ్లోరింగ్ నిన్నటివరకూ బాగానే ఉంది. ఇప్పుడెందుకో అందవిహీనంగా అనిపించింది. ఆ గోడలకు తనకు ఇష్టమైన రంగులే వేయించినా అవి వెలిసిపోయినట్లుగా ఉన్నాయి.

శ్యామ్ నన్ను హిప్నటైజ్ చేశాడు అనుకున్నాడు రవీంద్ర.

"ఇదేదో తక్షణం తేల్చుకోవాల్సిన సమస్యలా ఉంది. లేకపోతే నన్ను తినేసేలా ఉంది'' అనుకున్నాడు.

అందుకే మాధవరావుని ఆశ్రయించటం. మాధవరావు ఎకౌంటెంట్. లెక్కల విష

యంలోనే కాదు. చాలా విషయాల్లో ఖచ్చితంగా ఉంటాడు. రవీంద్ర అంటే అభిమానం ఉంది. ఇరువురూ తమ వ్యక్తిగత విషయాలు చెప్పుకుంటారు.

హెూటల్‌లో ఓ మూల కూర్చుని ఆర్డరిచ్చాక రవీంద్ర ఆరంభించాడు.

"నాకీ జీవితం బోర్‌గా ఉందండి''

"అలా అయితే ఓ పదిరోజులు సెలవుపెట్టి ఎటయినా తిరిగిరండి. తిరిగితే బాగానే ఉంటుంది'' అన్నాడు మామూలుగా.

"నాకో విషయంలో మీ సలహా కావాలి''

"అడగండి''



"నేను రెండు సంవత్సరాలు సెలవు మీద వెళ్ళాలనుకుంటున్నాను''

"ఇంకా చదవాలనా?"

"కాదండి... వ్యాపారం చేద్దామనుకుంటున్నా''

"లేనిపోని రిస్కులోకి దిగుతానంటారేమిటి?"

"రిస్క్ ఎక్కడ లేదులెండి. రిస్క్ చేస్తేనేకదా. ఏమైనా సాధించగలిగేది'' అన్నాడు రవీంద్ర.

"మీరెన్నన్నా చెప్పండి. మీరు ఇంజనీరు. మీరు చెప్పుల దుకాణం పెడతానంటే ఎలా? డాక్టర్ చదివాడు. మందుల దుకాణం పెడతానంటాడు. దానికంటే ఇది లాభం కావచ్చు. కానీ అసలు చదువు ఎందుకు చదవటం. ఆ పనిముందే చేస్తే దేశానికి నీమీద ఇన్వెస్ట్ చేయటం తప్పుతుందికదా''

"అది సరేలెండి. నేను ఆ విషయాల గురించి అడగటం లేదు. నాకూ మీకు అవి తెలుసు. నాకు రెండు సంవత్సరాల సెలవు దొరుకుతుందికదా''

"ముందు సంవత్సరం దొరుకుతుంది. తర్వాత అలా పెంచుకుంటూ పోవచ్చు. సమస్య లేదు''

"చేపల చెరువులు తవ్వాలనుకుంటున్నానండి''

"తవ్వండి'' అన్నాడు మామూలుగానే.

"దాని గురించే''

"దాని గురించి నాకేం తెలియదు. అయినా మీరో నిర్ణయానికొచ్చేరులా ఉంది. ఇంక ఎవరేం చెప్పినా ఆగదులెండి. ముందోపని చేయండి. ఈ విషయంలో మీ ఇంటి దగ్గర మీ మిసెస్‌ని అడిగి చూడండి. చేపల చెరువులకేం బ్రహ్మాండంగా ఉన్నాయి. ఈ నడుమ వాటిమీద టాక్స్ వేశారు. పచ్చిసరుకుమీద టాక్స్ దారుణం అని రైతుల గోల. మరి అది నిజమో కాదోగాని చేపల ఎగుమతికి ఓ విమానం కావాలన్నారంట"

"అవును... అప్పుడుకదా, గవర్నమెంటుకి అనుమానం వచ్చింది. జనం చెప్పుకునేదాన్ని బట్టి చేపల చెరువులు బంగారమే. మరి జాగ్రత్తగా చేసుకున్నవాడికి బాగానే ఉంటుంది. ఇక్కడుండి చేయిస్తానంటే అది కుదిరేది కాదు'' అన్నాడు రవీంద్ర.

"అవును'' అన్నాడు మాధవరావు.

అతను దాదాపు ఓ నిర్ణయానికి వచ్చాడు.





"చాలా సంతోషం మాధవరావుగారూ. నా లీవ్ విషయంలో మీరు సహకరించాలి'' అన్నాడు.

"దాందేముంది. మీరేదో బాగుపడుతా నంటే కాదనటానికి నేనెవరిని. అయితే నాకు మాత్రం అసంతృప్తే. ఇంజనీర్ అయివుండి చేపలేంటండి. ఇంక మీ ఇష్టాన్ని కాదనటానికి నేనెవర్ని?"

రవీంద్ర నవ్వాడు. మాధవరావుని ఆఫీస్‌లో దింపి ఇంటికి వెళ్ళాడు.

ఇంటి దగ్గర నారాయణ ఉన్నాడు.

నారాయణ రవీంద్ర పొలాల్ని కౌలుకు చేస్తున్నాడు. అతనికంటూ వేరే పొలం లేదు. ఈ పొలంమీదే ఆధారపడటం. ముందుగా డబ్బు ఇవ్వలేడు. పంట మాత్రం ఇస్తాడు. అయితే వానలూ, వరదలూ, ముంపులూ, ఇలా నష్టాలు ఎదురైనప్పుడు తనతోపాటు భరించాల్సిందే.

ప్రతి సంవత్సరమూ తనకే ఇచ్చినా ఏ సంవత్సరానికా సంవత్సరం ఒప్పందానికి రావలసిందే.

"దండాలండి రవిబాబుగారు. మీతో ఓ ముక్క అనిపించుకుపోదామనివచ్చా'' అన్నాడు.

"నారాయణా ఈసారికి కష్టమయ్యా''

"అదేంటి బాబో... మిమ్మల్నే నమ్ముకు న్నా పొట్టమీద కొట్టబాకండి''

"అది కాదయ్యా బాబూ. ఈ హైదరా బాద్‌లో మాకొచ్చే జీతం చాలటంలేదు. పెట్రో ల్‌కీ లోన్లు కట్టుకుంటానికి సరిపోతుంది. మనూర్లో చేపలచెరువులు మొదలయ్యాయిక దా. నేను కూడా చేపల చెరువులు తీయించాల నుకుంటున్నా. అంతేగాని నిన్ను కాదని ఇంకో కరికి ఇవ్వటం కాదు''

"అవుననుకోండయ్యా'' అన్నాడు.

"ఇంకెవరి పొలం అయినా చూసుకో మరి''

"ఎక్కడున్నాయండి బాబు. మీరు చెరువు తవ్వితే ఇంక దానిపక్క చేను నాశనవే. నీరూరిపోయి పంటలు పండవు. అంచేత పక్కపొలం కూడా చెరువు తీయించాల్సిందే. ఊరంతా అలా చెరువులయిపోతన్నాయండి''

"మరేం చేస్తానంటావ్?" అన్నాడు రవీంద్ర.

"ఏం చేసేదేముంది బాబూ. కూలిపని చేసుకోవాలి. మీరు కౌలు కివ్వకపోతే కూలికి పెట్టుకోండి. ఏదైతే ఏంటి పొలం చూసు కుంటూ బతుకుతాం"



"ఇంకా సొంతం అనుకోలేదు. ఓ ఆలోచన ఉంది. ఇప్పుడు పొలాన్ని చెరువు చేయాల న్నా డబ్బులు కావాలి. ఈ విషయాలన్నీ చూసుకోవాలికదా. బ్యాంక్ నుండి లోన్ రా వాలి. అంతగా అయితే ఈ సంవత్సరం పంట వేద్దాం అనుకుంటే మాత్రం నీకు కబురు చేస్తాను. ఏమంటావ్?"

"నేననేదేవుంది బాబూ... భూవి తవరిది. తవరెలా చేయమంటే అలానే చేద్దాం"

"సర్లే భోంచేశావా?"

"అమ్మగారు ఊరుకుంటారేంటండి''

"నేనుంటా''

నారాయణ చేతులు జోడించాడు. వసుంధర దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

"వసూ... ఈ విషయం గురించి నీతో మాట్లాడదామని వచ్చాను. నాకీ నగరం నచ్చటంలేదు'' అన్నాడు రవీంద్ర.

వసుంధర ఆశ్చర్యపోయింది. హైదరాబాద్ నచ్చలేదని ఇంతవరకూ ఎప్పుడూ అనలేదు. వేసవికాలంలో తమ ఊరువెళ్ళినా పదిరోజులు ఉండటానికి నానా ఇబ్బంది. పడటమే. ఎప్పుడెప్పుడొచ్చి నగరంలో వాలిపోదామా అనిపించేది. అంతేకాదు హైదరాబాద్‌లో ఉండటమే ఓ విశేషంగా ఆ ఊర్లో చాలామంది భావిస్తున్నప్పుడు రవీంద్రతో పాటు తనూ గర్వపడేది.

"ఇదేమిటండోయ్'' అంది.

"ఈ నగరం మనలాంటి వారికోసం కాదు. అందుకే మనం చేపల చెరువులు తవ్వించుకుందాం. నాలుగు సంవత్సరాలు కష్టపడితే చాలు. ఇంక మనం జీవితం గురించి ఆలోచించాల్సిన అవసరంలేదు''

"ఉద్యోగం"

"సెలవు పెడతాను. ఈ క్షణంనుండి జీవితంలో సెటిల్ కావటమే నా ఆశయం" అన్నాడు రవీంద్ర.

వసుంధర తలూపింది.

"తలూపటం కాదు. నీ అభిప్రాయం చెప్పాలి''

"నాదేముంది?"

"రేపు మీ అమ్మా నాన్న బంగారంలాంటి ఉద్యోగం వదులుకున్నారు అంటే కాదు''

"సెలవేగా పెడతానంటున్నారు''

"అయినా వాళ్ళకి అనుమానమే''

"అనుకుంటే అనుకోనీయండి. పెద్దవాళ్లు ఏదో చెబుతారు. మనపని మనం చేసుకుపోవటమే''

"అయితే నీకు అభ్యంతరం లేదంటావ్''

"చేపల చెరువులకి అభ్యంతరం ఏమిటండి. మొన్న రాజేశ్వరిగారు చెబుతున్నారు. వాళ్ల ఊళ్లో ఇప్పుడు ఎవరిని కదిపినా లక్షలేనంట. వందలూ, వేలూ పోయాయి. చిన్న ఊరే. గోతాల్లో డబ్బులు కూరుకు తీసుకొస్తున్నారంట. ఎవరిని కదిలించినా బంగారమే. నగలేనా, గాజులేనా, వడ్డాణాలేనా ఆ సోకులు చూడలేం. ఇంక అక్కడి ఇళ్ళ గురించి చెప్పాలా. రాజభవనాలంట. మీకు తెలుసా ఈ నడుమ ఓ పల్లెలో ఒకేసారి నలభై హీరోహోండాలు దిగాయంట. కంపెనీవారే ఆశ్చర్యపోయారు''

"నిజమా!"

"రాజేశ్వరిగారు చెప్పిందండి బాబూ. ఆ డబ్బు ఏం చేసుకోవాలో తెలియక ఛస్తున్నారు. సినిమాలు కొంటారంట. కొంతమందయితే సినిమాలు తీస్తున్నారంట. ఇంక ఆడాళ్ళ సంగతి చెప్పాలా. కళ్లు జిగేల్‌మంటాయి. రోజువారీ చీరలు వెయ్యి రూపాయలకి తక్కువది కట్టరు. ఏ పెళ్ళిళ్ళు లాంటివో జరిగితే ఇంక చెప్పాలా. మీకు తెలుసో తెలియదో ఈమధ్య లక్షరూపాయల చీరకు మద్రాసెళ్ళి ఆర్డరిచ్చారు. అడ్వాన్స్‌గా ఏభైవేలు ఇచ్చారంట"

రవీంద్ర చేపల చెరువుల గురించి విన్నాడుగానీ ఇలాంటి విశేషాలు వినటం ఇదే మొదటిసారి.

"కాకపోతే మన బంటీగాడి గురించే ఆలోచిస్తున్నా'' అందామె.

"చూద్దాం. ఇవ్వాళ రేపు ఎక్కడ బడితే అక్కడ మంచి ఎడ్యుకేషన్ ఉంది'' అన్నాడు రవీంద్ర.

"అలా అయితే ఓ పనిచేద్దాం. మనకెటూ బండి ఉందికదా. మనూరు దగ్గరి టౌన్‌లో





ఉందాం. నేను అవసరమైనప్పుడు వెళ్లి వస్తుంటా. అక్కడ కేరళనుండి వచ్చినవారి కాన్వెంట్ ఉంది. బాగానే చెబుతున్నారంట" అన్నాడు తనే.

"మీ ఇష్టం"

"ముందోసారి నేను ఊరు వెళ్లి కనుక్కొస్తా''

"ఏం కనుక్కొస్తారు'' అంది వసుంధర.

"ముందు లోన్‌కి అప్లికేషన్ పెట్టాలికదా!"

"అదివ్వటానికి రెండు సంవత్సరాలు పడుతుందనుకోండి. అప్పటిదాకా చెరువులు తవ్వరా?"

"అలా అని కాదు''

"నేను చెప్పేది వినండి. ముందు లోన్‌కి అప్లికేషన్ పెట్టండి. బ్యాంక్‌లో తెలిసినవారున్నారేమో చూడండి. ఆ పని అలా జరుగుతుంటుంది. ఈలోగా లాకర్లో ఉన్న గోల్డ్ తీసి లోన్ తీసుకుందాం. ఆ డబ్బుతో పని మొదలుపెడదాం. పని ఆగదు. ఓ సంవత్సరం నష్టపోయామంటే ఒక క్రాపు పోయినట్లేకదా''

రవీంద్ర భార్యకేసి ఆశ్చర్యంగా చూశాడు.

"బాగానే వుంది''

"ఆలస్యం అమృతం విషం అన్నారు. మీకీ ఆలోచన ఎందుకొచ్చిందో కానీయండి. వెంటనే రంగంలోకి దిగండి'' అంది వసుంధర.

"అలాగే... ముందు సెలవు విషయం చూస్తాను'' అన్నాడు.

సరిగ్గా నాలుగు రోజులకల్లా ఆ కార్యక్రమం పూర్తయింది.

"ఏంది సాబ్... ఇదే ఆఖరి చూపా'' అన్నాడు యాదగిరి.

"ఏదో తిప్పలు పడుతున్నాం. సక్సెస్ అయ్యాం అనుకో. మళ్లీ ఈ ఉద్యోగం ఎందుకయ్యా. అక్కడ మనదే రాజ్యం. మనకింద పనిచేసేవారేగాని, మనమీద పెత్తనం చెలాయించేవాడు ఉండడు. అయినా హైదరాబాద్ ఏదో పనిమీద రావాలి. వచ్చినప్పుడు కలుస్తాగా'' అన్నాడు.

"మాధవరావుగారూ! మేం ఇల్లు ఖాళీచేస్తాం. మీకు తెలిసిన మంచివాళ్లని చూసి పెట్టండి. అవసరమైతే వెంటనే వెకేట్ చేయగలిగేలా ఉండాలి. తగాదా మనుషులుంటే తలకాయనొప్పి''

"చూద్దాంలెండి'' అన్నాడు.

ఆఫీస్‌లో ఇతర మిత్రులందరికీ చెప్పి సెలవు తీసుకున్నాడు.

ముందుగా ఊరు వెళ్లాడు. ఆ చుట్టుపక్కల ఊర్లలో ఈ చెరువులు వేగంగా అభివృద్ధి చెందాయి. ఎందుకో ఇప్పటికిగాని ఈ ఊర్లో వేడి పుట్టలేదు. ముందు బ్యాంకుల్లో పనిచేస్తున్న మిత్రుల వివరాల గురించి అడిగి తెలుసుకున్నాడు. వారిని కలుసుకుని లోన్ విషయం గురించి అడిగాడు. వారి సలహా మీద అన్నీ పూర్తిచేసి అప్లికేషన్ సబ్‌మిట్ చేశాడు.

గోల్డ్‌లోన్ విషయంలో ఏర్పాట్లు కూడా పూర్తయ్యాయి.

అప్పుడు ఓ మిత్రుడు చెప్పాడు.

"రవీంద్రా... కొత్త వ్యాపారంలోకి దిగుతున్నావు. ఈ వ్యాపారం ఇంతకుముందునుండే చాలామంది చేస్తున్నారు. వారి అనుభవాలు తెలుసుకో. ముందు ఈ రంగం గురించి నీకేం తెలియదు. దాని గురించి కనీస పరిజ్ఞానం అవసరం. అందుకే ముందా కల్చర్ జరుగుతున్న ప్రాంతాలు చూసిరా''

రవీంద్రకు ఆ సలహా నచ్చింది.

ఆ మిత్రుడే ఆ ఏర్పాట్లన్నీ పూర్తిచేశాడు.

★ ★ ★

నరసింహరాజుగారింట్లోకి వెళ్తుంటే ఓ వంద సంవత్సరాలు వెనక్కి వెళ్తున్నట్లుగా అనిపించింది రవీంద్రకి. విశాలమైన ఇల్లు. పైన పెంకేగాని ఆ గదుల్లో ఎటుచూసినా టేకుసామానే. టేకుతో బీరువాలు చేయించా

రు. టేకు మంచాలు చేయించారు. ఆ మంచాలకు రెండుపక్కలా అద్దాలు అమర్చారు. ఇంకా స్తంభాలుగా టేకుకర్ర... పైన దూలాలు టేకువి. అందులోనూ పనితనం మేళవించుకుని అపురూపంగా కనిపించాయి. ఆ ఇంటిముందు పిచ్చిమొక్కలు మొలిచాయి.

అక్కడ ఎవరూ ఉండరు. పిల్లలందరూ టౌన్ వెళ్లిపోయారు. నరసింహరాజుగారి అమ్మ మాత్రం అక్కడ ఉన్నారు. ఆమె కొన్ని దశాబ్దాలుగా అక్కడే జీవిస్తున్నారు. ఆ ప్రాంతాన్ని విడిచిపెట్టి వెళ్లడం ఆమెకి ఇష్టంలేదు. అందుకే మరో చుట్టంతో అక్కడే ఉంటున్నారు. ఆ చుట్టానికి వాళ్లే ఆధారం. ఇంకెవరూ లేరు.



గోడలకు తైలవర్ణ చిత్రాలు. చూడటానికి అదో జమిందారు వంశానికి చెందిన ఇల్లులా ఉంది. కచేరీ జరపటానికి ఓ హాలు. అక్కడ జనం కూర్చోవటానికి ప్రత్యేక ఏర్పాట్లు ఉన్నాయి. ఓ భాగంలో చెరువుల పని చూడటానికి పెట్టుకున్న మనిషి కుటుంబంతోసహా ఉంటున్నాడు.

రాజుగారు చుట్ట వెలిగించుకుని రవీంద్రని చెరువుల చెంతకు తీసుకెళ్లాడు. రవీంద్రకి కళ్లు చెదిరాయి. అది చెరువులా లేదు. సముద్రంలా కనిపిస్తోంది. అలాంటివి రెండు, మూడు సముద్రాలు కనిపించాయి. చిన్నప్పుడు చదువుకున్న మూడువైపులా నీరు ఓపక్క భూమి అనే మాట గుర్తొచ్చింది. అవికాక చిన్నచిన్న కాలువల్లాంటి చిన్న చెరువులు కనిపించాయి. ఓపక్కన చిన్నచిన్న పడవలు కనిపించాయి.

చెరువుల నడుమ భాగంలో అక్కడక్కడా కర్రలు నాటారు. చిన్న చెరువులదగ్గర కొన్ని వరసల్లో రంగు రంగుల కాగితాలు కట్టారు. అవి గాలికి కదిలినప్పుడు జిగేల్‌మంటున్నాయి. మరికొన్నిచోట్ల కొన్ని వరుసలుగా నైలాన్ తాడు కట్టారు.

రాజుగారు చుట్ట అవతల పారేసి ఉమ్మేశాక మాట్లాడటం ఆరంభించారు.

"ఇదిగో ఈ చేపల విషయంలోమాత్రం తెలుగోడు మొనగాడబ్బాయ్'' అన్నాడు.

రవీంద్రకి నవ్వు వచ్చింది.

"దేశంలో మన ఆంధ్రావాడు తీసినంత 'ఈల్దు' ఎవరూ తీయలేరంటే నమ్ము. మామూలుగా ఆంధ్రుడు ఆరంభశూరుడు అంటారుకదా! చేపల విషయంలో అది కుదరదు. మొత్తం దేశాన్ని మన ఆంధ్రాచేప కరిచేసుద్ది. అసలిది ఎక్కడిదాకా పోతోందో తెలుసా?" అనడిగాడు.

రవీంద్ర తల అడ్డంగా ఊపాడు.

మీసాలు సవరించుకుంటూ చెప్పాడాయన. "మొదట్లో కలకత్తా మాత్రమే పంపేవాళ్లు. అక్కడినుంచి బెంగాల్‌లో ఇతరచోట్లకి పంపించుకునేవారు. ఇప్పుడు కలకత్తా, హౌరా, అసన్‌సోల్, సిలిగురి, అస్సాంరాష్ట్రంలోని గౌహతి, ఇంకా చైనా బోర్డర్ దగ్గర 'తీన్‌చుకియా' అనే ఊరుంది. అక్కడికెల్తున్నాయి. త్రిపుర రాష్ట్రానికి ఎల్తున్నాయి. అగర్తలాకన్నమాట. ఇంకా మేఘాలయా రాజధాని

షిల్లాంగ్ కూడా పంపిస్తున్నారు. ఇవాళ అక్కడ చేప తినటం ఓ సంప్రదాయం అయిపోయింది. ఆరకంగా చేశాం. గొప్పే నంటావా'' అని ఆయన నవ్వాడు.

ఆ నవ్వు చూశాక రాజుగారి వంశం జమీందారుల అంశ కలదే అని నిర్ణయానికి వచ్చాడు.

"ఇదివరకు ఇలా చేపను పెంచటంలేద య్యా. నదుల్లో పెరిగి పెద్దయితే వాటినే వేటాడి తినేవారు. మరే మహానుభావుడు కనిపెట్టాడో తెలియదుగానీ నిజంగానే పెద్ద విప్లవమేనయ్యా. నదులకి వరదలొస్తాయిక దా. అప్పుడు నీరు సుళ్లు తిరుగుతుంటుంది. ఆ సుడిలో ఆడా మగా చేపలు కలిసి గుడ్లు పెడతాయి. అవి కాలవలద్వారా చెరువుల్లోకి వచ్చిపడతాయి. అయ్యే పెరిగాక పాటలు పాడుకునేవారు. అంటే వాటిని ప్రత్యేకంగా పెంచేవారు కాదు. ఇప్పుడు పంచాయితీ చెరువుల్లో కూడా సీడ్ వేసి పెంచుతున్నారులే. ఇక్కడకొచ్చేసరికి ఆ చేపగుడ్లని కృత్రిమ పద్ధతుల్లో ఉత్పత్తి చేసి పెంచుతారు. అదంతా మావాడి హేచరీలో నువ్వు చూద్దువు గానిలేగాని నువ్వు చెరువు తీయించాలంటే కనీసం పదెకరాల చెరువుండాలి. అంతకంటే తక్కువయితే చేప బాగా పెరగదు. ఎంత పెద్ద చెరువయితే అంత మంచిది. మేం నలభై ఎకరాల చెరువు తవ్వించాం. నీదేమా త్రం ఉంటుంది'' అన్నాడు.

"పదెకరాలుంది''

"మరింకో రెండెకరాలుంటే అందులో సీడ్ పెరుగుద్దికదా!"

"తీసుకోవాలంటారా?" అన్నాడు.

"భలేవాడివే. కొంటే మంచిది. లేదంటే లీజుకన్నా తీసుకో. అందులో సీడ్ పెరుగుతూ వుంటుంది. పెద్దయినాక తీసి పెద్ద చెరువులో పడేస్తాం. తిరిగి సీడ్ చిన్న చెరువులో పెంచు కుంటాం. అదిసరే పనెప్పుడు మొదలు పెడ తన్నావ్''

"మీరే చెప్పండి. అంతా మీ చేతులమీద జరిగితే నాకు సంతోషం"

"నాకేడ తీరుద్దిరా మగడా'' అన్నాడా యన.

"కనీసం తవ్వేరోజున రావాలి మీరు''

"వస్తాన్లేగాని మనుషుల్ని పెడతావా, బుల్డోజరా?" అనడిగాడు.

"ఏదైతే బాగుంటుందో మీరే చెప్పండి'' అన్నాడు రవీంద్ర.

"వెనకటికి మనుషులే తవ్వేవారు. చదరపు గజానికింతని, అడుగుకింతని తీసుకునే వారు. ఎకరాకి ఇప్పుడు కూడా పదేలనుండి పన్నెండేలు తీసుకుంటారు. బుల్డోజరయితే పదేనునుండి పదారేలదాకా అవుతుంది. అయితే పని చకచకా అయిపోద్ది. రెండోది లోతు ఎక్కువ తెగుద్ది. గట్లు బలంగా ఉంటాయి. స్లోపు పెరుగుద్ది. దాంతో చాలా కాలం గట్లు జారకుండా ఉంటాయి''

"అట్లయితే బుల్డోజర్‌తోనే తవ్విద్దాం"

"అంతేలే... ఇప్పుడు ఏ చెరువయినా తవ్వేది బుల్డోజరే. అది వెళ్లటానికి కుదరకపో తేనే మనుషులు తవ్వేది. అలాగే చేద్దాం. ముందయితే మంచి ముహూర్తం చూ యించుకో. కొబ్బరికాయ కొట్టి లాగించేద్దాం"

"అలానే'' అన్నాడు రవీంద్ర.

★ ★ ★

అక్కడ కోలాహలంగా ఉంది.

'వసుంధర' పట్టుచీరతో వచ్చి పూజలు వేసింది. వాళ్ల అమ్మనడిగి నగలు తెచ్చు కుంది. బుల్డోజరుకి పసుపూ, కుంకుమ అద్దా రు. రాజుగారితో సహా అందరూ కొబ్బరికా యలు పగలగొట్టారు. లోన్ పని పూర్తికాకపో యినా బ్యాంక్‌వారిని ఆహ్వానించాడు రవీంద్ర.

రాజుగారు ముందు బయలుదేరి ముందు పదిహేను అడుగుల వెడల్పు దగ్గర ఓ సున్నం గుర్తు వేయించాడు. తర్వాత అయిద డుగుల గ్యాప్... దాని తర్వాత పది అడుగుల

గ్యాప్ ఉంచి ఎక్కడ తవ్వాలో మార్క్ చేయించాడు. ఆ మట్టిని మొదటి పదిహేను అడుగులమీద పోయించాడు. అలా పెద్ద గట్టు ఏర్పడటం మొదలైంది. పనంతా పూర్త య్యేసరికి నాలుగు పక్కలా గట్లతో చెరువు ఆకారం వచ్చింది. ఓ మూల చెరువు నీటిని బయటకు వదలటానికి తూములు ఏర్పాటుచే శారు.

కాలవనీరు అందుబాటులో ఉంటేనే చే పల చెరువులు తవ్వటానికి వీలుంటుంది. బోరు పనిచేయదు. కాలవనుండి చెరువులోకి నీరు తోడించేముందు చేయాల్సిన పనులగు రించి రాజుగారు చెప్పాడు. మర్చిపోతాడేమో నని అన్ని వివరాలు ప్రత్యేకంగా రాయించి ఇచ్చాడు.

దానిప్రకారం కోడిపెంట ఎకరానికి అర లారీ చొప్పున చల్లించాలి. లారీధర మూడు వేల చిల్లర ఉంది. ఆరకంగా తెప్పించాడు. నారాయణని పనిలో పెట్టుకున్నాడు. తనకి నెలకి వెయ్యి రూపాయల జీతం ఏర్పాటు చేశాడు. కోడిపెంట చల్లించాక ఎకరానికి బస్తా యూరియా, మూడు బస్తాల సూపర్‌ఫాస్ఫేట్ చొప్పున చల్లించటం జరిగింది. ఈ కార్య క్రమం అంతా పూర్తయ్యాక ఇంజన్లతో నీరు తోడించటం మొదలైంది. గతంలో అయితే ఆరడుగుల లోతువరకు నీళ్లు ఉండేలా చూసే వారు. ఇప్పుడు ఎనిమిది అడుగుల వరకూ పెరిగింది. ఈ కార్యక్రమం పూర్తయ్యేసరికి ముదురు కాఫీరంగులోకి నీరు మారింది. ఇంక సీడ్ వేయటం చేయాలి.

రవీంద్ర మళ్లీ రాజుగారి సలహా తీసుకు న్నాడు.

"నువ్వింకా సీడ్ పెంచే పని చేయలేదు కాబట్టి పిల్లల్ని కొనుక్కో. నాలుగు అంగుళాల శీలావతి రకం పిల్ల రూపాయి ఉంటుంది. బొచ్చె అయితే మూడు రూపాయలదాకా ఉండొచ్చు. మరి ఇదివరకి బొచ్చె, రాగండి, శీలావతి ఈ మూడురకాల చేపల్ని చెరువులో పెంచేవాళ్లం. దీన్ని మిక్స్‌డ్ కల్చర్ అంటా రు. ఈమధ్యన కొంతమంది రాగండిని పెంచ టంలేదు'' అన్నాడాయన.

"మీరు చెప్పండి. ఏది బాగుంటే ఆపని చేద్దాం" అన్నాడు రవీంద్ర.

ఆయన చెప్పిందానిప్రకారం...

పోతుమర్రు అనే ఊరుంది. అక్కడంతా ఉప్పునీరు. పంటలు పండవు. అప్పుడేం చేయాలా అనే ఆలోచననుండి ఈ చేపల పెంపకం వచ్చింది. ఆయన చెప్పిన మూడు రకాల చేపలు శాకాహారానికి చెందినవి. మొ దట్లో ఈ సీడ్ బెంగాల్‌నుండి వచ్చేది. చెరువు లు పెరగటంతో అది చాల్లేదు. అందుకని ఎక్కువ సీడ్ ఉత్పత్తి చేసుకోవాల్సి వచ్చింది. ఆరకంగా సీడ్ తయారీలో చాలా మార్పులు వచ్చాయి. ముందు ముందు ఇంకా వస్తాయి. ఇంతకీ ఈ చేపల ఆహారాన్ని ప్లాంక్టాన్ అంటారు. ఇవి రెండురకాలు. ఆల్గీ ఫైటో ప్లాంక్టాన్ ఓరకం. ఇది వృక్షజాతులకు చెందింది. నీటిలో గ్రీన్ కలర్‌లో కని పిస్తుంటుంది. కిరణజన్య సంయోగక్రియ జరుగుతుంటుంది. రెండోరకాన్ని జూ ప్లాంక్టాన్ అంటారు. ఇది బ్రౌన్‌కలర్లో ఉంటుంది. ఇది జంతుజాతికి చెందింది. ఈ ప్లాంక్టాన్‌ని ఆహారంగా తీసుకొని చేప పెరుగు తుంది. ఈ ప్లాంక్టాన్స్ నీటిలో కరిగిన నైట్రే ట్స్‌వంటి ఎరువుల్ని ఆహారంగా తీసుకొని పెరుగుతాయి. అలాగే పేడ చల్లుతుండాలి. అది కూడా ప్లాంక్టాన్‌గా మార్పుచెందుతుంది.

ఈ వివరాలు తెలుసుకుంటున్నకొద్దీ రవీంద్రకి తిరిగి విద్యార్థిగా మారిన అను భూతి కలిగింది. అసలిదో మహాప్రపంచంలా కనిపించింది.

"మిక్స్‌డ్ కల్చర్ చేయటానికో కారణం ఉంది. మూడు చేపలూ మూడు రకాలుగా ఉంటాయి. వాటి శారీరక నిర్మాణం అలా ఉంటుంది. బొచ్చె చేప పై ప్రాంతంలో తిరుగుతుంటుంది. అది ఆహారం తీసుకునే పద్ధతి అలా ఉంటుంది. శీలావతి మధ్య




ప్రాంతంలో తిరుగుతుంది. రాగండి... దీన్నే మోసు అంటారు. ఈ రకం చేపలు నీటి అడుగుభాగంలో తిరుగుతుంటాయి. అంటే నీటిపైనుండి కిందదాకా వచ్చే ఆహారాన్ని వృధాకానీయవు. అసలు వృధా అయ్యే అవకాశాలు లేవు. మేతని ప్లాస్టిక్ సంచుల్లో పోసి వాటికి రంధ్రాలు చేసి కర్రలకి కడతారు. కనీసం ఎకరానికి పది కర్రలు నాటుతారు. చేపలు ఈ ఆహారం తీసుకుంటాయి. ఒకవేళ మేత జారి నీటి అడుక్కి చేరినా అది ప్లాంక్టాన్‌గా మారుతుంది''

"మనం మూడు రకాలూ పెంచుదాం" అన్నాడు రవీంద్ర.

"ఇంకో విషయం" అన్నాడాయన.

"చెప్పండి''

"సీడు నాలుగువేలనుండి అయిదువేలదాకా వేయొచ్చు. ఇదివరకయితే అయిదొందల నుండి వెయ్యిమాత్రం వేసేవాళ్లు''

"అలాగే''

"మేతలు స్టాకు పెట్టుకోవాలి''

"అలాగే''

"ఏం మేత తెప్పిస్తా'' అన్నాడాయన.

"చెప్పండి''

"నూనె తీసిన తవుడు ఎక్కువ కావాలి. వేరుసెనగ చెక్క దొరుకుద్ది. పది టన్నులు ఏభైవేలకి పైన ఉంటుంది. పత్తిపిండి చెక్కా అంతే. సన్‌ఫ్లవర్ చెక్కయితే ఇరవై ఎనిమిది వేలు. అన్నిటికంటే తవుడు తక్కువ. అదే కొనుంచు'' అన్నాడు నరసింహరాజు.

"అలాగే'' అన్నాడు.

అలా రవీంద్ర చేపల చెరువుల నిర్వహణలోకి మారిపోయాడు.

★ ★ ★

'వసుంధర తన పనిలో తాను మునిగిపోయింది. ముందు వాళ్ల అమ్మా, నాన్న ఏమైనా అంటారనుకున్నారుగానీ వారూ పెద్దగా అభ్యంతరం చెప్పలేదు. నీలివిప్లవం సాధిస్తున్న విజయాలు వారికీ వినిపిస్తున్నాయి. రవీంద్ర రెండో అల్లుడు. ఈ ప్రయోగం విజయవంతం అయితే వారు కూడా ఈ రంగంలోకే రావాలనుకుంటున్నారు. అందులోనూ వసుంధర నాన్న ఈ విషయంలో ఎవరినో సలహా అడిగాడు.

"ఇప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది. ఇలాంటివన్నీ ముందుగా చేసేవారికి లాభం. ఇప్పటికైనా పోయిందేంలేదు. మీ అల్లుడు మంచిపని చేస్తున్నాడు'' అన్నారు.

రవీంద్ర మామకి ఇద్దరూ ఆడపిల్లలే. ఆయన ఇంకా ఉద్యోగం చేస్తూనేవున్నాడు. ఇంకో అయిదు సంవత్సరాల సర్వీస్ ఉంది. హైదరాబాద్‌నుండి రవీంద్ర వాళ్లు వచ్చారు. మాధవరావుగారు తెలిసినవారిని ఆ ఇంటిలో చేర్పించారు. పదిహేను కిలోమీటర్ల దూరంలోనే రవీంద్ర ఇల్లు చూశాడు. అది పోష్ లొకాలిటీ. అంత చిన్న టౌన్‌లో ఆ ఏరియాలోని ఇళ్లు చూస్తుంటే ఎవరూ వెంటనే దృష్టి తిప్పుకోలేరు.

ప్రతి ఇల్లూ ప్రత్యేకంగా ఉంటుంది. ఆ గోడలు సైతం అద్భుతంగా ఉంటాయి. లోపల పచ్చటి లాన్ ఉంటుంది. అద్భుతమైన కుండల్లో పేరు తెలియని రకరకాల క్రోటన్స్ కనిపిస్తుంటాయి. అందులోనే వైల్డ్ ఫ్లవర్స్‌లో రకరకాలకి చెందిన మొక్కలు. గతంలో ఎక్కడో దూరంగా పెరుగుతూ, చూడటానికి అసహ్యం కలిగించే బ్రహ్మజెముడులాంటివి ఎవరో మాంత్రికుడు కుదించినట్లు చిన్నగా మారిపోయి కుండీల్లో రాళ్ల నడుమ కనిపిస్తుంటాయి.

ప్రతి ఇంటిముందూ 'కుక్కలున్నాయి జాగ్రత్త' అనే బోర్డులు కనిపిస్తుంటాయి. లేత నీరెండలో లాన్‌లో అందమైన కుక్కపిల్లల్తో ఆడపిల్లలు ఆడుకుంటుంటారు. వారందరూ ఆధునిక దుస్తుల్లో మెరిసిపోతుంటారు. గ్యారేజ్‌లో ప్రతి ఇంటికీ కనీసం ఓ కారు ఉంటుంది. ఒక్కో ఇంట్లో రెండునుంచి మూ

డు కార్లు కనిపిస్తాయి. ఇంక ఓ మూలన స్కూటర్లూ, హీరో హోండాతోపాటు బజాజ్ సన్నీలుంటాయి. లేదా కెనెటిక్ హోండా లుంటాయి.

ఆడపిల్లలు వాటిని మంచి వేగంతో నడు పుతుంటారు. ఇంకా స్త్రీలలో కొందరు కార్లు నడుపుతుంటే దారినపోతున్నవారు కళ్లప్ప గించి చూడాల్సిందే. అదేమిటో వారు ధరించిన చీరలు పరమాద్భుతంగా అని పిస్తాయి. చూడగానే ఈ చీర ఎంతుంటుంద బ్బా అనిపించే రీతిలో ఉంటాయి. వీరి శరీరాలు ఎవరో శిల్పి తీర్చిదిద్దినట్లు ఉంటాయి. ఆ ఏరియాలోనే రెండు బ్యూటీ పార్లర్‌లు వచ్చాయి. ఉల్లిపొరలలాంటి చీర లు వీరికోసమే తయారుచేస్తున్నారా అనేంత ప్రత్యేకంగా ఉంటాయి.

ఇంక మగపిల్లలు దృఢంగా, ఆరోగ్యంగా కనిపిస్తారు. వారి చేతుల్లో హీరోహోండాలు తళతళ మెరిసిపోతుంటాయి. ఎప్పుడూ ఏదో ఒక కొత్తదనం వారికి కావాలి. ఓ సంవ త్సరం వాడేసరికి ఆ బండిమీద మోజు తగ్గుతుంది. అమ్మేసి ఇంకోరకం కొంటారు.

రవీంద్రవాళ్లు ఆ ఏరియాలో ఓచోట ఇల్లు తీసుకున్నారు. సంకేత్‌ని కేరళవారి కా న్వెంట్‌లో చేర్చారు. రవీంద్ర అవసరమైన ప్పుడు వెళ్లి వస్తున్నాడు. ముందు లోన్ పనిమీద దృష్టి సారించాడు. చేపల చెరువు దగ్గర్లోనే పెద్ద పార్టీ ఎరేంజ్ చేశాడు. అధికారు లు చాలా సంతోషించారు. పెద్ద కష్టం లే కుండానే లోన్ శాంక్షన్ అయింది. ఈ పనుల న్నీ చేస్తుంటే ఎందుకో శ్యామ్ గుర్తొచ్చాడు. వాడి విజిటింగ్ కార్డ్ జాగ్రత్తగా దాచాడు. తనకి ఫోన్ చేసి ఈ విషయం చెప్పాలని పించింది. శ్యామ్ చెరువులు వేరేచోట ఉన్నాయి. ఎందుకో అతనికి చెప్పాలనిపించ లేదు. ఏదోరోజు వాడికి ఓ సర్‌ప్రైజ్ ఇవ్వాలి అనిపించింది.

ఆ రాత్రి మారుతీకారులో హైదరాబాద్ నగరపు వీధుల్లో చేసిన ప్రయాణం ఎప్పుడైనా గుర్తుకొస్తుంటుంది. 'నా టార్గెట్ అదే. నా స్వంతకార్లో అలా తిరగాలి. రాత్రంతా నగరం చూడాలి. నాతోపాటు శ్యామ్‌ని కూర్చోబెట్టుకో వాలి' అనుకున్నాడు.

సీడ్ ఉత్పత్తి చేసే హేచరీకి వెళ్లాడు.

అక్కడ వివరంగా అన్ని విషయాలూ చూశాడు. అదంతా ఓ ప్రపంచం. మనిషి తలుచుకుంటే ప్రకృతిని ఏరకంగా ఉపయో గించుకోగలడో అర్థం అయింది. తను చూ సింది చైనీస్ హేచరీ.

అందులో ఆడా, మగా చేపల్ని పెంచుతు న్నారు. పదిహేను మగచేపలుంటే పది ఆడ చేపలుంటాయి. ఇవి పెద్ద చేపలు. వీటిలో మగచేపని వెనక్కి తిప్పితే పొట్ట గరుగ్గా, పొడవుగా ఉంటుంది. నొక్కితే తెల్లటి ద్రవం వెలువడుతుంది. దాన్నే మిల్ట్ అంటారు.

జూన్, జులై నెలల్లో మృగశిరకార్తెలో సీడ్ తయారు చేస్తారు. చేసేముందు పిట్యూటరిన్ అనే గ్లాండ్‌ని కలెక్ట్ చేస్తారు. కేజీ దాటిన ప్రతి చేపకీ ఆ గ్లాండ్ ఉంటుంది. తల భాగంలో రంధ్రంచేసి వాటిని సేకరిస్తారు. వాటిని నూరి ఇంజక్షన్ తయారుచేస్తారు. దానినే పిట్యూట రిన్ ఇంజక్షన్ అంటారు.

సాయంకాలం అయిదు గంటలకి ఓ కేజీ బరువున్న ఆడ చేపకి ఫైవ్ ఎం.జి. ఇంజెక్ట్ చేస్తారు. రాత్రి తొమ్మిది గంటలకి టెన్ ఎం.జీ. ఇంజక్ట్ చేస్తారు. మగచేపకీ ఫైవ్ ఎం.జీ. ఇంజక్ట్ చేస్తారు. వాటికోసం ఓ టబ్ ప్రత్యేకంగా ఉంటుంది. అందులో ఈ చేపల్ని వదులుతారు. అందులో నీరు సుడులు తిరు గుతూ వుండేలా ఏర్పాట్లు ఉంటాయి. అలా నీరు పైకి వస్తూ టబ్‌మీదనుండి కిందకు జారి తూములద్వారా బయటకు వె ళ్తుంటుంది. పైన ఓ వలలాంటిది అమర్చుతా రు. అందుకని చేపలు బైటికి పోవు. పైనుండి షవర్ పడుతూ వాన ఎఫెక్ట్‌ని ఇస్తాయి.

ఉదయానికల్లా ఓ కేజీ చేప లక్షనుండి మూడులక్షల గుడ్లు పెడుతుంది. అంటే




రెండు కిలోలున్న పది చేపలు మూడులక్షల చొప్పున ఓ రోజులో అరవై లక్షల గుడ్లు పెడతాయి. రెండోరోజుకల్లా అది పిల్లగా మారిపోతుంది. మూడోరోజుకి నోరూ, ఆహార నాళం, వెన్నుపూస తయారయిపోతాయి. నా లుగోరోజు అమ్మకానికి సిద్ధం. దాన్నే స్పాన్ అంటారు.

నదుల్లో అయితే ఇంత ఉత్పత్తి జరగదు. చేపలనుండి వెలువడే మిల్ట్ ఆ ప్రవాహ వేగానికి పక్కలకి కొట్టుకుపోతుంటుంది. అవి కలిసినమేరకే గుడ్లుగా మారతాయి. ఈ కృ త్రిమ పద్ధతిలో అలాకాదు. అందుకే పదిహే ను మగ చేపలని వదలటం. అవి ఆ టబ్‌లో తిరుగుతూ ఉండటంవలన మిల్ట్ తప్పకుండా కలిసి గుడ్డుగా రూపాంతరం చెందుతుంది. ఈ గుడ్లని మూడురోజులు చైనీస్ టబ్‌లో ఉంచుతారు.

ఈ విషయంలో జపాన్ దేశంనుండి కొత్త ఇంజక్షన్ వచ్చింది. ఖరీదు ఎక్కువ. అయితే ఈ ఇంజక్షన్ చేస్తే చేప తనలోని శక్తినంతటినీ విడుదల చేస్తుంది. ఆరకంగా ఉత్పత్తి పెరుగు తుంది. దానిపేరు ఓవోప్రిమ్.

స్పాన్ ఖరీదు లక్ష పిల్లలు శీలావతి రకం అయితే నూట పాతికనుండి మూడు వందల దాకా ఉంటుంది. అదే బొచ్చె రకం అయితే మూడువందలనుండి అయిదు వందలదాకా ఉంటుంది రూపాయల్లో

ఆ స్పాన్ తెచ్చి చిన్న చెరువుల్లో పెంచుతా రు. ఓ సంవత్సరంపాటు అవి పెరగాల్సి ఉంటుంది. పధిహేను రోజుల వయసున్న పిల్లలను కొంటే కనీసం నాలుగు నెలలనుండి సంవత్సరందాకా పెంచాక పెద్ద చెరువులో వేస్తారు. పెద్ద పిల్లలయ్యాక పెంచితే గిట్టుబా టు కాదు. అందుకే ప్రతివారికీ చిన్నచిన్న చెరువులుంటాయి. వీటి ఆహారం కూడా తవు డే.

చిన్న చెరువులకి రంగురంగుల కాగితాలు ఎందుకు కడతారో అప్పుడే తెలిసింది. ఈ చేలల్లోకి పక్షులు వాలి వాటిని భక్షించకుండా. ఆ మెరుపులకి అవి భయపడతాయి. అలానే అవి నీటిలో మునిగి చేప పిల్లల్ని నోట కరుచుకున్నా పైకి లేచేటప్పుడు ఆ నైలాన్ తాడుకి తగిలి మరింత కంగారుపడతాయి.

ఇంత క్రమం ఉంది. ఇదంతా ప్రారంభ మే. ఇంకా ఇందులో అనేక విభాగాలు న్నాయి. ఎవరిపని వారు చూస్తుంటారు. చెరువు గట్లమీద కొబ్బరిచెట్లు నాటించే పని ఆరంభించాడు. అందులోనూ నాటు మొక్క లు తెప్పించాడు. కొంత ఖరీదు ఎక్కువైనా భవిష్యత్ ప్రయోజనాలదృష్ట్యా వాటినే ఎన్ను కున్నాడు రవీంద్ర. నారాయణకు చేయాల్సిన పనులన్నీ చెప్పాక ఇంటికి బయలుదేరాడు. ఎందుకో తలనొప్పిగా ఉందనిపించింది.

'బంజారా'లో తాగిన షీవాజ్‌రీగల్ తలపు కొచ్చింది. దాని ఖరీదు వేలల్లో ఉంటుంది. కానీ ఎంత గొప్ప అనుభవమో. అసలు తాగినట్లే లేదు. గొంతులోనుండి మెత్తగా జారిపోయింది. ఎంత సాఫ్ట్‌గా ఉందో. రోజుకి లైట్‌గా ఓ రెండు పెగ్‌లు తీసుకుంటేచాలు. ఆరోగ్యానికీ మంచిది అనుకున్నాడు. తనకు తెలియకుండానే బండి ఓ బార్ అండ్ రె స్టారెంట్‌ముందు ఆగింది. ఇప్పటికే నాలుగు ఉన్నాయి. ఇది కొత్తగా పెట్టారు. ఇంక వైన్‌షా పులు ఎన్ని ఉన్నాయో లెక్కలేదు.

అదేమిటో అందరూ బిజీగానే ఉంటారు. అందులో గుమస్తాలు ఎప్పుడూ ఏవో లెక్క లు రాసుకుంటూనే వుంటారు. అది టౌనో నగరమో అర్థంకాదు.

లోపలకు వెళ్లాడు. ఎటుచూసినా టేబుల్స్ నిండి ఉన్నాయి. కుటుంబాలతో వచ్చి తింటు న్నవారున్నారు. బృందాలు బృందాలుగా యువకులు కూర్చుని ఉన్నారు. వారందరూ గోలగోలగా మాట్లాడుకుంటున్నారు.

చక్కగా డ్రెస్ చేసుకున్న ఓ యువకుడు చిరునవ్వుతో పలకరించాడు.

"సర్... మీరు ఒక్కరేనా?"

"అవును"

"అయిదు నిముషాల్లో సీట్ ఎరేంజ్ చేస్తాను''

రవీంద్ర తల పంకించాడు.

రెండు నిముషాల తర్వాత అతను వచ్చి 'ప్లీజ్ కమ్‌సార్' అన్నాడు.

ఓ మూలగా టేబుల్ ఉంది. అక్కడ ఓ నలభై సంవత్సరాల వ్యక్తి కూర్చున్నాడు. అతని ముందో క్వార్టర్ బాటిల్ ఉంది. ఓ ప్లేటులో చికెన్ ఐటమ్ ఉంది. ముఖంలో మీసాలు ప్రత్యేకంగా కనిపిస్తున్నాయి. ఆ టేబుల్ దగ్గర ఉండాల్సిన చెయిర్స్‌ని ఓ బృందం తీసుకుంది. లోపలనుండి ఓ చెయిర్ తెప్పించి అక్కడ వేశారు.

రవీంద్ర అక్కడ కూర్చోగానే ఆ యువకుడు వినయంగా ముందుకు వంగాడు. తనకేం కావాలో చెప్పాడు.

"స్టఫ్ ఏం కావాలో చెప్పండి''

అది కూడా చెప్పాడు.

డిమ్‌గా లైట్లు వెలుగుతున్నాయి. ఎందుకో రూఫ్‌కేసి చూశాడు. ఫాల్స్‌రూఫ్... చాలా అందంగా ఉంది. ఎందుకో నవ్వు వచ్చింది. అంతా కృత్రిమమేనా? చేపల గుడ్లనుండి ఈ సీలింగ్‌దాకా.

క్షణాల్లో టేబుల్‌మీదికి డ్రింక్స్ చేరిపోయాయి. గ్లాసులో ఐస్‌క్యూబ్స్ నడుమ ఆ ద్రవం మెరుస్తోంది. గ్లాసు అందుకుని ఓ గుక్క తాగాడు.

కొంత రిలీఫ్‌గా అనిపించింది.

ముసలాయన ముందో సిగరెట్ పెట్టె ఉంది. నోట్లో సిగరెట్ ఎర్రగా కాలుతోంది. ఆయనేదో ఆలోచిస్తున్నాడు.

ఆయన్ని చూడగానే రవీంద్రకి సిగరెట్ తాగాలనిపించింది.

"బోయ్!" పిలిచాడు.

వచ్చాడు. ఏభైరూపాయల కాగితం అందించి, "సిగరెట్ పాక్, మ్యాచెస్ పట్రా'' అన్నాడు. వాడు అన్నీ తెలుసునన్నట్లుగా వెళ్లిపోయి గోల్డ్‌ఫ్లేక్ కింగ్‌సైజ్ పాక్, అగ్గిపెట్టె తెచ్చి టేబుల్‌మీదుంచాడు. చిల్లర వాడినుంచుకోమని చెప్పి కాగితాలు జేబులోకి నెట్టి సిగరెట్ వెలిగించాడు.

అప్పుడు వినిపించింది ఓపక్కనుండి

"ఏంటిరా... ఏంటి అలా చూస్తున్నావ్?" అరిచాడో యువకుడు.

"ఏంలేదు సార్..." బేరర్ అన్నాడు.

"ఆ మేనేజర్‌ని పిలవండ్రా'' బిగ్గరగా అన్నారెవరో.

"ఏమైంది సార్?" అన్నాడు పరిగెత్తుకుంటూ వచ్చిన ఓ వ్యక్తి.

"ఇక్కడ తాగేది మేమా... వాడా?"

"ఏం జరిగింది?"

"వాడి ఫేస్ చూడండి. ఏమిటంత సీరియస్. నవ్వుతూ ఆర్డర్ తీసుకోవటం తెలియదా? లోపలికి వెళ్తే అరగంటదాకా రాడు. ఇలాంటి వెధవలకి ఎందుకిస్తారు ఉద్యోగాలు''

అతను ముఖంమీదకు నవ్వు తెచ్చుకుంటున్నాడు.

బేరర్ ముఖం మాడిపోయింది. అతని దవడ ఎముక అవమానభారంతో బిగుసుకుంటోంది.

"మీకేం కావాలో చెప్పండి. నేను అరేంజ్ చేయిస్తానుకదా!"

"గ్రేవేనా ఇది. ఇంత సబ్‌స్టాండర్డా? చైనీస్ రెస్టారెంట్ అని పేరు. ఇలా ట్రీట్ చేస్తే ఎలా?"

"సారీ సర్. మీకు చేప పులుసు తెప్పించమంటారా?"

"పంపండి చూస్తాం"

"అలాగే సార్'

"ముందు వాళ్లకి క్లాసులు పెట్టండి. టిప్స్ తీసుకుంటానికి ముందుకొస్తారు. కస్టమర్‌ని శాటిస్‌ఫై చేయటానికి కాదు''

అతను తలూపి, బేరర్‌ని పక్కకి పిలిచి ఏదో చెప్పాడు. అతను ఏదో చెప్పబోయాడు.




"ముందు ఫిష్ సూప్ తెచ్చివ్వు''

అతను వెళ్లాడు.

ఆ యువకులు మాట్లాడుకుంటూనే వున్నారు.

"కొడుకులు సినిమాలు చూసి హీరోలమనుకుంటున్నారు. నా కొడుకులకి పూటకి గతి లేదు. ఆ చూపు చూడు''

"మందు కొట్టాడేమోలేర్రా?"

"అదేం కాదురా బాబు. నా కొడుకులకి జెలసీ. మనందరం ఏదో అనుభవించేస్తున్నామని. చేపల డబ్బులు లక్షలు వచ్చిపడిపోతున్నాయని ఏడుపు''

ముసలాయన సీరియస్‌గా ఓ గుటక వేసి మరో సిగరెట్ వెలిగించాడు. క్రమంగా ఆ గోల సద్దుమణిగింది. అప్పుడు వినిపించాయి మరో మూలనుండి అరుపులు.

"ఐ విల్ కిల్ దట్ బాస్టర్డ్'

ఎవరో సర్దబోతున్నారు.

"నువ్వాగరా. ఈ నా కొడుకు సంగతి నీకు తెలియదు. నన్ను గురించి ఏమనుకుంటున్నాడో? పాతికవేలు... బోడి పాతికవేలు. ఇలా పీకి అవతల పారేస్తా. ఏమనుకుంటన్నాడో. దెబ్బకి చంపేస్తా''

"... ఇక్కడెందుకురా ఈ గొడవలన్నీ''

మేనేజ్‌మెంట్ పరిగెత్తుకువచ్చింది. అప్పటికే గ్లాసు కార్పెట్‌మీద జారి రెండుగా విచ్చిపోయింది.

"బిల్ పంపించండి'' అన్నాడొకతను.

వారిద్దరూ అరుచుకుంటూ బయటకు నడిచారు. అతను బిల్ పేచేసి బయటకు నడిచాడు. అప్పటిదాకా వారినే గమనించిన మిగతా వారు తిరిగి తమ కార్యక్రమంలో మునిగిపోయారు.

తనకివేం పట్టనట్లుగా ముసలాయన తాగుతూనేవున్నాడు. ఎందుకో త్వరగా ఇంటికి వెళ్లాలనిపించింది. బిల్ చెల్లించి బయటకు రాగానే సెక్యూరిటీగార్డ్ సెల్యూట్ చేశాడు. తల పంకిస్తూ బండి బయటకు తీశాడు.

రోడ్డుకి ఓపక్కన ఇంకా ఆ ముగ్గురూ ఏదో గొడవ పడుతున్నారు.

'ఈ సమస్య ఇప్పట్లో పరిష్కారం కాదేమో!' అనుకున్నాడు.

ఇంటికి వెళ్లేసరికి సంకేత్ నిద్రపోతున్నాడు.

"నాన్న కావాలని ఇప్పటిదాకా కూర్చుని నిద్రపోయాడండి'' అంది వసుంధర. తలూపాడు. లుంగీ కట్టుకుని వచ్చి పిల్లవాణ్ణి ముద్దుపెట్టుకున్నాడు. నిద్రలోనే సంకేత్ ముఖం చిట్లించాడు.

రవీంద్రకి నవ్వు వచ్చింది.

"ఏమిటి నవ్వుకుంటున్నారు?" అంది వసుంధర.

"ఏం లేదు... వాడు నిద్రలో ముఖం చిట్లిస్తుంటేనూ'' ఆమె నాసికలకి వాసన సోకింది.

"ఈరోజు కూడా పార్టీనా? ఎవరు వచ్చారేమిటి?"

"అదా... సరేగాని కూర్చో. మనం తీరిగ్గా మాట్లాడుకుని చాలా రోజులయింది. లోన్ డబ్బు వచ్చింది కదా. కొంత డబ్బుతో కొన్ని నగలు బయటకు తెచ్చుకుందామా?"

"తెచ్చుకొని ఏంచేద్దాం. ఈ ఊర్లో లాకర్ దొరకటం అంత సులభం కాదు. ఇంట్లో అన్ని నగలు ఉంచుకోవటం అంత మంచిది కాదు''

"వడ్డీ తగ్గుతుంది కదా అని''

"ఇంక అవసరం రావా?"

"ఓ ఏభై చేతిలో ఉంచుకుని మిగతావి నగలు విడిపించితే బాగుంటుందని నాకనిపించింది''

"అది కాదు. అలా ఆ ఎమౌంట్‌ని డెడ్‌గా ఉంచే బదులు ఇంకో పని చేయవచ్చును కదా?"

"ఏం చేయమంటావ్?"

"మన ఇంటి ఓనర్‌గారి ఫ్రెండ్ పెద్ద షేర్ బ్రోకర్. ఆయన త్వరలో పబ్లిక్ ఇష్యూకి రాబోతున్న ఓ ఇండస్ట్రీ షేర్స్ ఇప్పిస్తామంటున్నారు. మీరు కూడా కావాలంటే తీసుకోండి అని ఆమె చెప్పారు''

"ఎలా ఇప్పిస్తాడట"

"ప్రమోటర్స్ కోటా ఉంటుందటగా. అందులోనుండి ఇస్తారు''

"అది సరే... ఇంతకూ అది ఎప్పుడు బయటకు వస్తుందో తెలియదు కదా. రిస్క్ అవుతుందేమో'' అన్నాడు.

"నాకు తెలియక అడుగుతాను. అంత రిస్క్ అయితే వాళ్ళు ఎందుకు తీసుకుంటారు. నిన్న ఆవిడ చెబుతుంటే నాకు మతిపోయినంత పనయింది. ఇప్పుడసలు ప్రైమరీ మార్కెట్లో వంద షేర్లు ఎలాట్ అయితే లాటరీలో లక్ష రూపాయలు వచ్చినట్లంట. ఎంత దరిద్రపు కంపెనీ అయినా పబ్లిక్ ఇష్యూకి వస్తే ఈ ఊర్లోనే దాదాపు మూడు కోట్లు దాకా కడతారట. అయినా పది రూపాయలకి షేరు ఎక్కడినుండి వస్తుందో నాకు చెప్పండి. అయినా మనం ఎన్ని తీసుకుంటాం. ఓ రెండువేలు. అవయినా వారు ఇస్తే. ఏదో మనకి చెప్పారుగానీ, ఇలాంటి వాటిని బయటకు రానీయరు''

"అది కాదు. ఆ షేర్లు మామూలుగా అమ్ముకోటానికి వీలు లేదనుకుంటా''

"అవును... ఓ సంవత్సరం దాకా అమ్ముకోకూడదు. లేదా రెండు సంవత్సరాలు. ఈ రెండు సంవత్సరాలు నగలు గుడ్లు పెట్టవుగా. షేర్లు పెడతాయి. అందుకే అవి తీసుకోండి. అసలు ఈలోగా మనం అమ్ముకోవాలన్నా ఆయన ఏదో ఏర్పాటుచేసి పెడతాడు''

"చూద్దాం లే'

"చూద్దామా... ఇంకా నయం. మనం వెంటనే ఈ విషయం చెప్పాలి. మనకు వద్దంటే ఇంకెవరో ఉన్నారట. ఈ రాత్రికి కనుక్కొని చెబుతానని చెప్పాను. రేపు ఉదయం మరోసారి ఆయన్ని కలుసుకుంటే బాగుంటుందేమో''

"నేనా... నేనెందుకు... నాకసలే సిగ్గు''

"ఇంకా నయం. అలా అయితే ఇంక మనం వందేళ్ళు చేపలు పెంచినా ఎక్కడున్నావంటే అక్కడే ఉంటాం. నాలుగు రకాల రాళ్ళు విసరాలి. అందుకు పరిచయాలు పెంచుకోవాలి. వ్యాపారం దగ్గర సిగ్గు అంటే నవ్వుతారు''

"సరే... చూద్దాంలే' అన్నాడు.

ఉదయం లేచాక ఇంటి ఓనర్‌ని కలుసుకునేటప్పటికి ఆయన ముందు నాలుగయిదు పత్రికలు పడున్నాయి. అన్నీ షేర్ మార్కెట్‌కి చెందినవే. చాలా సీరియస్‌గా వాటిని చూస్తున్నాడు. రవీంద్రని చూడగానే చిరునవ్వుతో ఆహ్వానించాడు.

"పొద్దున లేచిందగ్గర్నుండి మాకు ఇదే పని. మీరింకా ఇందులోకి రాలేదనుకుంటాను''

"రాలేదండి''

"మీకు పెద్ద పనుండదుకదా కొంచెం జాగ్రత్తగా చేసుకుంటే సెకండరీ మార్కెట్‌లోకి మీరు ఎంటర్ కావచ్చు బాగానే ఉంటుంది''

"ఆ విషయం గురించే మాట్లాడదామని వచ్చాను. మీ ఫ్రెండ్ ప్రమోషన్ కోటాలో షేర్లు ఇస్తానన్నారట కదా''

"అవును... నేనో అయిదువేలు తీసుకుందామనుకుంటున్నాను. మనవాళ్ళదే. బాగుంటుంది. తప్పకుండా తీసుకోండి''

"ఓ రెండువేలు తీసుకోవాలనుకుంటున్నాను''

"నేను చెబుతాలెండి''

"మనకి అవసరం అయితే వాటిని అమ్ముకోవటం కుదురుతుందా?"

"చూస్తుండండి. ఆ షేర్లు మీరు అమ్ముకునే పరిస్థితే రాదు. అంతగా అయితే మీ దగ్గర నేను కొనుక్కుంటాను. సరేనా?"




"డబ్బు వసుంధర ఇస్తుంది''

"దాందేముంది, అలానే. నేను చెప్పిన విషయం ఆలోచించండి''

"తప్పకుండా'' అంటూ లేచాడు.

ఉండండి. కొంచెం కాఫీ తీసుకువెళ్ళవచ్చు''

"ఇప్పుడే తీసుకున్నాను. కొంచెం పనుంది. ఊరెళ్ళి రావాలి''

"మంచిది'' అన్నాడాయన.

★ ★ ★

సూర్యంగారి చెరువులో సరుకు పడుతున్నారు ఆవేళ. అక్కడంతా కోలాహలంగా ఉంది. పెద్ద పెద్ద వలలు వచ్చాయి. ఈ మూలనుండి ఆ మూలదాకా మనుషులు మెల్లగా నడుస్తున్నారు. అప్పుడు చేపలు ఎగురుతున్న దృశ్యం తమాషాగా ఉంది. ఒక్కోసారి అవి ఎగిరి మనుషులని ఈడ్చికొడుతున్నాయి. మరి కొన్నయితే వలకి అవతల ఎగిరిపడుతున్నాయి. వడ్డుకి చేరాక వాటిని గోతాలలోకి ఎత్తుతున్నారు. ప్లాస్టిక్ టబ్స్ చాలా ఉన్నాయి. ముందు చేపలను గ్రేడ్ చేస్తున్నారు. కే.జీ సైజు ఓ పక్కన అంతకంటే పెద్ద వాటిని ఇంకో పక్కన.

అక్కడ ఇద్దరు మనుషులు లెక్కలు చూసుకుంటున్నారు. ఓ పక్క కాటా ఏర్పాటు చేశారు. రోడ్డుకి పక్కగా లారీ ఆగి ఉంది. ఓ పాకేజీ కంపెనీ వారు ఐస్‌ను ముక్కలు ముక్కలుగా చేస్తున్నారు. గ్రేడు చేయటం పూర్తయ్యాక వాటిని లెక్కపెట్టి కాటా వేస్తున్నారు. మొత్తం చేపల సంఖ్యా, వాటి బరువూ రాసుకుంటున్నారు. తూచిన వాటిని లారీ ఇవతల ఐస్‌తో కవర్ చేస్తున్నారు. తిరిగి ఆ ట్రేలన్నింటినీ లారీలోకి ఎక్కిస్తున్నారు.

అక్కడ పనివారందరికీ అదంతా అలవాటయినట్లుగానే ఉంది. కొత్తగా చూసేవారికి మాత్రం చాలా వింతగా ఉంది.

"రండి... కూర్చోండి'' అంటూ రవీంద్రని ఆహ్వానించాడాయన.

"ఎలా ఉంది?" అన్నాడు.

"చూస్తున్నారుగా బాగా పెరగలేదు. ఈసారి 'గొరస' ముంచినట్లు ఉంది'' అన్నాడాయన.

"అవునండి బాబూ చైనాగొరస''

"ఏంటండి బాబూ. దాని గురించి చెప్పండి. నా కొంప కూడా ముంచుతుందేమో'' అన్నాడు కంగారుగా రవీంద్ర.

"మీరు చెరువులోకి నీళ్ళు పెట్టేటప్పుడు గొట్టానికి సంచి తొడిగారా?"

రవీంద్ర ఆలోచించాడు.

"ఏమోనండి. నాకు సరిగా గుర్తులేదు''



"మనం కాలవనుండి నీళ్ళు తోడతాం కదండి. అందులో ఇతర జాతుల పిల్లలు లేదా గుడ్లు ఉండొచ్చు. అవన్నీ వచ్చి చెరువులో పడిపోతాయి. అందుకే 'గారాఫిల్ క్లాత్‌తో చేసిన సంచులు తొడగాలి. చాలా జాగ్రత్తగా లేకపోతే పంట చేలో కలుపు పెరిగినట్లు ఈ రకరకాల చేపల్తో చెరువు నిండిపోతుంది. మనం వేసే ఫీడ్ అవి



తింటాయి. అందులో డేంజర్ ఈ 'గొరస' ఈ 'గొరస' చేప నెలకోసారి గుడ్లుపెడుతుంది. అవి నెల తిరిగేసరికి పిల్లలవుతాయి. ఈ గుడ్లని మగ గొరస నోట్లో పొదుగుతుంది. పిల్లలయ్యాక వాటిని నీటిలోకి వదులుతుంది''

"ఇంట్రెస్టింగ్‌గా ఉందే'' అన్నాడు రవీంద్ర.

"మనకు విలన్ ఈ గొరసేనండి బాబూ అసలు గొరస చేపకి పైనా కిందా ముళ్ళు ఉంటాయి. శత్రువు ఎదురైతే తిరిగి పిల్లల్ని నోట్లోకి తీసుకుని రక్షించుకుంటుంది. మనం మేతని గోతాల్లో కడతాం. దానికోసం చేపలు వస్తాయి. అక్కడ ఈ 'గొరస' ఉంటుంది. దాన్ని రాసుకుంటూ పోతే ముళ్ళు గుచ్చుకుంటాయి. అందుకే చేపలు ఆహారం తీసుకోలేవు''

"మరెలా?"

"అందుకే పెరగవు. 'గొరస' కడుపు నిండాక మెల్లగా ఆహారం తీసుకోవాలి, దీన్నే వీడ్ ఫిష్ అంటారు''

"వాటిని కొనరా''

"కొనరు. వాటివల్ల నష్టం తప్ప ఉపయోగం లేదు''

"మరెలాగండి బాబూ''

"అందుకే అప్పుడప్పుడూ చేపల పెరుగుదలని మనం పరీక్షించుకోవాలి. ఇదివరకు కొరమేను పిల్లల్ని చెరువులోకి వదిలే వాళ్ళం. అవి చిన్నచిన్న పిల్లల్ని తింటాయి. అయితే బాగా ఎరువులు వేయాలి. వాటికి తట్టుకోలేక ఛస్తాయి''

"నన్నాపని చేయమంటారా?"

"ఉండండి... కొత్తగా మందేదో వచ్చిందంట. అది వాడితే ఏ చేపా గుడ్లు పెట్టదంటున్నారు. అది వాడితే సరిపోతుంది''

రవీంద్ర ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

మనిషి ఎంత అభివృద్ధి సాధిస్తున్నాడు. తన అవసరాల మేరకు ఏమైనా చేయగలడు. అదే చేపలద్వారా వాటి గ్రంధులు సేకరించి, వాటిని నూరి, ఇంజక్ట్ చేసి కృత్రిమ సంపర్కంతో లక్షలాది గుడ్లు పెట్టించగలడు. అవసరం లేదనుకుంటే 'గొడ్డాళ్ళను' చేయగలడు.

"ఏంటోలెండి. దేశానికంతా మనమేదో లక్షలు లక్షలు తినేస్తున్నామని ఉంటుంది. పది సంవత్సరాలక్రితం తవుడు ఎంతో తెలుసా? పది టన్నులు వెయ్యి రూపాయలు. ఇప్పుడు ఇరవై రెండువేలు అయింది. ఎన్నిరెట్లు పెరిగిందో చూడండి''

"బాప్‌రే'' అన్నాడు రవీంద్ర.

అతనికింకా ఈ రంగంపై పూర్తి అవగాహన ఏర్పడలేదు.

"ఇదివరకు కోడిపెంటలంటే చీదర. ఇప్పుడు తోలించాలంటే మూడు వేల చిల్లర. ఇదివరకు వేరుశనగ నూనె తీశాక ఆ చెక్క ఏం చేయాలో తెలిసేది కాదు. ఇప్పుడు పది టన్నులు అర లక్షకి పైగా ఉంది. ప్రత్తి పిండి చెక్కా అంతే. ఎందుకు వేరుశెనగ చెక్క వెయ్యాండి బొచ్చె జప్‌మంటూ పెరిగిపోతుంది. కాకపోతే మనకి గిట్టదు. అందుకే కొద్దిగా తెచ్చుకొని మిక్స్ చేసి వేసుకోవటం. ఒకటని కాదు. అన్నిరేట్లూ అలా పెరిగిపోయాయి''

"చేపల ధర పెరగలేదంటారా?"

"ఎక్కడ పెరిగింది. అప్పుడు ఎలా ఉందో ఇప్పుడూ అలానే ఉంది''

"మరి ఎలా గిడుతుంది?"

"టెక్నిక్ పెరిగిందిలెండి. అప్పుడు సీడ్ ఎంత. అయిదు వందలనుండి వెయ్యిదాకా వేసేవారు. ఇప్పుడు నాలుగువేలనుండి అయిదువేల దాకా వేస్తున్నాం కదా. అయిదు టన్నులదాకా 'యీల్డ్' తీస్తున్నాం. అట్లా సరిపోతుంది. అయినా కూడా లెక్కలు చూసుకుంటే ఇంతకుముందే బాగా మిగిలేది''




"అలాగా'' అన్నాడు.

"అసలు లెక్కలు చూస్తే మొత్తం ఖర్చులో ఎనభై శాతం ఫీడింగ్‌కే అవుతుంది. మిగతా ఖర్చులేవీ ఇరవై శాతానికి మించవు''

చూస్తుండగానే ఆ కార్యక్రమం చివరి దశకి చేరుకుంది.

"ఏం చేస్తున్నారు? ఎవరికైనా ఇచ్చేస్తు న్నారా?"

"లేదండి... ఇక్కడ అమ్మితే మనకు లాభం లేదు. కలకత్తా వెళ్తాను. మీరు కూడా వస్తారా?"

"లేదులెండి. మా సరుకు పట్టినప్పుడు ఎటూ వెళ్ళి రావాలి కదా. అప్పుడు వెళ్తాను. మరి నేను బయలుదేరతాను'' అన్నాడు.

"మావాడికిచ్చి చేపని పంపిస్తాను''

"ఎందుకండి బాబూ''

"భలేవారే. ఇప్పుడు వండుకోక ఎప్పుడు వండుకుంటాం" అన్నాడతను.

ఓ పక్కగా కొన్ని చేపలు తీసి పెట్టారు. అవి ఎవరెవరికి ఇవ్వాలో చెబుతున్నాడా యన. రవీంద్ర సెలవు తీసుకొని వచ్చాడు.

దారిలో ఓ ముసలతను ఎదురయ్యాడు.

"ఏం బాబూ. చేపలు పట్టడం అయిందా?"

"ఆс... పట్టారు''

"ఏం చేపలోలే బాబూ. మాలాంటి ముస లాళ్ల కొంపలు ముంచాయి. ఆడాళ్ళకీ పనులు లేవు''

"ఎందుకు లేవు. ఇవీ పనులే కదా''

"అవును బాబూ. కుర్రోళ్ళకే పనులు. ఆళ్ళ పని పనున్న రోజుల్లో బాగానే ఉంటుంది. రోజుకు వంద రూపాయలు సంపాయించు కుంటున్నారు. ఇదివరకి వ్యవసాయం ఉంటే ఏదో పనికి మమ్మల్ని పిలిచేవారు. ఇప్పు డింక మాతో పనేముంది. ఇంక ఇక్కడ బతకటం కుదరదు. కడుపు పట్టుకొని మేం ఊర్లంట పడాల్సిందే'' అని గొణుక్కుంటూ వెళ్ళాడు.

కొద్దిసేపటిదాకా ఆ ముసలతనికేసి చూ స్తుండిపోయాడు రవీంద్ర.

ఎందుకో తప్పు చేసిన భావం కలిగింది.

అంతలోనే అనిపించింది.

"ప్రతి కొత్త మార్పు వచ్చినప్పుడు కొంత మంది నష్టానికి లోనుకాక తప్పదు'' నడుస్తు న్నాడేగాని అంతలోనే సందేహం కలిగింది.

"ఇక్కడ చేపల చెరువులంటే కొంతవరకు ఫర్వాలేదు. ఇక్కడ పంటలు తరుచుగా ముంపుకి గురవుతుంటాయి. అందువల్ల చెరు వులు ఓ మంచి మార్గం. అన్ని వసతులూ ఉన్నచోట బంగారంలాంటి చేలను చెరువులు గా మార్చటం ఎంతవరకు సమంజసం?"

జవాబు లేదు.

ఎందుకో నవ్వుకున్నాడు. తన జీవితం ఈ రకంగా ఉంటుందని అనుకున్నాడా? ఒకప్పు డు ఆ జీవితం చాలా తృప్తికరంగా ఉందని పించింది. కేవలం ఒక్కరాత్రి తనని మార్చి వేసింది. ఇదంతా నీకెందుకంటే తన దగ్గర నుండి వెంటనే సమాధానం ఉండదు. ఇవేమీ లేకపోయినా జీవితం ఉంది. తను హైదరా బాద్‌లాంటి నగరాన్ని ఆ వైభవాలనూ వదిలి ఈ పల్లెలకి వచ్చాడు. ఈ ముసలతను ఈ పల్లెల్ని విడిచిపెట్టి వెళ్ళాడు. అంతే. ఏది శాశ్వతం? ఎవరు శాశ్వతం? అనుకున్నాడు.

చెరువులదగ్గర నారాయణ ఎదురయ్యా డు.

"గొరస" విషయం చెప్పాడు.

నేను డాక్టర్‌ని కనుక్కొని మందులు తెస్తా ను. తూములు మనం జాగ్రత్తగానే మూ యించాం కదా. అక్కడేదైనా పొరపాటు జరి గితే మన కొంప కొల్లేరవుతుంది''

"లేదండి బాబు. చాలా జాగ్రత్తగానే ఆ పని చేయించాం"

"ఓసారి ఆ బోటు తీసుకురా. చెరువులోకి వెళ్దాం"

నారాయణ చిన్న బోటును తెచ్చాడు. అప్పుడప్పుడు నీళ్ళనుండి చేపలు ఎగిరెగిరి పడుతున్నాయి. ఎందుకో సంతోషం కలిగింది. కొంచెంసేపు తిరిగాక నారాయణతో చెప్పాడు.

"ఓసారి మనం వెయిట్ ఎలా వస్తుందో చూద్దాం. రేపు వలేస్తే బాగుంటుందనుకుంటా''

"అలాగేనండి'' అన్నాడు.

సరిగ్గా అప్పుడే సూర్యంగారి మనిషి 'చేప'ను ఓ కాయితంలో పేక్‌చేసుకొని తీసుకొచ్చాడు.

"ఎందుకంటే మీ అయ్యగారు వినలేదుగా'' నవ్వుతూ అన్నాడు.

అది తీసుకున్నాక బండికున్న బాక్స్‌లో పడేశారు.

"రేపు నేను కొంచెం ఆలస్యంగా వస్తాను'' అన్నాడు రవీంద్ర.

"నేను చూసుకుంటానండి'' అన్నాడు నారాయణ

బండెక్కి సరాసరి ఇంటికి వెళ్ళాడు.

"ఇదేంటండి బాబూ'' అంది చేపని చూస్తూ.

"సూర్యంగారు పంపించారు''

"ఇలా తీసుకొస్తే ఎలా. ఆ నారాయణ వాళ్ళావిడతో తోమించేసుకుని రావచ్చు కదా'' అంది వసుంధర.

"ఇక్కడ పనిమనిషి ఉంది కదా అనుకున్నాను''

"ఇప్పటిదాకా ఉంటుందా ఏమిటి?"

"అలా అయితే ఫ్రిజ్‌లో ఉంచు. రేపు వండుకోవచ్చు''

"ఎలా ఉందంటున్నారు''

"ఫర్వాలేదు. పెద్దగా లాభం లేదంటున్నాడాయన"

"ఉంటే మాత్రం మనకి చెబుతారా''

"చెబితే ఏమౌతుంది?"

వసుంధర నవ్వింది.

"కొన్ని చోట్ల లేకపోయినా ఉన్నట్లు బడాయిలు చెప్పాలి. మరికొన్నిచోట్ల ఎంతున్నా ఏమీ లేదనీ చెప్పాలి. ఈ మాత్రం తెలియకపోతే ఎలా?"

"నా సంగతేమోగాని నీ తెలివితేటలు మాత్రం ఈ నడుమ బాగా డెవలప్ అయ్యాయి. నీ దగ్గరనుండి చాలా నేర్చుకోవాల్సి ఉంది''

"ఆరోజు నేను చెబితే ఏదో అన్నారు. మనం కొన్న 'షేరు' అనాథరైజ్‌డ్ ప్రీమియం ఎంత ఉందో తెలుసా? నలభై రూపాయలు''

"ఇంకా పబ్లిక్ ఇష్యూకి రాకముందే''

"మరేంటనుకున్నారు. ఆయన ముందే చెప్పారుగా. ఈ షేర్ మీరు అమ్ముకోరని. నిన్న కూడా అంటున్నారు. సెంకడరీ మార్కెట్ గురించి ఏం ఆలోచించారని. మనకు ఈ విషయంలో ఆయన సలహాలుంటాయి కదా''

"వసుంధరా- ఓ పని చేయకూడదూ''

ఏమిటో చెప్పండి''

"నాకెందుకో వాటిమీద ఇంట్రెస్ట్ కలగటంలేదు. సెంకడరీ మార్కెట్ ఆడాలంటే చాలా కాన్సన్‌ట్రేషన్ కావాలి. నువ్వెటూ ఇంట్రెస్ట్‌గా ఉన్నావ్. ఓ పదిహేను వేలు తీసుకుని ప్రారంభించకూడదూ''

"సరిపోతాయా?"

"ఏడ్చినట్లుంది. లక్షల రూపాయల్తో షేర్లు కొంటే నీ ప్రతిభ ఏముంటుంది. ముందా డబ్బు నష్టం రాకుండా చూడు. అప్పుడు చూద్దాం"

"ఇదేదో బాగానే ఉంది. అలానే చేస్తాను'' అంది వసుంధర.

స్నానం చేశాక డ్రెస్ చేసుకుంటున్న రవీంద్రని అడిగింది.

"బయటకా?"




"అవును''

"ఎందుకండీ. హాయిగా ఇంటిలో కూర్చోక"

"లేదు. డాక్టర్‌ని కలవాలి. రేపు ఓ మందు కొనుక్కుని వెళ్ళాలి. అందుకని''

"త్వరగా వచ్చేస్తారుగా''

తలూపాడు నరేంద్ర.

బండి సరాసరి వెళ్ళి ఓ బార్ అండ్ రెస్టారెంట్‌ముందు ఆగింది.

"రవీంద్రా'' పిలిచాడు.

స్టాండ్‌వేస్తూ ఎవరాని చూశాడు.

'కృష్ణ' తన క్లాస్‌మేట్.

"ఏంటిరోయ్. హైదరాబాద్‌లో ఉన్నావని ఎవరో చెప్పారు. ఎప్పుడొచ్చావ్?"

"లేదురా... ఇక్కడే ఉంటున్నా. ఫిష్ టాంకులున్నాయి. వాటిని చూసుకుంటున్నా''

"అయితే వెల్ సెటిల్డ్ అన్నమాట"

"అదే సెటిల్‌మెంట్. ఇప్పుడే కదా''

"ఏం ఫర్వాలేదు. ఇప్పుడు సొమ్ములన్నీ చేపల చెరువులవే''

"రా... లోపల కూర్చుందాం"

"లేదురా. కజిన్ మేరేజీ కొచ్చాను. వెళ్లాలి''

"ఎక్కడుంటున్నావ్?"

"బాంబే''

"ఏమిటి ఉద్యోగం"

"సేల్స్ ఆఫీసర్''

"అంటే... ఎప్పుడూ తిరుగుతూ ఉండాలన్నమాట"

"అంతే కదా. ఏం చేస్తాం. నాకూ ఓ చెరువుంటే మానేద్దును''

ఇద్దరూ నవ్వుకున్నారు.

"అది సరేరా. మన శ్యాంగాడు బాగా సంపాదించాడటగా''

రవీంద్ర తలూపాడు.

"దేనికైనా అదృష్టముండాలి లేరా. మనం చదువుకునేటప్పుడు ఎందుకూ పనికిరాని వారంతా ఇప్పుడు లక్షలు సంపాదించారు. రౌడీలుగా తిరిగిన వాళ్ళం కబుర్లు బాగా చెప్పిన వాళ్ళం కడుపులు చేతబట్టుకుని దేశాలమీదకు పోవలసివచ్చింది''

"నీకూ మంచి అవకాశాలు వస్తాయిలే''

"ఇంకానా... సర్లే... ఇదిగో కార్డ్. ఎప్పుడైనా బాంబే వస్తే ఫోన్ చెయ్యి. కొంచెం సేపు చిన్నప్పటి కబుర్లు చెప్పుకోవచ్చు''

"ఏమో నేను రాగలనో లేదో చెప్పలేను. నేను కార్డ్ ప్రింట్ చేయించలేదు. నువ్వు ఈ ప్రాంతాలకు వస్తే మా ఊరు వచ్చెయ్యి''

"అలాగే... బై'' వెళ్ళిపోయాడు కృష్ణ.

బార్‌లో అంత రష్‌గా లేదు. ఓ చోట కూర్చున్నాడు. ఎదురుగా టీ.వీ.నుండి ఓ ఆంగ్ల సినిమా కనిపిస్తోంది. కొద్దిసేపట్లో వేరే ఛానల్ మారింది. మ్యూజిక్ ఛానల్. ఎవరో పాడుతున్నారు.

ఆ అమ్మాయి ముఖం క్లోజప్‌లోకి వచ్చింది. శరీరం ఒక్కసారిగా జలదరించింది.

"ఎంత బాగుంది'' అనుకున్నాడు.

సరిగ్గా అదే సమయంలో రవీంద్రముందు బాటిల్‌తోపాటు గ్లాసులు సర్దాడు బేరర్. మూత తీసి కొంత వరకు విస్కీపోసి మిగతా సగం సోడాతో నింపాడు. గ్లాసు అందుకుని ఓ గుక్క తాగాడు.

ఆ అమ్మాయి ఇంకా తన శరీరాన్ని కదిలిస్తూ పాడుతూనే ఉంది. ఇది వరకు ఎప్పుడూ కలగని ఓ కొత్త అనుభవం. శరీరం వేడెక్కుతోంది. ఆ అమ్మాయి తన ముందు నిలబడితే బాగుండుననిపించింది. తనూ ఆమెతోపాటు 'డయాస్' ఎక్కి నర్తించాలనిపించింది. ఇంకా ఆమె చేయి అందుకుని, అలా నడుస్తూ వెళ్ళాలనిపించింది. ఆ సమయంలో 'వసుంధర' గుర్తుకురాలేదు.

కళ్ళ ముందు ఏవేవో దృశ్యాలు.

తను చేతులు సాచాడు. దూరంనుండి ఆ అమ్మాయి పరిగెత్తుకుంటూ వచ్చి తన కౌగిలిలో వాలిపోయింది. మెల్లగా విడివడి ఆమె కళ్ళలోకి చూస్తూ... ఆ పెదవులమీద మృదువుగా చుంబిస్తే... షాక్... షాక్...

సిగరెట్ వెలిగించాడు.

'కొత్త అనుభవం కావాలి' అనుకున్నాడు.

ఎవరెవరో అరుస్తున్నారు. టీ.వీ.లో దృశ్యాలు మారిపోతున్నాయి. ఏమీ పట్టడంలేదు. సిగరెట్ ఎర్రగా కరుగుతోంది.

"ఇదివరకు ఇలా తాగాలనిపించిందా! ఇప్పుడే అనిపించింది. ఈ రోజు కొత్తగా ఇంకేదో కావాలనిపిస్తోంది''

ఎందుకో శ్యామ్ గుర్తుకొచ్చాడు.

తన ఎదురుగా కూర్చున్నట్లనిపించింది. అవును. నవ్వుతున్నాడు.

"రవీ... ఎంజాయ్... ఎంజాయ్ ది లైఫ్... ఈ జీవితం చాలా చిన్నదిరా''

రవీంద్ర తల విదిలించాడు.

ఆ రోజు ఇంకే విషయాలు అలరించలేదు.

ఇంటికి వెళ్ళి పడుకున్నాడేగాని నిద్ర నిండా కలలు.

ఆ కలలనిండా తనూ- ఆ సుందరి!

డాక్టర్‌ను బండిమీద తీసుకుని వెళ్ళాడు.

నారాయణ అప్పటికే వలను సిద్ధం చేశాడు. ఆయన పొలం నాలుగు పక్కలా తిరిగాడు. ఓ చోట ఆగిపోయాడు. అతని దృష్టికి తోక కొట్టుకుంటున్న చేప కనిపించింది. మరి కొద్దిసేపటి తర్వాత రవీంద్రని పిలిచి చెప్పాడు.

"ఆ ప్రాంతంలో వలవేయండి. నాకెందుకో అనుమానంగా ఉంది''

"ఏ విషయంలో సార్''

"పేను సోకిందేమోనని అనుకుంటున్నాను''

"అంటే''

"అదోవ్యాధి. ఇప్పటివరకూ మనకు తెలిసినంతవరకూ పేను- గిల్‌రాట్ ఫంగస్ ద్వారా వచ్చే వ్యాధులున్నాయి. అది కన్‌ఫర్మ్ చేసుకుంటే మందులు వాడవచ్చు''

రవీంద్రముఖం వాడిపోయింది.

"అంతగా కంగారు పడాల్సిన అవసరం లేదులెండి. ముందు ఆ ఏర్పాట్లు చూడండి'' రవీంద్ర నారాయణకు చెప్పి వచ్చాడు. కొంత సేపటి తర్వాత చేపలు తీసుకొచ్చారు.

"చూడండి... ఇది చూశారుగా. ఈ మచ్చ ఉంటే 'పేను' వ్యాధి సోకినట్లు. ఇది మెల్లగా కదులుతుంటుంది. నయం అవుతుందనుకోండి''

"ఏం మందు వాడమంటారు?"

"నువాన్ వాడితే సరిపోతుంది. రెండెకరాలకి లీటర్ నువాన్ చొప్పున వాడాలి. ఇంకా ప్రాధమిక స్థాయిలోనే ఉంది కాబట్టి కంట్రోల్ అయిపోతుంది''

"ఇంకే రకం రావచ్చునంటారు''

"'గిల్-రాట్' అని వస్తుంటుంది. దానిని ఎలా గుర్తిస్తామంటే చేప మొప్పలున్నాయి కదా. సహజంగా అవి ఎర్రగా ఉంటాయి. వాటిలో తెల్లని పొక్కులు ఏర్పడుతాయి. దీనికి నీటిలో సున్నం చల్లించాలి. ఇంకా మేతలో ఉప్పు కలిపితే సరిపోతుంది. ఇంకా తోక కొరుకుడుంది. బాక్టీరియాద్వారా వచ్చే వ్యాధులున్నాయి. వాటికి సెపరేట్‌గా మందులున్నాయి. వాటిని కలిపి మేతద్వారా అందించాలి''

"మామూలుగా ఎందుకొస్తాయండి ఈ వ్యాధులు''

"వాటర్ పొల్యూషన్‌వల్ల ఈ విషయంలో చాలా జాగ్రత్తగా ఉండాలి. చలికాలం చాలా జాగ్రత్తగా ఉండాలి. ఎక్కువ మందులు వాడినా ప్రమాదమే. మీరు చెరువులో మందు జల్లుతారు. ఎండ రాదనుకోండి. నైట్రోజన్ ప్రమాదకరంగా తయారై చేపలు చచ్చిపోవ






# హృదయపూర్వక అభినందనలు

**డా॥ కె.వి.పి. బూమినాథన్ గారికి**

చైర్మన్ & మేనేజింగ్ డైరెక్టర్, భూమి గ్యాస్ మరియు అధ్యక్షులు, ఆల్ ఇండియా శివాజి గణేశన్ ఫాన్స్ అసోసియేషన్

ఇంటర్అమెరికన్ యూనివర్సిటీ ఆఫ్ హ్యూమనిస్టిక్ స్టడీస్, యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా వారు ప్రతిష్ఠాత్మకమైన **డాక్టర్ ఆఫ్ బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ టైటిల్‌తో** గౌరవించిన సందర్భంగా అభినందనలు.

భవిష్యత్తులో వారికి మరెన్నో గౌరవ పురస్కారాలు లభించాలని కోరుకుంటూ శుభాకాంక్షలు తెలియ జేస్తున్నాము.

**శ్రేయోభిలాషులు - స్నేహితులు**

సిబ్బంది & నిర్వాహక వర్గం




**బూమి బాట్లింగ్ గ్యాస్ కంపెనీ లిమిటెడ్**

648, అణ్ణాశాలై, తౌజండ్ లైట్స్, మద్రాసు - 6. ఫోన్: 8273863, ఫ్యాక్స్: 8278185

Aparna/BBG/734/95




# రాశి కలయిక

మీరు, మీ జీవిత
భాగస్వామి ఎంత
అన్యోన్యంగా ఉంటారు?

**0011 222 222 067**

పక్షి శాస్త్రం




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

చ్చు. ఇలా రకరకాల కారణాలు''

"మందులెక్కువగా వాడినా డేంజరేనన్న మాట"

"అవును... వీడ్ ఫిష్ కోసం ఓ మోతాదు వాడతాం. అది చేపలు తట్టుకుంటాయి. వాటి రెసిస్టెన్స్ పవర్‌కి మించి మందులు వాడితే చచ్చిపోక ఏం చేస్తాయి. అందుకే ముందు నుంచి చాలా జాగ్రత్త అవసరం. చేపలూ, రొయ్యలంటే మన పిల్లల్లాంటివి'' అన్నాడా యన.

రవీంద్ర పెదవులమీద చిరునవ్వు వెలి సింది.

"ఏమిటి నవ్వుతున్నారు. పిల్లల్లాంటివి అన్నాననా. నిజమే. వారిని ఎంత జాగ్రత్తగా పెంచుకుంటామో, వీటినీ అంత జాగ్రత్తగా పెంచుకోవాలి. పిల్లలు పెద్దయితే మనని చూస్తారో లేదో గాని ఇవి మాత్రం మనకు బతుకునిస్తాయి''

ఈసారి రవీంద్రకి నవ్వు రాలేదు.

"మీరు నవ్విన కారణం నాకు తెలుసు. ఇంత ప్రాణంగా పెంచేది అమ్ముకోవటానికే కదా అని. వీటిని ఎవరో ఆహారంగా స్వీకరిస్తా రు. అలానే చూసుకుందాం. మనం ఎంతో ప్రేమగా ఆడపిల్లని పెంచుకుంటాం.కానీ ఒక రోజున ఆ అమ్మాయి మననుండి వెళ్ళిపో తుంది. ఎవరి చేతిలోనో పెడతాం. వాడె లాంటివాడో. మన కర్మకాలితే వాడో కసా యివాడు కావచ్చు. లేదా మనల్ని పీక్కుతినే వాడు కావచ్చు. అలాగే మగపిల్లలు. మనం చేపలు అమ్మేటప్పుడు హౌరా మార్కెట్ బాగుంటే హౌరాలో అమ్ముతాం. లేదా అస్సాంలో బాగుంటే అక్కడికే వెళ్తాం. మగ పిల్లలనీ అంతేగా''

రవీంద్ర అతని కళ్ళలోకి చూశాడు.

"మీరు కథలు రాస్తారా?"

"ఎందుకలా అడిగారు'' అన్నాడాయన.

"నాకెందుకో అలా అనిపించింది''

"లేదు''

"లేకపోతే మీరు చదువుకుంటున్నప్పుడు కమ్యూనిస్టు పార్టీల సంఘాల్లో పని చేశారా?"

"అదేంలేదు. ఇది చూడండి'' అంటూ షిర్డీసాయి బొమ్మతో కూడిన లాకెట్ చూ పించాడు.

"నేను సాయి భక్తుడ్ని. మళ్ళీ సాయి భక్తులు కమ్యూనిస్టులు కాకూడదా అని అడగ కండి. 'ఈ ప్రపంచపు స్వభావాన్ని ఎవరైనా విశ్లేషించవచ్చు' అని చెప్పటానికే ఇదంతా. సరే... దాందేముంది లే గానీండి, మందులు తీసుకునే విషయంలో జాగ్రత్త. సగానికి పైగా కల్తీ మందులున్నాయి''

"మరి గవర్నమెంట్ ఏం చేస్తుంది సార్''

మందులొక్కదానిలోనేనా కల్తీ. ఆ విష యంలో ప్రస్తుతానికి మనం చేయగలిగిందే మీలేదు. బాగా నమ్మకం ఉన్న చోట తెచ్చుకో వటమే. మందుల ధరలు బాగా పెంచారు. చేపల్లో బాగా లాభాలు వస్తున్నాయి కదా. కొద్దిగానో, గొప్పగానో కల్తీ చేస్తే ఏం పోయిందని వారు అనుకుంటారు''

"అలానే సార్... మీకు తెలిసిన వారుంటే చెప్పండి. అక్కడే మందులు తీసుకుందాం"

"అలాగే''

"మనం బయలుదేరుదామా''

"అలాగే మీ పనిమినిషి పేరేమిటి... ఇలా పిలవండి''

"నారాయణా... ఇలారా''

డాక్టర్ అతనికి మందులు ఏ రకంగా కలపాలో, ఏ జాగ్రత్తలు తీసుకోవాలో వివ రంగా చెప్పాడు.

"అలాగేనండయ్యా'' అన్నాడు తలూపు తూ.

దారిలో అడిగాడు రవీంద్ర.

"సర్... మీరు డ్రింక్ చేస్తారా?"

"ఆc... థమ్సప్ తీసుకుంటా''

"హాట్‌డ్రింక్స్ తీసుకోరా?"

"లేదండి. నాకు అలవాటు కాలేదు''

"తాగకూడదని నియమం లేదుగా''

"ఇందులో నియమాలు అని పెద్ద మాటలు అనవసరం. నా ఫైనాన్షియల్ పొజిషన్ బట్టి నేను దూరంగా ఉంటాను. ఈ రోజు మీతో తాగుతాను. బాగానే ఉంటుంది. తర్వాత నేను తాగగలగాలికదా''

రవీంద్ర మాట్లాడలేదు.

బండిముందుకు వెళ్తూనే ఉంది.

★ ★ ★

రవీంద్ర ఇంకా నిద్రపోతుండగా వసుంధర వచ్చి లేపింది.

"లేవండి. ఎవరో వచ్చారు''

"ఎవరు'' అంటూ కంగారు పడుతూ లేచాడు.

"ముందు బ్రష్ చేసుకురండి. వాళ్ళు పేపర్ చదువుతున్నారు''

రవీంద్ర త్వరత్వరగా బ్రష్ చేసుకొని హాల్లోకి వచ్చేసరికి "రా అబ్బాయ్'' అన్నాడాయన.

"నమస్కారమండి'' అన్నాడు రవీంద్ర.

వచ్చినాయన పేరు రామచంద్రరావు. ఆయన రవీంద్ర నాన్నగారి స్నేహితుడు. ఎప్పుడూ హైదరాబాద్ తిరుగుతుంటాడు. అధికారంలో ఏ పార్టీ ఉన్నా ఆయన పనులు చేయించగలుగుతాడు. అన్నికులాలవారి పనులూ నెత్తిమీద వేసుకుంటాడు. అయితే తన కులం వారంటే ప్రత్యేక అభిమానం ఉంది. అందుకని ధరలో వారికి కొంత కన్సెషన్ ఉంటుంది. వివిధ సందర్భాలలో ఆయన అందరినీ కలుసుకుని తమ కులానికి జరుగుతున్న అన్యాయం గురించి వివరిస్తుంటాడు. నాన్న బతికున్నంతకాలం తమ ఇంటికి తరచుగా వచ్చేవాడు. హైదరాబాద్ వెళ్ళాక ఒకటి రెండుసార్లు ఆఫీస్‌కి వచ్చాడు కూడా

రామచంద్రరావుతో పాటు ఇంకో యువకుడున్నాడు.

"బాగున్నారా? మీ ఆరోగ్యం ఎట్లా ఉంది?'' అనడిగాడు.

"ఏం బాగులే. మీ నాన్నలాంటివారంతా అదృష్టవంతులు. ఆరోజుల్లో ఇంత దరిద్రం లేదుగా. ఆ ఎన్నికలప్పుడు కులాలు గుర్తొచ్చేవి. మరిప్పుడో. ఏ ఆఫీస్‌కు పోయినా, ఎక్కడ చూసినా కులమే. అందుకే మనందరం ముందుగా కళ్ళు తెరుచుకోవాలి. నేను మొత్తం మన జనాభా లిస్ట్ తయారు చేశా. నాకే మతిపోయింది బాబూ. మనం ఇంతమంది ఉన్నామా? ఇంతకాలం ఏమై పోయాం అని. వీడు తెలుసుగా...''

"పరిచయం లేదండి''

"మీకు దూరపు చుట్టమే బాబూ. నువ్వు చూసుండవులే. ఈ నడుమే బళ్ళారి నుండి వచ్చారు. పొలాలు కొనుక్కున్నారు. ఈ కుర్రాడు కొంత ఫాస్టు. లవ్‌మారేజి చేసుకున్నాడు. ఇంటి దగ్గర కోపంగా ఉన్నారు. ఆc ఎన్ని రోజుల్లే. నాలుగు రోజులు కోపంగా ఉంటారు. అయినా ఈడేం తప్పు చెయ్యలా. కులంగాని పిల్లను చేసుకోలా. ముక్కూ మొహం లేని దాన్ని చేసుకోలా. పిల్ల కుందనపు బొమ్మలా ఉంటుంది. అదీ విషయం. ఆళ్ళకి మట్టుకి ఈడు తప్పితే ఎవరున్నారు. ఆడపిల్ల పెళ్ళి చేసి పంపించారు. మరి మనవాళ్ళని మనం ఆదుకోవాలికదా. నా సిద్ధాంతం ప్రకారం అయితే మన కులపోల్లు అన్ని రంగాల్లోకి చొచ్చుకుపోవాలి. ఏమంటా?''

రవీంద్ర ఏమీ అనలేదు. ఆయన చెప్పుకుపోతూనే ఉన్నాడు. ఆయనంతే. ప్రశ్నలూ ఆయనవే. జవాబులూ ఆయనవే. ఎవరినీ మాట్లాడనీయడు.

"నువ్వు ఉద్యోగం మానుకుని చేపల చెరువులు తవ్వావని తెలిసింది. మంచి పని చేశావు. జాగ్రత్తగా చెయ్యి. మీరంతా నాలుగు రాళ్ళు సంపాదిస్తేనే కదయ్యా మాలాంటివారికి అండగా నిలబడేది. ఈసారి ఎన్నికల్లో ఏ





పార్టీవాడయినా మన జనాభాకి తగినంతగా సీట్లివ్వాల్సిందే. మరి మీలాంటివారంతా మా వెనక ఉండాలి''

రవీంద్ర తలూపుతున్నాడు.

"ఈడి విషయం గురించి నీతో మాట్లాడదామని వచ్చా. ఈడి స్నేహితుడు కలకత్తాలో ఉంటున్నాడంట. ఆడు మనోడేనంటరా''

"కాదుగాని మంచోడే''

"అది బాబూ విషయం. ఈ వ్యాపారంలోకి మనవాడు రావాలనుకుంటున్నాడు. నీకు చెరువులున్నాయి. ఇంకా చాలామంది నీకు తెలుసుకదా. మీరు హౌరాకేనా చేపలు పంపిస్త మీరు అక్కడిదాకా వెళ్లేపనిలేదు. మనవాళ్లు ఆ పనిచేసి పెడతారు. వారంరోజుల్లోపు డి.డి. తీసి పంపిస్తారు. మనాళ్లు దగ్గర లారీకింతని ఇస్తేచాలు. మిగతావాళ్ల దగ్గర రెడీ క్యాషుతో కొంటారు. లేదా ఆ పద్ధతులు వేరుగా వుంటాయి. అంచేత నువ్వు మనాడిని గుర్తుపెట్టుకొని కబురు చేస్తుండాలి. ఈడిపేరు ఏంటబ్బాయ్... ముఖేష్కదూ... ఆc ముఖేష్. మీ ఇద్దరికీ పరిచయం చేశానుకదా! నా పని పూర్తయింది. ఇంక మీరు మాట్లాడుకోండి''

"మీ కార్డుంటే ఇచ్చి వెళ్లండి'' అన్నాడు రవీంద్ర.

అతను జేబులోనుండి కార్డు తీసి ఇచ్చాడు.

"మీరు పట్టేశారా?" అన్నాడతను.

"ఇంకా లేదండీ. చూడాలి. ఇంకా కొంత సమయం ఉంది. నేను ఇక్కడ ఇస్తేమాత్రం మీకు తప్పించి ఇంకెవ్వరికీ ఇవ్వను''

"ఏరోజు రేటు ఆరోజు కనుక్కోవటమేనండి. ఇక్కడ లోడ్ చేశాక, లారీ ఖర్చులు వేసి అవి తీసి అక్కడి ధర ఇస్తాము. మేము ఇప్పుడే లాభాలు ఆశించటంలేదు. సర్వీస్ ఛార్జీలు ఇస్తేచాలు''

"మాట్లాడదాం లెండి'' అన్నాడు రవీంద్ర.

"అదబ్బాయ్. ఆరకంగా మనం ఐక్యంగా ఉండాలి. ఇంక మేం బయలుదేరుతాం"

"భలేవారే... ఉండండి'' అంటూ లోపలకు వెళ్లాడు. వసుంధర అంతకుముందే ఇడ్లీలు వేసి వుంచింది. వాటినందుకుని వచ్చాడు.

"టిఫిన్ చేశామబ్బాయ్''

"ఫర్వాలేదు... తీసుకోండి''

ఇడ్లీముక్క విరిచి నోట్లో పెట్టుకుంటూ చెప్పాడు "ఈసారి నన్ను నిలబడమని బాగా వత్తిడి వస్తోంది బాబూ! మీలాంటివారందరూ నా వెనుక ఉంటానంటే అంతకుమించి నాకేం కావాలి? దూసుకుపోతాను. అసలు మనవాళ్లు లేకపోతే హైదరాబాద్లో పనులు కావటంలేదంటే నమ్ము'' అన్నాడు.

కాఫీ కూడా తాగాక మరోసారి ఆ వ్యాపారం గురించి హెచ్చరించాడు.

"అమ్మాయినోసారి పిలువ్. చెప్పి బయలుదేరతా''

"వసుంధరా...!" అన్నాడు.

వసుంధర వచ్చింది.

"చాలా సంతోషం తల్లీ. మీరేం భయపడొద్దు. ఇక్కడంతా మనవాళ్లే. అద్దద్దా అంటే అరవైమంది పరిగెత్తుకొస్తారు''

వసుంధరకు అర్థంకాకపోయినా నవ్వుతూ తలూపింది.

"వస్తా బాబూ'' అన్నాడు.

ముఖేష్ కూడా వస్తానండి అని ఆయన వెనకే నడిచాడు.

"ఈయనెవరండి బాబూ!"

"మీ మామగారి స్నేహితుడు. రాజకీయాల్లో తిరుగుతూ వుంటాడు''

"అది తెలుస్తూనేవుందిలెండి. ఆ బట్టలూ, మాటలూ చెబుతూనేవున్నాయి. అదిసరే మీకేం భయం అవసరం లేదంటున్నాడు. గొడవలేమైనా జరిగాయా?"

"ఛ... ఆయనేదో నీకు అలా చెప్పాడు''

"చందాకోసం వచ్చాడా?"

"ఇప్పుడు రాలేదు. రేపు రావచ్చు"

"అద్దద్దా అంటే అరవైమంది వస్తారంటాడు. ఎవరూ, ఎందుకు?"

"ఆయన మాటలన్నింటికీ అర్థాలు చెప్పమంటే నావల్లకాదు. అయినా చెప్పింది నీకు. ఏమాత్రం అనుమానం వచ్చినా ఆయన్నే అడగాల్సింది. నన్నడిగితే నేనేం చెబుతాను"

"ఇంతకూఎందుకొచ్చారో చెప్పనేలేదు"

"ఆయనవెంట ఇంకో మనిషున్నాడు. ఆయన చేపల ఎగుమతి వ్యాపారం చేస్తాడట. మనకు పరిచయం చేయటానికి తీసుకొచ్చాడు"

"అదిసరే... ఇంతకూ మనం ఎప్పుడు పడుతున్నాం?"

"మనం సీడ్ వేసి ఎంతకాలం అయిందంటావ్?"

ఆమె లెక్కపెట్టి చెప్పింది "దాదాపు సంవత్సరం కావస్తోంది"

"పట్టేద్దామా?"

"పట్టేయండి. అంతగా అయితే ఇంకో క్రాప్ వస్తుందికదా!"

"చూద్దాం. కొంతమంది రెండు సంవత్సరాలదాకా పెంచుతారంట"

"అంతదూరం మనం చూడలేంలెండి బాబూ! అందులోనూ మొదటిసారి ఇది. డబ్బులకి కటకటగా ఉంది. వెంటనే ఆ పని మొదలుపెడితే బాగుంటుంది"

"సరే... అలానే చేద్దాం"

"మరి సరుకు ఆయనకిస్తారా?"

"లేదు... నేను కలకత్తా వెళ్దామనుకుంటున్నాను. అక్కడ మార్కెట్ ఎలా ఉంటుందో నేను చూడాలి. అంతగా అయితే ఇంకోసారి చూద్దాం"

"ఇప్పుడు మనం మాట్లాడుకోవాల్సిన అసలు విషయం ఉంది!" అందామె

"అదేమిటి?"

"మన సంకేత్ గురించి"

"వాడి గురించి మాట్లాడేదేముంది?"

"మొన్న ప్రోగ్రెస్ కార్డ్ ఇచ్చారు. వాడికి పదోర్యాంక్ వచ్చింది. ఇంతకుముందు ఎప్పుడూ ఇలా జరగలేదు"

"వాడు సరిగ్గా చదవటంలేదా?"

"ఎవరికి తెలుసు? మీ ప్రపంచంలో మీరున్నారు. నా గోలలో నేనున్నాను. వాడి గురించి పట్టించుకునే తీరిక ఎక్కడుంది?"

"ఇంతకీ ఆ స్కూల్లో సరిగ్గా చెబుతున్నారా? అని"

"నాకూ అదే అనుమానం" అంది వసుంధర.

"కేరళవాళ్లు బాగా చెబుతారని పేరుందికదా!"

"అవునండి. బాగానే చెబుతారు. అది ఈ ఊర్లో. ఇది హైదరాబాద్ కాదుగా. కేరళనుండి ఎవరొచ్చినా బాగా చెప్పినట్లేనా నాయర్‌గారి హొటల్లో టిఫిన్ బాగున్నట్లు"

"ఇవన్నీ వద్దు వసుంధరా! మనం ఏం చేయాలో నీ అభిప్రాయం చెప్పు"

"ఇక్కడుంటే వాడికి చదువు రాదండి"

"అయితే...?"

"మంచి రెసిడెన్షియల్ స్కూల్ చూసి చేర్పించితే బాగుంటుంది"

"కానీ సంకేత్ మనకి ఒక్కడు"

"అవునండీ... ఈ సంపాదనంతా వాడికోసమేకదా! మనకే నలుగురు పిల్లలుంటే వాడిని చేర్పించగలమా? ఇప్పుడయితే వాడికి మంచి ఎడ్యుకేషన్ ఇవ్వగలం. ఆలోచించండి"

"ఎక్కడయితే బాగుంటుంది?"

"ఆ విషయం కూడా కనుక్కున్నానండీ! మన ఓనర్‌గారు సీటు విషయంలో బాధ్యతంతా తనదే అన్నారు. అక్కడ సీటు దొరకటమంటే... ఓహ్... సంకేత్ ఎంత అదృష్ట





వంతుడో. కొంచెం డబ్బు ఎక్కువవుతుంది. అవనీయండి. ఒక్కగానొక్క పిల్లవాడు. ఆమాత్రం వాడికి చేయలేమా? నేను నా దృష్టంతా షేర్స్‌మీద కాన్‌సంట్రేట్ చేస్తా. మనం అనుకున్నది సాధిస్తాం" కళ్లు మెరుస్తుండగా అంది వసుంధర.

"ఇంతకూ ఎక్కడో చెప్పలేదు''

"ఊటీ'' గర్వంగా అంది.

"ఊటీనా...!"

"అవును. అక్కడయితే ఏ విషయం గురించి ఆలోచించాల్సిన అవసరంలేదు. భోజనం చాలా బాగుంటుంది. పిల్లల్ని కొట్టరు. మీరు చేపల్ని పెంచుతున్నారు చూశారు.. అలా పెంచుతారు. రకరకాల ప్రాంతాల నుండి పిల్లలు వస్తారు. అందరూ ఇంగ్లీష్‌లోనే మాట్లాడుకోవాలి. సంకేత్‌కి ఎంత మంచి ఇంగ్లీష్ వస్తుందో! ఇంక పిల్లలకి ఎలాంటి సమస్య వచ్చినా వారికి నచ్చచెప్పి పరిష్కరిస్తారు. నిజం చెప్పాలంటే ఓ మదర్ చేయలేని పని వారు చేస్తారు''

"అంతా బాగానేవుంది. సంకేత్ ఏమంటాడో!?"

"వాడనేదేముంది? వాడికేం తెలుసు?"

"అదికాదు వసూ, అమ్మని విడిచి వుంటాడా?"

"అమ్మనేఖాదు, నాన్నని కూడా విడిచిపెట్టి వుంటాడు. ఉండాలి''

"మరీ అంత కఠినంగా మాట్లాడకు వసుంధరా?"

"లేదండీ... చాలా ఆలోచించాకే ఈ నిర్ణయానికి వచ్చాను. ఇక్కడుంటే వాడు ఎందుకూ పనికిరాడండి. మీ నాన్న ఏం చేస్తారు అనడిగితే ఇదివరకు ఇంజనీర్ అనేవాడు. అదో గర్వం. అదో హెూదా. ఇప్పుడు చేపల చెరువులున్నాయి అన్నాడనుకోండి. నీ దగ్గర ఎన్నికోట్లు ఉన్నా ఆ విలువ వస్తుందా?"

రవీంద్ర కళ్లు ఎర్రబడ్డాయి. పెదవులు అదురుతుండగా, అన్నాడు,

"కానీ వసుంధరా! ఈ ముక్క చెప్పాల్సింది ఇప్పుడు కాదు. ఇప్పటికైనా చెప్పావు. కమాన్ మాధవరావుగారికి ఫోన్‌చేద్దాం. ఇల్లు ఖాళీచేయమందాం. రెండునెలల్లో హైదరాబాద్ వెళ్లిపోదాం. వాడికీ, నీకూ కూడా గర్వంగా ఉంటుంది''

"ఏమిటంత ఆవేశపడతారు? ఎదుటివారు చెప్పేది సాంతం వినరా?"

"ఇంకా వినేదేముంది? అన్నీ అన్నావ్''

"మీకలా అర్థం అయితే నేనేం చేయలేను''



"మరెలా అర్థం చేసుకోవాలో చెప్పు. నేను మాట్లాడను'' అన్నాడు రవీంద్ర సీరియస్‌గా.

"ముందు మీరు తెలుసుకోవాల్సింది ఇది తప్పయితే అందుకు బాధ్యత మన ఇద్దరిదీ అవుతుంది. మీరూ నేనూ అన్ని విషయాలూ మాట్లాడుకున్నాకే ఈ నిర్ణయం తీసుకున్నాం. నేను సంకేత్ దృష్టినుంచి చెబుతున్నాను. ఇదివరకు ఇంజనీర్‌గారబ్బాయిగా తను

ఎక్కువ గర్విస్తాడు. మనం ఎంత సంపాదించినా వాడికా గర్వం కలగకపోవచ్చు. ఇదో కోణం. వాడు గర్వపడతాడా లేదా అనేది మనకి అనవసరం. మన జీవితవిధానం మనది. అయితే వాడు ఇక్కడుంటే ఏ క్షణమైనా ఓ చేపల చెరువుకోసం ఇంత కష్టపడి చదవాలా అనుకోవచ్చు. వాడలా అనుకోకూడదు. మీలా వాడు కూడా పెద్ద చదువులు చదవాలి. ఆ తర్వాత ఉద్యోగమే చేసుకుంటాడో, చేపల చెరువులే తవ్వుకుంటాడో మనకి అనవసరం. నేను అంతవరకే ఆలోచిస్తాను'' అంది.

రవీంద్ర మాట్లాడలేదు. ఆమె మాటలు అర్థం అయ్యాయి. అయితే ఎందుకో బాధ... అవి తగలాల్సినచోట తగిలాయి. ఇదంతా గర్వకారణమైనది కాదా? ఇదంతా ఉత్త ఆరాటమేనా? ఇంజనీరు అయినంతమాత్రాన గర్వపడేదేమిటి? చేపల రైతు అయినంత మాత్రాన గర్వపడకపోవటానికేముంది? 'వసుంధర ఆలోచనల్లోనే పొరపాటు ఉంది' అనుకున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

భుజాలు పైకి ఎగరేశాడు.

"మాట్లాడొచ్చు... ముత్యాలు రాలవు''

"నా ఆలోచనంతా వాడి గురించే. వాడు సరేనంటే నాకేం అభ్యంతరం లేదు''

"పిల్లలు ముందు ఏడుస్తారు. ఓసారి అక్కడికి వెళ్తే సెలవులకి ఇంటికి రావటానికి ఏడుస్తారు. మొన్న కింద వదినగారు చెప్పారు. వాళ్ల అక్కగారి మనవడు ఇంటికి రావాలంటే ఇష్టపడడంలేదట"

రవీంద్ర తలూపాడు.

"మన చెరువులో మొదటిసారి పట్టిన చేపలమీద వచ్చిన డబ్బుతో సంకేత్ ఊటీ వెళ్తాడు'' అందామె.

'చేపల డబ్బుల్తో చదువుకుంటే అది గర్వకారణం ఎలా అవుతుంది' అనుకున్నాడు తనకి తనే.

రాత్రి వసుంధర నిద్రపోయాక లేచి వెళ్లి సంకేత్ పక్కన పడుకున్నాడు. జుట్టులో నుండి వేళ్లు పోనించి నుదిటిమీద ముద్దుపెట్టుకొన్నాడు. సంకేత్ అకస్మాత్తుగా రవీంద్ర మీద చెయ్యి వేసి దగ్గరగా జరిగాడు. అంతలోనే కాలు కూడా వేశాడు.

రవీంద్రకెందుకో దుఃఖం వచ్చింది.

చాలా సంవత్సరాల తర్వాత ఆ రాత్రి నిశ్శబ్దంగా రోదించాడు. అలా ఓ అరగంట ఉండిపోయాక బాత్‌రూంకి వెళ్లి ముఖం కడుక్కున్నాడు. చాలా హాయిగా ఉందనిపించింది.

"ఊటీ...!"

చాలా కాలంగా తను చూడాలనుకుంటున్న ప్రదేశం. అది తనవల్ల కాలేదు. కానీ సంకేత్...

ఊటీలో చదువుకోబోతున్నాడు.

తిరిగి వెళ్లి బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు.

నిద్రలో ముఖం చిట్లించాడు సంకేత్.

★ ★ ★

రవీంద్ర ఓ ప్యాకింగ్ కంపెనీకి ఆర్డరిచ్చాడు.

వారు మనుషులతోనూ, అవసరమైన సరంజామాతో వచ్చారు. కొంతమంది చూడటానికొచ్చారు. కోలాహలం ఆరంభం అయింది. సంవత్సరంక్రితం పిల్లలుగా చెరువులోకి ప్రవేశించి ఎటుచూసినా తామే అయి రోగాలు తెచ్చుకుంటూ, నయం చేసుకుంటూ పెరిగి పెరిగి ఇప్పుడు తరలిపోతున్న జల సంపదని చూడగానే కళ్లు చెమర్చాయి. మంచి వెయిట్ వచ్చింది. అంతకుముందే ఊర్లో ఎవరెవరికి పంపించాలో నారాయణకు చెప్పి ఉంచాడు. వసుంధరతో పాటు సంకేత్ వచ్చాడు.

చేపలు ఎగురుతుండటం సంకేత్‌కి నచ్చింది. అక్కడే కూర్చొని వాటిని చూశా




డు. సాయంకాలానికి కొంతభాగం పూర్తయింది. తిరిగి మరుసటిరోజు పట్టారు. ప్రతిదీ వివరంగా లెక్కలు రాశారు. ఓ లక్ష పిల్లలు పెంచటం జరిగితే వాటి లెక్క తెలిసిపోతుంది. ఏమైనా దొంగతనం జరిగినా, ఎగిరి కాలవలో పడినా, తూమునుండి జారిపోయినా లెక్కలు చూసుకుంటే తెలిసిపోతుంది.

రవీంద్ర చెరువులమీద పెట్టిన ఖర్చు రాశాడు. అందులో కూలీలకు చెందిన ఖర్చులు చూశాడు. చెరువు గట్టుమీద ఓ కుటుంబం కాపురం ఉంది. నారాయణ కుటుంబానికి నెలకో వెయ్యిరూపాయల జీతం. మేతలు కట్టడం, ఎరువులప్పుడు, పురుగుల మందులప్పుడు సహాయం చేయటం, చెరువులు జాగ్రత్తగా చూడటం అతని పనులు.

కోడిపెంటలు చల్లేటప్పుడు ఇరవైమంది, పేడ చల్లటానికి పదిమంది, పిల్లలేసేటప్పుడు పదిమంది, వల వేసేటప్పుడు నలభైమంది, ఇతర పనులకి పదిమంది, వారందరికీ అయిన మొత్తం పదిహేను వేల లోపుగానే అయింది. ఆ ముసలతను ఆరోజు వాపోవటం గుర్తొచ్చింది. నిజమే... వ్యవసాయ పనులతో పోలిస్తే చాలా పనిదినాలు తగ్గిపోయాయి.

మొత్తం ఖర్చులో అత్యధికభాగం ఫీడింగ్ కే సరిపోయింది. మొదటిసారిగా కలకత్తా బయలుదేరాడు.

"ఎవరినన్నా తీసుకువెళ్తారా?" అంది వసుంధర.

"ఏమీ అవసరంలేదు. అక్కడున్నవాళ్లంతా మన తెలుగువాళ్లే' అన్నాడు.

"క్యాష్ తీసుకురాకండి. డబ్బులు పోయినా ఫర్వాలేదు. డి.డి. తీసుకోండి'' అందామె. తలూపాడు.

"జాగ్రత్తండి. వెళ్లాకా, బయలుదేరేముందు ఫోన్‌చేసి చెప్పండి''

"అలాగే!"

"రాత్రంతా ట్రెయిన్‌లో హాయిగా నిద్రపోయాడు. హౌరా స్టేషన్‌లో దిగాడు. పెద్ద విశేషం ఏమీ అనిపించలేదు. ఆంధ్రాలో స్టేషన్‌లానే వుంది. స్టేషన్‌కు దగ్గరలో మేఘరాజ్ హోటల్ ఉంది. అందులో ఓ గది తీసుకుని స్నానం చేశాడు. వచ్చేముందు కలకత్తాలో ఏయే ప్రాంతాలు చూడాలో అడిగి తెలుసుకున్నాడు. చాలామంది ఆంధ్రులు కనిపించారు. కొందరు సరుకు తెచ్చినవారైతే మరికొందరు బ్రోకర్లు.

రవీంద్రకి ఓ బ్రోకర్ పరిచయం అయ్యాడు.

లారీకి వెయ్యిరూపాయల కమీషన్‌పై సరుకు అమ్మిపెట్టడానికి ఒప్పందం చేసుకున్నారు. అతను చాలా విషయాలు చెప్పాడు.

"మీరు ఇక్కడ భోజనం చేయలేరు. ఆంధ్రా భోజన హోటల్ ఉంది. అక్కడ బాగుంటుంది. ముందు రేపు పనయితే రెండురోజులుండి అన్నీ చూసివెళ్లవచ్చు'' అన్నాడు.

"అలాగే చేద్దాం"

"ఇంకా విశేషాలు చెప్పండి''

"మీరు వింటానంటే చాలా విశేషాలున్నాయి. ఈ హోటల్లో పట్టపగలు వ్యభిచారం జరుగుతుంది. నాలుగో అంతస్థుమీద"

"పోలీసులు రెయిడ్ చెయ్యరా?"

"అలాంటి సమస్యలు ఉండవు. రెడ్‌లైట్ ఏరియాలు దివ్యంగా నడుస్తుంటాయి. అవి ఏ గొడవల్లోనో మూతబడితే మూతబడొచ్చుగానీ ఈ వ్యాపారాన్ని రానున్న వంద సంవత్సరాల్లో రూపుమాపటం ఆ భగవంతుడికే సాధ్యంకాదు. అసలు ఇక్కడికి వచ్చేది కూడా మన తెలుగువారిని దృష్టిలో పెట్టుకునే. బెంగాల్ గ్రామాలనుండి పగటిపూట ఆడవాళ్లు వస్తారు. సాయంకాలానికి ఎంతో కొంత సంపాదించుకొని వెళ్లిపోతారు. మీరు

నమ్మరు. వ్యభిచారం ఇక్కడ చాలా చీప్ అంటే ఏభై రూపాయలిచ్చినా చాలు''

రవీంద్రకి ఆ మాటలు వింటుంటే కొద్దిగా సిగ్గనిపించింది. అయితే అతను అవేమీ పట్టించుకునే పరిస్థితిలో లేడు.

"హౌరా వంతెన చూడండి. హుబ్లీనది కనిపిస్తుంది. నది ఇవతల హౌరా. అవతల కలకత్తా నగరం. దేశంలోనే అతి పెద్ద నగరం ఇది. చూడండి. ఎంత బాగుంటుందో అంత అసహ్యంగా ఉంటుంది''

అతనింకా ఏవేవో విశేషాలు చెబుతూనేవున్నాడు.

ఆరోజు టీవీలో పాట పాడుతూ కవ్వించిన సుందరి గుర్తొచ్చింది.

"సరే... మనం రేపు కలుసుకుందాం. నా బెంగాల్ ఫ్రెండ్ ఉన్నాడు. తనేదో యూత్ ఆర్గనైజేషన్‌లో ఉన్నాడు. ఈ పని పూర్తయ్యాక అతన్ని కలుసుకుంటాను''

"అలాగేనండీ... చిరునామా ఇవ్వండి. నేను ఆరా తీస్తాను''

"సూట్‌కేస్‌లో ఉంది. రేపు అవన్నీ''

"నేను బయలుదేరతా'' అన్నాడు.

అతన్ని పంపించాక ఇంటికి ఫోన్ చేశాడు. ఇంటి ఓనర్‌గారికి ఫోన్ ఉంది. వసుంధర లైన్లోకొచ్చింది.

"క్షేమంగా చేరానోయ్''

"ఎలా ఉంది అక్కడ?"

"రేపు మార్కెట్‌కి వెళ్తాను''

"అవసరమైతే మీ దగ్గరున్న అడ్రస్‌కి ఫోన్ చేయండి. ఎలాంటి సహాయం కావాలన్నా చేస్తారు''

"అలాగే''

"క్యాష్ తీసుకురాకండి''

"అలాగే. మళ్లీ ఫోన్ చేస్తాను. సరేనా?"

ఫోన్ పెట్టేశాడు.





వచ్చేముందు ఇంటి ఓనర్ చెప్పాడు. 'అదంతా ఓ మహాప్రపంచం. అంతా రౌడీయిజం. వాళ్లదగ్గరే అమ్మమంటారు. లాంగ్వేజ్ ప్రాబ్లమ్ ఉంటుంది. కలకత్తాలో నా మిత్రుడున్నాడు. ఆ అడ్రస్ తీసుకువెళ్లండి. అవసరమైతే నా పేరు చెప్పి కాంటాక్ట్ చేయండి. పొలిటికల్‌గా కూడా అతనికి మంచి రిలేషన్స్ వున్నాయి. ఎప్పుడూ బిజీగా ఉంటాడు. అందుకే రెండు మూడుసార్లు ఫోన్ ఎంగేజ్ టోన్ వచ్చినా నిరాశపడకుండా ట్రై చేయండి''

ఆ చిరునామాతో వచ్చాడు. 'జాగ్రత్త' అని ఆ బ్రోకర్‌ని హెచ్చరించటానికే అలా చెప్పాడు. తిరిగి గదిలోకి వచ్చాడు. మంచంమీద పడుకున్నాడు. సీలింగ్‌ఫ్యాన్ గిర్రున తిరుగుతోంది. అయినా అనీజీగా అనిపించింది. ఓసారి పైకి వెళ్లి చూసి వచ్చినంతలోనే ఏమౌతుందనిపించింది.

పైకి వెళ్లాడు. శరీరం జివ్వుమంది. రకరకాల దుస్తుల్లో స్త్రీలు కనిపిస్తున్నారు. కిందకు వెళ్లిపోదామా అనుకున్నాడు. కాళ్లు కదలటంలేదు. అలా అని ముందుకు పడటంలేదు. ఎప్పటికో కిందకొచ్చాడు. స్నానం చేశాడు. రూం లాక్‌చేసి ఆంధ్రాభోజన హోటల్‌కెళ్లాడు. వస్తూ ఇంగ్లీష్ మేగజైన్ కొనుక్కొచ్చాడు. మంచంమీద పడుకొని పుస్తకం అయితే తెరిచాడు. చదవాలనిపించలేదు.

పుస్తకం పక్కన పడేశాడు.

"ఏం జరిగింది? తన పతనం ఇంతటితో ఆగుతుందా? ఇంకా అగాథాల్లోకి దొర్లుకుపోవటమేనా? ఎక్కడో ఆంధ్రదేశపు మారుమూల గ్రామంలో ఓ చేపనుండి స్పాన్ రూపుదిద్దుకుని, ఇలా కలకత్తా చేరి అటునుంచి మారుమూల గ్రామాలు చేరేంతవరకు ఎన్ని గదుల నిర్మాణం ఉంది. దానిచుట్టూ ఎంత సాంకేతికత అభివృద్ధి చెందింది! అక్కడ చేపలు కదులుతాయి. ఈ మారుమూలనుండి స్త్రీలు కదులుతారు.

తనెక్కడివాడు... ఆ అమ్మాయి ఏ ఊరికి చెందింది... కేవలం మనిషికీ మనిషికి

నడుమ ఉంది ఆ కాగితమేనా? వాటికోసమేనా ఎవరైనా ఏమైనా చేయటం? ఓ గ్లాసు పగిలితే పెంకులెక్కడికో చెదిరినట్లు ఈ చేపలూ, రొయ్యలూ రాష్ట్రాల్నీ, దేశాల్నీ కలుపుతున్నాయా? కలుషితం చేస్తున్నాయా?

అన్నీ ప్రశ్నలు. సిగ్గుగా అనిపించింది. నవ్వు వచ్చింది. రవీంద్రా... మిస్టర్ రవీంద్రా, అసిస్టెంట్ ఇంజనీర్ రవీంద్రా... నువ్వు ఏభై రూపాయలిచ్చి... ఇంత మహత్తరమైన అనుభవంకోసమేనా చేస్తున్న ఉద్యోగానికి సెలవు పెట్టి పరుగులు తీసుకుంటూ వచ్చింది? ఆర్‌యూ హ్యాపీ... నీకు సుఖం లభించెనా! నీకు సంతృప్తి లభించిందా... కమాన్ స్పీక్...

రాత్రంతా పక్కమీద అటూ ఇటూ దొర్లాడు. నిద్ర రాదు. వసుంధర గుర్తొచ్చింది. సంకేత్ గుర్తొచ్చాడు. కొద్దిసేపు లేచి మంచంమీద కూర్చున్నాడు. తిరిగి పడుకొన్నాడు. ఎప్పటికో నిద్రపట్టింది.

నిద్రలో శ్యామ్ కనిపించాడు. వికృతంగా నవ్వుతాడు కొంచెంసేపు.

'డోంట్‌వర్రీ మై బాయ్. ఆనందం అంటే ఏమిటో తెలుసుకుంటున్నావ్. అప్పుడే ఏమై పోయిందని. ఇంకా అనంతమైన ప్రకృతి ఉంది. ముందుకు నడవరా బాబూ'

ఉలిక్కిపడి లేచాడు. కళ్లు మండుతున్నాయి. అలానే లేచి కాలకృత్యాలు తీర్చుకున్నాడు. మార్కెట్‌లో ఆరోజు రేటు బాగానే పలికింది. కేజీ ఇరవై నాలుగు రూపాయల ధర పలికింది.

"ఈమధ్యకాలంలో ఇదే మంచిరేటు'' అన్నాడు.

రవీంద్రకి మిగతా ఏ విషయాలు గుర్తుకురాలేదు.

ఎంత తక్కువగా చూసుకున్నా తన ఇంటి ఖర్చులూ, అన్ని ఖర్చులూ పోయి లక్షకి పైగా మిగిలింది.

ఆరుగాలం కష్టపడి పనిచేసి పండిన పంటను చూసుకుని సంతోషంతో పొంగిపోయే రైతులా ఉన్నాడాక్షణం.

"రెండురోజుల్లో డి.డి. తీయిద్దాం" అన్నాడు.

"అలాగే. నేను కలకత్తా నగరం చూస్తాను''

"చూసిరండి''

వంతెనపై నిలబడి హుబ్లీ నదిని చూశాడు. అక్కడనుండి కదలాలనిపించలేదు. అలా చాలాసేపు చూస్తూ గడిపాడు. ఆ తర్వాత మెట్రోరైల్‌ను దర్శించి చాలా ఆనందం పొందాడు. బిర్లా ప్లానిటోరియమ్ లోకి వెళ్ళినప్పుడు మాత్రం సంకేత్ గుర్తొచ్చాడు. తను కూడా ఉండి వుంటే బాగుండును అనిపించింది. ఎస్ప్లనేడ్ సెంటర్‌కి వెళ్లాడు. చివరిగా విక్టోరియా మెమోరియల్ హాలుకి వెళ్లాడు.

ఎటు చూసినా జంటలు. కలకత్తా నగరంలో ఎక్కడా మంచి స్థలం దొరకదు. మంచి గాలి పీల్చుకోవటానికిగాని, తీరిగ్గా కబుర్లు చెప్పుకుంటానికిగాని అవకాశం ఉండదు. అందుకే జంటలు జంటలుగా అక్కడికి చేరుకుంటారు. అందులో నిజమైన జంటలెన్నో, ప్రేమికులెందరో, ఎవరో ఒక అమ్మాయితో తరలివచ్చినవారెందరో...

వారందరినీ చూస్తుంటే తను ఏకాకినని పించింది. రాత్రి అన్ని గంటలసేపు తాను మథనపడిన విషయం మరిచిపోయాడు. చుట్టూ చూశాడు. ఎవరైనా కనిపించగలరేమోనని. నన్ను వెతుక్కుంటూ ఓ అద్భుత సుందరి వస్తే ఎంత బాగుంటుంది అనుకున్నాడు.

రకరకాల దుస్తుల్లో కనిపిస్తున్న ప్రతి స్త్రీ ఆకర్షణీయంగానే కనిపించింది. ఇంతకు ముందు ఇలాంటి ఆలోచనలు కలిగేవి కాదు. మాధవరావుగారి ఆలోచనాధోరణి భిన్నంగా ఉండేది. ఆయనకి లెక్కలు తప్పితే మిగతా



అంశాలు అంత ప్రాముఖ్యమైనవి కావు. యాదగిరి సరదాగా కబుర్లు చెబుతాడు. అంతకుమించి ఈరకమైన తలపులకు ఆస్కారం ఉండేది కాదు. ఎప్పుడైనా కళ్లు చెదిరే అందం కనిపిస్తే ఓక్షణం అటు దృష్టి సారించటం జరిగేది. రవీంద్ర విక్టోరియా హాల్‌నుండి భారంగా అడుగులు వేసుకుంటూ వచ్చాడు.

ఇంకా కలకత్తాలో మురికివాడలు చూసినప్పుడు శరీరం జలదరించింది. ఇంత దరిద్రం ఉందా? ఇక్కడా ఉందా? ఈ దేశంలో ప్రజలు ఇంత దరిద్రాన్ని ఇంకా అనుభవిస్తున్నారా... ఇదేం కలకాదు కదా అనిపించింది. అటు నుండి కదిలితే ఆకాశంలోకి తలలు సారించిన భవనాలు... పురాతన కట్టడాలు... రంగురంగుల లైట్లు... టాంగాలు... రెండు నగరాల నడుమ వారధిగా ఉన్న హుబ్లీ... మాఫియాలు... బ్లూ సినిమాలు... ఊరేగింపులు... జీవితం అంతా ఇక్కడే ఉందా అనిపించింది.

వెనక్కి తిరిగి వస్తున్నప్పుడు తనని తాను ప్రశ్నించుకున్నాడు రవీంద్ర.

'ఇంతకూ కలకత్తా ప్రయాణం జీవితంలో మరపురానిదా?' కొద్దిసేపటి తర్వాత అనుకున్నాడు.

'అవును. మరపురానిదే. నా జీవితంలో ఇలాంటి ప్రయాణాలు చాలా చేయవచ్చు. అయితే ఈ అనుభూతులు మాత్రం ఇంకెక్కడా లభించకపోవచ్చు' అనుకున్నాడు.

ఇంటికి చేరేసరికి వసుంధర కూడా చాలా సంతోషంగా ఉంది.

"మీకో శుభవార్త' అంది.

"చెప్పు''

"నా వ్యాపారం సక్సెస్. మీరు మీ మొదటి క్రాప్‌లో విజయం సాధించారు. నా పెట్టుబడి అలా ఉండగా ఇప్పుడు నాదగ్గర మరో పదిహేను వేల రూపాయలున్నాయి''

"ఏం చేస్తావో చెప్పు''

"ఏం చేద్దామనేది తర్వాత. ముందు బ్యాంక్ లోన్ ఎమౌంట్ కట్టేయండి. తర్వాత పిల్లవాడి గురించి ఆలోచించుకుందాం. వాడిని ఊటీలో చేర్చి రావటం రెండవపని. ఇంక మూడోపని మీ చెరువు గురించి''

"నేను చెప్పానుకదా! నీళ్లన్నీ తోడేశాక, పది, పదిహేను రోజులు ఎండబెట్టాలి. ఆ తర్వాత తిరిగి సున్నం చల్లించి, కోడిపెంటా, ఇతర ఎరువులూ చల్లటం తిరిగి మామూలే'

"అలా అయితే మనం ఊటీ వెళ్దాం"

"సరే' అన్నాడు.

ముందుగా సంకేత్‌కి కావలసినవన్నీ తీసుకున్నారు. రోజూ పిల్లవాడిని సముదాయించడం కష్టంగా ఉంది. తనకయితే బొత్తిగా వెళ్లాలనిలేదు. వసుంధర అక్కడి విశేషాల గురించి కథలు కథలుగా చెబుతోంది. అవి వింటున్నప్పుడు ఆనందంగానే ఉంటుంది. తిరిగి మామూలే. వసుంధర, అమ్మా, నాన్నలకు కబురుచేసింది. వాళ్లు వచ్చారు. వసుంధర నాన్నగారు ప్రత్యేకంగా రవీంద్ర దగ్గర కూర్చుని ఈ సంవత్సరకాలపు అనుభవాలు చెప్పించుకున్నాడు.

"బాగానే ఉందే'' అన్నాడాయన.

"మనదెంతండి... చిన్న చెరువు. ఏదన్నా ఓ వందెకరం ఉంటే డబ్బులు కనిపిస్తాయి'' అన్నాడు రవీంద్ర.

"కౌలుకి దొరుకుతాయా?"

"అదే చూస్తున్నా. కనీసం ఇంకో పదెకరాల చెరువుంటే బాగుంటుంది. నాలుగు సంవత్సరాలు కష్టపడితేచాలు''

"ఇంకో సంవత్సరం చూడు. అంతగా అయితే మేం కూడా ఈ రంగంలోకొస్తాం" అన్నాడాయన.

"తప్పకుండా వద్దురుగాని''

సంకేత్‌ని అమ్మమ్మ తనదగ్గరికి తీసుకొని చెప్పింది.

"ఇంతవరకూ మన ఇళ్లల్లో ఊటీలో చదు




వుకున్నవాడెవడూ లేడ్రా. ముందుగా నువ్వే. అందుకే నవ్వుతూ వెళ్లి చదువుకోవాలి''.

తల అడ్డంగా ఊపాడు సంకేత్.

"ఇంకా చిన్నపిల్లాడిననుకుంటున్నావా అమ్మదగ్గర ఉండటానికి. పెద్దవాడివవుతున్నావ్. అది గుర్తుంచుకో. నవ్వుతూ వెళ్లాలి'' అని రకరకాలుగా చెప్పింది.

ఇంటి ఓనర్‌గారు ఫోన్లో అన్ని విషయాలు కన్‌ఫర్మ్ చేసుకున్నాక సంకేత్‌ని తీసుకొని ఊటీ వెళ్లారు.

అక్కడ చేర్పించి, అక్కడే రెండు రోజులుండి చూడవలసిన ప్రాంతాలు చూసి వెనక్కి వచ్చారు.

వసుంధర షేర్‌మార్కెట్‌లో మునిగిపోయింది.

రవీంద్ర చెరువు పనుల్లో కూరుకుపోయాడు.

★ ★ ★

ఆరోజు సాయంకాలం చెరువు పనులు ఎలా జరుగుతున్నాయో పరిశీలించి వెనక్కి వస్తుంటే దారిలో ముఖేశ్ కనిపించాడు. అతను ఎవరితోనో మాట్లాడుతున్నాడు. కొత్త హీరోహోండా మెరుస్తూ కనిపించింది. రవీంద్రని చూడగానే విష్‌చేశాడు. అతనితో మరలా కనిపిస్తానని చెప్పి రవీంద్రతో వచ్చాడు.

"మీ ప్రోగ్రాం ఏమిటో చెప్పండి'' అన్నాడతను.

"ఏముంది? ఇంటిదగ్గర మా బాబు కూడా లేడు. మహా అయితే ఆ టి.వి. ముందు కూర్చోవాలి''

"బాబునెక్కడికి పంపించారు?"

"ఊటీలో చేర్పించాం"

"అలా అయితే కొంచెంసేపు కాలక్షేపం చేద్దాం" అన్నాడు.

ఇద్దరూ కలిసి బార్‌కి పోయారు. ఆరుబయట ఆహ్లాదకరంగా ఉంది వాతావరణం. ఓ మూలగా కూర్చున్నారు. అతనే ఆర్డరిచ్చాడు.

"ఎలా ఉంది మీ వ్యాపారం?"

"బాగుందండి... మీరు హౌరా వెళ్లివచ్చారటకదా!"

"అవును. ఇంతవరకు అక్కడికి వెళ్లలేదుకదా! అందుకే చూసి రావటానికి వెళ్లాను''

"ఈసారి అంత రిస్క్ తీసుకోవలసిన పనిలేదులెండి. నేనున్నాకదా!"

"అవును... ఈసారి అలానే చేద్దాం. ఇంకా విషయాలు చెప్పండి''

"ఏముందండి... అంతా మామూలే. మొన్ననే బండి తీసుకున్నాను''

"బాగుంది. పేమెంట్ ఎన్నిరోజులకిస్తున్నారు?"

"వారం. మహా అయితే పదిరోజులు. మనవాడే అక్కడ ఉంటున్నాడు. అక్కడి బిజినెస్ తను చూస్తున్నాడు. మనపనంతా సరుకు పంపించటమే!"

"బాగా పరిచయాలు అయ్యాయా?"

"అవుతున్నాయి. ఏమైనా మన చేతిలో క్యాష్ ఉంటే స్పాట్‌లో అవతల పారేస్తే లాభం. మా నాన్నవాళ్లు నయాపైస ఇవ్వరు. ముందు మా అమ్మ సంగతి గురించి చెప్పుకోవాలి. ఆమెదే అసలు పట్టుదలంతా. నేను పెళ్లి చేసుకోవటం ఆమెకసలు ఇష్టంలేదు''

"అదే సర్దుకుంటుందిలెండి''

"ఏమోనండీ... అదేం కనిపించడంలేదు ముందు మా నడుమ తగాదాలు పెట్టేవారు పెరిగిపోయారు. మేం ఏదో అన్నామని ఆమెతో చెబుతారు. ఇంక తనని పట్టుకోవటానికి లేదు. నా సంగతి వదిలేయండి. మీ కోడలు మిమ్మల్ని నానా మాటలందిఅనిచెబుతారు. కనీసం మా ఇంటికి రాదు. మేం అటు వెళ్లం. ఇంక అనే సమస్య ఏముంది చెప్పండి''

రవీంద్ర నవ్వాడు.

"ఇలాంటివి మామూలేనండి. ముందు వాళ్లు సమాధానపడాలి. అప్పటిదాకా ఈ గొడవల్ని ఎవరో ఒకరు పెంచుతూనే వుంటారు. మీకు పిల్లలు లేరుకదా!"

"లేరండీ. అప్పుడే పిల్లలెందుకనుకున్నాం"

"ఇంకా విశేషాలు చెప్పండి''

"ఏంలేదు సార్... ముఖ్యంగా మనరోడ్లు అర్జెంట్‌గా బాగుపడాల్సిన అవసరముంది. కిరాయిలు విపరీతంగా అడుగుతున్నారు. ఆ గోతుల్లో ప్రయాణం నిజంగా దారుణంగా తయారైంది''

"నిజమే'' అని అంగీకరించాడు రవీంద్ర.

తనకి రోజూ అనుభవమే. ఆ కొద్దిసేపటి ప్రయాణానికే నడుములన్నీ కదిలిపోతాయి. రాగానే వేడినీళ్లతో స్నానం చేసి పడుకోవాలనిపిస్తుంది. లేదా ఏ బార్‌కో పోయి తాపీగా ఓ క్వార్టర్ తీసుకోవాలనిపిస్తుంది.

"ఇదివరకు ఈ రోడ్లవల్ల సమస్య ఆ ఊరివాళ్లే ఎదుర్కొనేవారు. మరిప్పుడు ప్రపంచం దగ్గరయిందికదా!"

"అలా కాదు సార్! మన గవర్నమెంట్ దగ్గర డబ్బులేదు. ఈ రోడ్లు ఇలానే ఏడుస్తాయి. అందుకే వీటిని ప్రైవేట్‌పరం చేయాలి. అప్పుడుగానీ బాగుపడవు''

"కానీ వాళ్లు టోల్‌గేట్ వసూలు చేస్తారుకదా''

'చేయనివ్వండి సార్. ఇప్పుడు అయ్యే ఖర్చులకంటే ఎక్కువ కాదుకదా! నన్నడిగితే అసలు మన గవర్నమెంట్ ఒక్క పోలీసు డిపార్టమెంట్ తప్పించి మిగతావన్నీ బయటి జనానికి వదిలేయాలి. అప్పుడే ఈ దేశం బాగుపడేది''

"అదే జరుగుతుందిలెండి. మరో పది సంవత్సరాలు ఆగండి. ఈ దేశం రూపురేఖలు మారిపోతాయి'' అన్నాడు రవీంద్ర.

"నిజం సార్! ఈ కమ్యూనిస్టు పార్టీలవారూ, ఉద్యోగులూ వద్దంటారు. నన్నడిగితే ఆఫీసుల్లో పని చేసేవాడిని చూపించండి. ఎప్పుడూ కబుర్లు, రాజకీయాలు. మీకింకో విషయం తెలుసా... సాయంకాలానికి ఈ బార్లని పోషించేదెవరు... ఉద్యోగులు కాదూ! మనదేముందండి. అసలు మనం వచ్చేదే వారి కోసం కదా''

రవీంద్ర నవ్వాడు.

"మీకు కార్డ్సు ఆడటంవచ్చా?"

"సరదాగా ఆడుకుంటాం. ఇదివరకయితే తనూ, నేనూ ఇంట్లో ఆడుకునేవాళ్లం. ఇప్పుడు టైం లేదనుకోండి''

"ఏం లేదు సార్. దానికి మించిన కాలక్షేపంలేదు. మనూర్లో క్లబ్ ఉందికదా! నేను సరదాగా అక్కడికెళ్తుంటాను. అదేమిటోగాని వారం రోజులపాటు కూర్చుని ఆడేవారున్నారు. భోజనం, స్నానం అన్నీ అక్కడే''

"మీరు ఆడరా?" అన్నాడు రవీంద్ర.

"ఎప్పుడన్నా ఆడతాను. అయినా చిన్న స్టేకేలెండి. ముందు మనకి పరిచయాలు అవుతాయి. నేను అందుకే వెళ్తుంటాను''

"రెయిడింగ్ ప్రాబ్లమ్స్ ఉండవా?"

"భలేవారే... అసలేమిటనుకున్నారు. పోలీసు అధికారులు వచ్చి ఆడుతూంటారు. రోజుకి కొన్ని లక్షల రూపాయలు చేతులు మారుతుంటాయి. పాలిటిక్స్‌నుండి కంట్రాక్టులదాకా అన్నీ అక్కడ సెటిలయిపోతుంటాయి. అందులో ఈ క్లబ్బుని మించింది జిల్లాలోనే లేదు. ఎవడన్నా మాట్లాడితే టెలిగ్రాఫిక్ ఆర్డర్స్ వస్తాయి. అయిదు నిముషాల్లో దుకాణం సర్దుకు వెళ్లాల్సి ఉంటుంది''

"అవునులెండి. అంత పవర్ లేకపోతే వీటిని నిర్వహించటం సాధ్యంకాదు''

ఆ రోజు బార్‌నుండి సరాసరి క్లబ్‌కి వెళ్లారు.

ముందా ప్రాంతం ఏదో పెద్ద ప్లేగ్రౌండ్‌లా అనిపించింది. పెద్దపెద్ద భవనాలు రెండు కనిపించాయి. వాటినిండా జనం ఉన్నారు.




కేవలం పేకాట ఆడేవారేకాక ఇతర ఇన్‌డోర్ గేమ్స్ ఆడేవారు కూడా కనిపించారు. పేకాట టేబుల్స్ మాత్రం మహా బిజీగా ఉన్నాయి.

ముఖేష్ కొంతమందిని రవీంద్రకి పరిచయం చేశాడు.

"మాట్లాడుతుండండి వస్తా" అని పక్కకి వెళ్లాడు.

"మీరేం చేస్తున్నారు అవికాక" అనడిగాడతను.

"ప్రస్తుతానికి అదొక్కటేనండి'' అన్నాడు రవీంద్ర.

"ఈ షేర్ మార్కెట్ వచ్చాక రియల్ ఎస్టేట్ బిజినెస్ బాగా దెబ్బ తిని పోయిందండి. లేకపోతే ఈ పాటికి బ్రహ్మాండంగా ఉండేది'' అన్నాడాయన.

"మీరేం చేస్తున్నారు''

"ఫైనాన్స్ కంపెనీ ఉందండి. రియల్ ఎస్టేట్‌లో కూడా ఉన్నాను. అదేమిటో ఆ షేర్ మార్కెట్ చాచి దెబ్బకొట్టినా ఈ జనానికి బుద్ధి రాలేదండి''

"నా చిన్నప్పుడు పెద్దవాళ్లు చెప్పేవారు. పోయిన చోటులో వెతుక్కోండి అని''

"బాగా చెప్పారండి. జనం గోలంతా అదే. ఎప్పటికయినా అక్కడే రికవరవుతాం అని నమ్మకం. మా కజిన్ ఉన్నాడు. చక్కటి ఉద్యోగం సార్. అందులోనూ బ్యాంక్‌లో. వాడికి సిటీ అంటే తలనొప్పి. జాయినింగ్ హైదరాబాదే. సంవత్సరంలోనే ప్రయత్నం చేసి తమ ఊరికి దగ్గరగా ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాడు. అక్కడే మారేజ్ అయింది. ఇద్దరు పిల్లలు పుట్టారు. ఎడ్యుకేషన్ ఫర్వాలేదు బాగానే ఉంటుంది. బాంక్ అయిపోతే ఇంటికి వెళ్లేవాడు. టీవీముందు కూర్చునేవాడు. అంతకుమించి ఇంకో ప్రపంచం ఉండేది కాదు. మేమంతా వాడిని ఎగతాళి చేసేవాళ్లం. అలాంటిది ఈ షేర్ మార్కెట్‌లోకి రాగానే హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాడు. టోటల్‌గా ఫోర్‌లాక్స్ షేర్స్‌మీద ఇన్వెస్ట్ చేశాడు''

"ఎలా ఉంది పరిస్థితి''

"ఎలా ఉండటం ఏమిటండీ. స్కాం ఈడ్చికొట్టింది. ఇంతవరకూ తేరుకోలేదు. ఊర్లో పొలాలు అమ్మిపారేసి ఆ డబ్బు వాటిలో పెట్టాడు. ఇంకా వడ్డీలకు తెచ్చాడు. ప్రస్తుతం వడ్డీలు కడుతున్నాడు. స్కాంలో సరయిన సమయానికి ఆ షేర్లు అమ్మి ఉంటే కనీసం పది లక్షలు మిగిలి ఉండేవంటాడు. ధరలు పెరుగుతున్నాయికదా అనుకున్నాడు. రెండు రోజుల సమయం. అంతే ఫినిష్. వాడిదీ ఇదే ధర. పోయిన చోటే వెతుక్కుంటాను అంటాడు. ఎప్పటికైనా తిరిగి పోయినవన్నీ సంపాదిస్తానంటాడు''

ముఖేష్ వచ్చి అన్నాడు...

"రండి చిన్న స్టేకే, కూర్చుందాం"

"వస్తానండి'' అని రవీంద్ర శెలవు తీసుకుని వెళ్లాడు.

మొత్తం ఆరుగురు కూర్చుని ఉన్నారు. అందులో కొందరి ముఖాలు మహా సీరియస్‌గా ఉన్నాయి. కేవలం పేకాడటం కోసమే తాము పుట్టారా అనిపిస్తున్నారు. మరికొందరు మాత్రం జయాపజయాలు తమకనవసరం. పేకయుద్ధంలో పాల్గొనడమే తమ కర్తవ్యం అన్న చందాన ఉన్నారు.

ముందుగా ఏఏ సీట్లలో కూర్చోవాలో పేకలు కోశాక నిర్ణయం అయింది. రవీంద్రకి హయ్యెస్ట్ స్థానం లభించింది.

సరిగ్గా రెండున్నర గంటల తర్వాత సీట్ల నుండి లేచారు. వచ్చేముందు ఒకాయన అడిగాడు రవీంద్రని.

"మిమ్మల్నిక్కడ మొదటిసారిగా చూస్తున్నాను''

"అవునండి... ఇక్కడేకాదు క్లబ్బులో ఆడటం మొదటిసారి''

"అనుకున్నానులెండి'' అన్నాడాయన.

మిగతావారు పెదవులు దాటకుండా

నవ్వటం గమనించాడు.

"వస్తానండి'' అన్నాడు రవీంద్ర.

ఆ సంగతి నాకు తెలుసు అన్నట్లుగా తలూపాడాయన. బయటకు వెళ్లాక రవీంద్ర ముఖేష్ నడిగాడు.

"అతను అలా అడిగాడెందుకని''

"ఏం లేదు రవీంద్రగారూ! ఈ పేక మహా చిత్రమైంది. మొదటిసారి పేక ఆడేవారికి బాగా కలిసొస్తుంది. ఏమాత్రం మిగిలిందే మిటి'' అన్నాడు.

"దగ్గర దగ్గర అయిదువేలు''

"నాకు రెండొందలు లాస్. ఈ పేకాట ఆడేవాళ్లు ఎంత మేధావులంటే ఆవులించ కుండానే పేగులు లెక్కబెడతారు''

ముఖేష్ వెళ్లిపోయాడు. రవీంద్ర ఇంటికి వెళ్లేసరికి తన ముందు పేపర్లు పెట్టుకొని సీరియస్‌గా ఆలోచిస్తోంది వసుంధర.

రవీంద్ర స్నానం చేస్తూ అనుకున్నాడు...

"పేకాటవలన నష్టం ఉందనుకుంటారు. జాగ్రత్తగా ఆడుకుంటే బాగానే ఉండేట ట్లుంది. అయినా ఇంత మేధావులందరూ ఇలా సాయంకాలం అయ్యేసరికి క్లబ్బుల్లోకి వెళ్లకపోతే దేశం ఎప్పుడో అటు ముందుకు పోవటమో ఇటు ధ్వంసమో అయి ఉండేది''

స్నానం చేసి వచ్చేసరికి వసుంధర ఏవేవో పుస్తకాలు చూస్తూనే ఉంది. రవీంద్ర వెళ్లి వాటిని చూశాడు. కొన్ని తెలుగువి, కొన్ని ఇంగ్లీష్‌వి. అన్నీ షేర్ మార్కెట్‌కి చెందినవే. గతంలో అయితే వీక్లీలు చదివేది. అలాగే నవలలు. ఇప్పుడు వాటికసలు ఇంపార్టెన్స్ లేదు.

"ఫిక్షన్ పూర్తిగా మానేశావా?" అన్నాడు రవీంద్ర.

"అందులో ఏముందండి థ్రిల్. ఇంత కాలం వాటిని అంత ఆబగా ఎలా చదివేదా న్నో తలుచుకుంటే నాకే ఆశ్చర్యంగా ఉంది. అన్నీ ఒకటే రకం కదండి. లవ్ తీసుకున్నా అంతే. మాఫియా నవలలూ అంతే. అక్కడి దాకా ఎందుకు టివిలో ఇన్ని ఛానల్స్ ఉన్నాయి. అవి చూసే తీరిక ఉంటుందా ఏమిటి?"

"అంత ఆనందం ఉందా ఈ మార్కె ట్‌లో''

"మెదడు... మెదడుండాలి. దానికి పని కల్పించాలి. రాబోయే పరిణామాలు అంచనా వేయగలగాలి. మరి ఎన్ని పత్రికలు చదవాలి. ఎంతగా కాన్‌సన్‌ట్రేట్ చేస్తేనో నాలుగు రాళ్లు సంపాదించటం. ముందు సంపాదనని కాదు గానీ ఇదీ ఒక వ్యసనమేనండి బాబూ. అదిసరే మళ్లీ బార్‌కి పోయారా. ఇంతసేపు ఉంటే ఎలా? మీరసలు అనవసరంగా డ్రింక్ చేస్తున్నారు. ఈ అలవాటు చేసుకోండి. ఏ మందూ ఇవ్వలేనంత కిక్ ఇస్తుంది''

"నా లిమిట్స్ నాకు తెలుసు వసుంధరా! నువ్వు ఎటూ ఆ రంగంలో ఉన్నావ్‌కదా''

"లేదండి... మీరూ వస్తే డిస్కస్ చేయవ చ్చు. అందువల్ల పొరపాట్లు చేయటానికి అవకాశాలు తక్కువగా ఉంటాయి''

"ఏమో నాకంత ఇంట్రెస్ట్‌లేదు''

"సరేలెండి. మీకు ఈ రోజు ఏదో చెబుదా మనుకున్నాను. ఏమిటంటే'' అని ఆలో చించింది. ఎంతకీ గుర్తురాలేదు.

"సర్లెండి... అదేదో మరిచిపోయాను. ముందుగా నేను చెప్పదలుచుకుంది ఏమి టంటే మీరు బార్‌కి వెళ్లే బదులు అదేదో ఇంట్లోనే డ్రింక్ చేస్తే బాగుంటుంది. మీరు డ్రింక్ చేస్తూ టీవి చూడండి. నా పనిలో నేనుంటాను. అంతేకాని మీరింకా రాలేదు అనిపిస్తుంటుంది. ఆ ఆలోచన్లతో నా ఆలోచన ఓ చోట నిలవటంలేదు''

"సర్లే అయిందా'' అన్నాడు.

"ఉండండి. అయిపోవచ్చింది. భోంచేయ కూడదూ''

"నువ్వు చేశావా?"

"ఈ రోజు టిఫిన్. మీకు కావాలంటే




ఇంకా రెండు చపాతీలున్నాయి. అన్నీ అక్కడే ఉన్నాయి. తినకూడదూ''

రవీంద్రకి భోజనం చేయాలనిపించలేదు. రెండు చపాతీలు మాత్రం తిన్నాడు. ఇంకా వసుంధర పనిలోనే ఉంది.

వెనగ్గా వచ్చి కళ్లు మూశాడు. అమాంతంగా ఆమెను రెండు చేతులమీదా ఎత్తుకొని తీసుకువెళ్లాడు.

"చాల్లే ఊరుకోండి. మరీ చిన్న పిల్లలవుతున్నారు''

"మరేం చేస్తాం. నువ్వు ముసలమ్మవవుతుంటేనూ''

"ఉండండి'' అంటూ తను లైట్ తీసి వచ్చింది.

"ఏమిటో నీతో సరిగ్గా మాట్లాడి ఎన్ని సంవత్సరాలయిందో అనిపిస్తోంది'' అన్నాడు.

వసుంధర ఏదో ఆలోచిస్తూనే ఉంది.

పడుకోబోయేముందు చెప్పింది.

"ఇప్పుడు గుర్తుకొచ్చిందండి. మన సంకేత్‌నుండి ఉత్తరం వచ్చింది''

లేచి చూద్దామా అనుకున్నాడు. అంతలోనే బద్ధకం అనిపించింది.

'రేపు చూద్దాంలే' అనుకున్నాడు.

గోడమీద సంకేత్ ఫొటోనుండి నవ్వుతున్నాడు.

వారిద్దరూ నిద్రలోకి జారిపోయారు.

★ ★ ★

ఉదయం లేచి స్నానం చేశాక చెరువుల దగ్గరికి బయలుదేరాడు. వెళ్లగానే నారాయణ 'సూర్యం'గారు ఎందుకో కబురు చేశారని చెప్పాడు. అటునుండి అటే ఆయన చెరువుల దగ్గరికి వెళ్లాడు. ఆయన అక్కడో ఇల్లు కట్టాడు. మరీ అంత పెద్దది కాకపోయినా చూడటానికి బాగుంటుంది. అందులోనే అన్నీ ఏర్పాటు చేసుకున్నాడు. నాలుగు గదులుదాకా ఉన్నాయి. ముందో హాలు ఉంది. ఎటాచ్డ్ బాత్‌రూం కమ్ టాయ్‌లెట్ ఉన్నాయి. ఓ గదిలో పెద్ద టేబుల్. దాని చుట్టూ కుర్చీలున్నాయి. ఇంతకుముందు పరీక్షగా వాటిని చూడలేదు రవీంద్ర.

లోపల ఇంకా కలర్ టీవి, వీసీపి, ఫ్రిజ్ ఉన్నాయి. ఓ గ్యాస్‌స్టవ్ ఉంది.

"రండి'' అంటూ లోపలకు తీసుకు వెళ్లాడు.

ముందు ముందు ఎందుకైనా మంచిదని ఇల్లు కట్టించేశా. చెరువుల దగ్గరుండి మనం చూసుకోవటంవలన కొన్ని లాభాలుంటాయి. రెండోది ఎంత బాగా చేసినా, మొత్తం బాధ్యత పనివారి మీద పెట్టకూడదు. ఇంకా నేమో ఫ్రెండ్స్ చంపేస్తున్నారు. మీ చెరువుల దగ్గర పార్టీ చేసుకుందాం అంటారు. ఇక్కడ ఏముంటాయి. ప్రతిదానికీ బండిచ్చి పంపాలి. ఇప్పుడు చూడండి. ఏం కావాలంటే అది హాయిగా ఉంటుంది''

"అవును'' అన్నాడు రవీంద్ర.

రెండు గదుల్లో డబల్‌కాట్ మంచాలున్నాయి. వాటిమీద పరుపులున్నాయి. ఇంకా మెత్తటి దిండ్లున్నాయి.

"ఫ్రెండ్సే కాదులెండి, ఇంటి దగ్గర బోర్ అనిపిస్తే నాలుగు రోజులు వచ్చి కాలక్షేపం చేయవచ్చుకదా'' అన్నాడాయన.

"అవును... మా నారాయణ చెప్పాడు. వెంటనే ఇలా వచ్చేశాను''

"మీరు హైదరాబాద్ రాగలరా?" అన్నాడు.

"పనేమిటి?"

"మా ఫాదర్ ఆరోగ్యం అంత బాగుండటంలేదు. చెక్ చేయించుదామనుకుంటున్నాం. అలాగే మా మిసెస్‌కి చిన్న ఆపరేషన్ చేయాలి. రెండు కార్లలో వెళ్తున్నాం. మీరు కూడా వస్తే బాగుండుననుకుంటున్నాను''

"ఎప్పుడు బయలుదేరుతున్నారు?"

"అదే ఆలోచిస్తున్నా. రెండు రోజుల్లో బయలుదేరవచ్చు. మీకు కబురు చేస్తాను''

"అలాగే నేను కూడా హైదరాబాద్ వెళ్లి చాలా కాలమైంది. వస్తాను''

"ఇంకా సంగతులేమిటి?" అనడిగాడు సూర్యం.

"ఏముంది... అంతా మామూలే. అది సరే... ఇక్కడ మంచి డాక్టర్స్ ఉన్నారుకదా! ముందుగా ఇక్కడ చూపించకపోయారా''

సూర్యం బిగ్గరగా నవ్వాడు.

"భలేవారే... ఆ మాట మావాళ్ల ముందంటే ఇంక ఇదంతా నేను మీతో కలిసి చెప్పించాననుకునేవారు. ఇక్కడ డాక్టర్లు సగి పోతారని నాకు తెలుసు. వీటిని హాస్పిటల్స్‌గా వాళ్లు అంగీకరించాలికదా!" రవీంద్రకి నవ్వు వచ్చింది.

ఈ రోజుకీ తమ ఊర్లో ఓ డాక్టర్ లేడు. తను చిన్నతనంలో అయితే అర్ధరాత్రి కడుపు నొప్పిలాంటిది వచ్చినా, ఇంకే సమస్య ఎదురైనా, అప్పటికప్పుడు తాత్కాలిక వైద్యాలే. కొంతమంది ఇళ్లల్లో మాత్రం మందులు ఉంచుకునేవారు. అక్కడ కనీసం మెడికల్ షాపు కూడా ఉండేది కాదు. తలనొప్పికి, జ్వరానికి మాత్రం కొన్ని ప్రముఖ కంపెనీల వారి టాబ్లెట్స్ పచారీ దుకాణంలో లభించేవి.

ఎవరికేం సమస్య వచ్చినా టౌన్‌కి పరిగెత్తుకెళ్లాల్సిందే. అక్కడ ముగ్గురు డాక్టర్లు ఉండేవారు. అందులో ఒకాయన ప్రాక్టీస్ బాగుండేది. ఇంకో డాక్టర్ పరిస్థితి కొంచెం ఫర్వాలేదు. మూడో డాక్టర్ మాత్రం పుస్తకాలు చదువుకుంటుండేవాడు. ఆ నర్సుకి ఎంత జీతం ఇచ్చేవాడోగాని ఎప్పుడూ ఈసురోమంటూ తనే పేషెంట్‌లా కనిపించేది. ఆయనకంటే నాటు వైద్యం చేసే డాక్టర్ ఉండేవాడు. ఆయన పరిస్థితి బాగుండేది. మనిషి దగ్గర రెండు రూపాయలు మాత్రం తీసుకునేవాడు. ఇంజక్షన్ చేస్తే అర్ధరూపాయి. ఇప్పటికీ తన దగ్గరికి జనం వస్తూనే ఉంటారు. ఓ ఆర్.ఎమ్.పి సర్టిఫికెట్ ఎలానో సంపాదించాడు.

అలాంటి చోట ఈరోజు చాలా హాస్పిటల్స్ వెలిశాయి. కొన్ని హాస్పిటల్స్ బాగా ఉన్న మాట నిజమే. అయినా అందరికీ పనులున్నాయి. ఏ హాస్పిటల్ చూసినా పేషెంట్లు కనిపిస్తూనే ఉన్నారు. కొంతమందయితే తమ హాస్పిటల్లోనే రకరకాల యూనిట్లు నెలకొల్పారు.

బ్లడ్ టెస్ట్‌నుండి, ఎక్స్‌రేలదాకా దాదాపు అన్ని పరీక్షలూ అక్కడే చేయించుకోవచ్చు. ఇంకా రెండుమూడు అంతస్థులుంటాయి. రెండు రకాల గదులుంటాయి. వాటి అద్దెలో స్వల్పంగా తేడా వుంటుంది. అయినా సరే ఆ గదులెప్పుడూ పేషెంట్లతో నిండి వుంటాయి. అలాంటిది కొంతమంది దృష్టిలో ఇవి హాస్పిటల్స్ కాదు! భుజాలెగరేశాడు రవీంద్ర.

"కొన్నికొన్ని మనమేం చేయలేం సార్. ఈ రోజున మనం హాస్పిటల్స్ అనుకుంటున్నాంగాని అవి ఖరీదైన లాడ్జీలు. ఇంక లాడ్జిల్లోనయినా వారు సరిగా సేవలు చేయరేమోగాని డబ్బులు పారేస్తే ఇక్కడ ఎంత హాయిగానో ఉంటుంది. ఎవరెవరో ఎక్కడినుండో వస్తారు. నాలుగు ఆపరేషన్లు చూసుకుంటారు. జేబునిండా డబ్బులు కుక్కేసుకుని వెళ్తారు. ఇంక ఆ గదుల్లో జనం రోజూ డబ్బులు పారేసుకుంటారు. ఇవన్నీ మనకు తెలుసు. చెబితే అర్థంకాదు. కానీయండి ఎటు నుండి వచ్చే డబ్బు అటు పోవాలని రాసుంటుంది. మీకు ఇద్దరు ముసలాళ్లని చూపిస్తా. వుంటారుగా'' అన్నాడు. రవీంద్ర తలూపాడు.

"మీ వాడు ఉత్తరాలు రాస్తున్నాడా? అక్కడ బాగుందా?" అన్నాడాయన.

అప్పుడు గుర్తుకొచ్చింది సంకేత్ ఉత్తరం గురించి.

"రాస్తున్నాడండి. అక్కడికి మేం వెళ్లొచ్చాంకదా. చాలా బాగుంటుంది''

"బాగుండక ఛస్తుందేంటిలెండి... వేలాది




రూపాయలు తీసుకుంటున్నాక"

"అయితే నాకో పూట ముందు కబురు చేయండి. నేను బయలుదేరతాను. బహుశా రెండు రోజులకి మించి నేనక్కడ ఉండలేకపోవచ్చు''

"ఫర్వాలేదు. మీరు వచ్చేద్దురుగానీ. అయినా రెండు కార్లలో బయలుదేరటం అంటే ఎంత గౌరవం. అందులోనూ మీలాంటి వారొస్తుంటే'' అని నవ్వాడాయన.

రవీంద్ర కూడా నవ్వి "నేను వస్తా'' అనేసి చెరువు దగ్గరకొచ్చాడు.

"ఇదంతా ఎవరికోసం" అనిపించింది.

కొద్దిగా బాధ కలిగింది. 'సంకేత్ ఉత్తరం గురించి ఇప్పటివరకూ అసలు గుర్తు రాక పోవటం ఏమిటి? రాత్రి అమాంతం పక్కమీదనుంచి దూకి ఆ ఉత్తరాన్ని గుండెలకి హత్తుకోవాలి. తనేం రాశాడో ఆబగా చదువుకోవాలి. కానీ లేవాలనిపించలేదు. తిరిగి ఉదయానికి అసలు జ్ఞాపకమేలేదు.

చదవకపోతే పోనీ, కనీసం ఏంరాశాడని కూడా అడగలేదు. తను అడగక పోయినా కనీసం వసుంధరయినా చెప్పవచ్చుకదా! తనెందుకు చెప్పలేదు అనిపించింది. ఇంతకు ముందు ఇలా ఉండేదికాదు. రెండు రోజులు తనని విడిచి ఎక్కడికైనా వెళ్తే తిరిగి వచ్చి చూసుకునేదాకా ఆరాటమే. వాడూ అంతే. ఇప్పుడెందుకిలా జరుగుతోంది? తను అన్నిరకాలుగా భ్రష్టుపడుతున్నాడా! అదే అయితే క్షంతవ్యం కాదు. ఇంక అక్కడ ఉండాలనిపించలేదు.

నారాయణకి చెప్పి ఇంటికి బయలుదేరాడు. సగం దూరం వచ్చాక మలుపు తిరుగుతుంది. అక్కడినుండి మెయిన్‌రోడ్ మలుపు తిరిగి రోడ్‌మీదకొచ్చేటప్పటికి బారులు తీర్చి ఉన్న వాహనాలు కనిపించాయి. అసలు ఎటూ కదిలే అవకాశం కనిపించటంలేదు. రోడ్డు పక్కన మాత్రం గుంపులు గుంపులుగా జనం కనిపిస్తున్నారు. ఓ పక్కగా స్టాండ్ వేశాడు. కొంతదూరం నడిచాక అడిగాడు.

"ఏక్సిడెంట్ జరిగిందా?"

"ఏమోనండి'' అన్నాడతను.

మరికొంతదూరం ముందుకు వెళ్లాడు. రెండు వరసల్లో లారీలూ, బస్సులు నిలిచి పోయి ఉన్నాయి. అవి ఎప్పుడు క్లియర్ అవుతాయో తెలియదు. ఎవరన్నా కంట్రోల్ చేస్తే కనీసం రెండు గంటలు పట్టేటట్లుంది. వెనక్కి వెళ్లిపోతేనో అనుకున్నాడు. వెళ్లి ఏం చేయాలో అర్థం కాలేదు.

చెరువు దగ్గర ఏమీలేదు. చిన్న పూరిల్లు ఉంది. అక్కడ కుర్చీలుంటాయి. మహా అయితే నారాయణ భార్య పొగచూరిన టీ పంపిస్తుంది. సూర్యం గారిలా తనకు ఇల్లులేదు. కడితే ఎలా ఉంటుంది. అన్న ఆలోచన వచ్చింది.

వసుంధర అంగీకరిస్తుందా అనే అనుమానం కలిగింది.

అనవసరంగా చెరువులమీద అంత డబ్బు వృధా చేయటం ఎందుకంటుందేమో. అదే డబ్బుతో టౌన్‌లో ఇల్లు కట్టినా లేదా తన వ్యాపారంలో పెట్టుబడి పెట్టినా ఆదాయం బాగుంటుందనవచ్చు.

ఎవరో తిట్టుకుంటూ వెళ్తున్నారు.

"ఏం సార్, క్లియరయ్యేటట్లు లేదా?"

"ఏమౌతుంది సార్. మొన్న ఓ యువ నాయకుడికి సన్మానం అంట. నాలుగు గంటలు ట్రాఫిక్ జామ్ అయింది. రేపు ఎవడో పోతాడు. ఎల్లుండి ఎవడో పుడతాడు. ట్రాఫిక్ జామ్... అరే ఎంత రోడ్లండి. అన్నీ గోతులు... యాక్సిల్ విరక్క ఛస్తుందా? అయినా ఈ లారీ నా కొడుకుల్ని కాల్చిపారేయాలి'' అనేసి వెళ్లిపోయాడు.

రవీంద్ర ఇంకొంత దూరం నడిచాడు.

రోడ్డు నడుమ ఓ లారీ ఆగిపోయి ఉంది. దాని చుట్టూ రాళ్లు పెట్టారు. ఇంక కష్టంగా ఓ బండి కదలే చోటు మాత్రం ఉంది. ఎదురెదు

రుగా లారీలు. ఎవడూ తగ్గడు. ఎవరు ముందు సైడివ్వాలి అనేది తేలలేదు. లారీలు ఆగిపోయాయి. వాటి వెనకాల బస్సులు, కారులు, స్కూటర్లు...

ఇంత వేగమా అనిపించింది. ఇదివరకు ఇంత హడావుడిలేదు. ఇంత రద్దీలేదు. ముందు ఇలా రోడ్లమీద అడ్డం పెట్టుకోవటం చాలా తక్కువ.

నిజంగా ప్రయాణాలు చాలా దరిద్రంగా తయారైనాయండి. కరెక్ట్ టైమ్‌కి చేరితే చాలా అదృష్టవంతుల కిందలెక్క. ఎవరికి కోపం వచ్చినా, ఎవరికి సంతోషం వచ్చినా రోడ్లన్నీ బందవుతున్నాయి'' అన్నాడో ప్రయాణికుడు.

"రాస్తారోకో'' కని పెట్టారుగా అన్నాడో యువకుడు.

కొంతమంది చాలా అసహనంగా కనిపిస్తున్నారు. ఇంటర్వ్యూలకు చేరవలసినవారూ, అర్జెంట్ పనులున్న వారూ, బాధలున్నవారూ నిస్సహాయంగా చూస్తున్నారు.

రవీంద్ర వెనక్కి తిరిగి వస్తుంటే అంటున్నారెవరో

"ఈ దేశం బాగుపడదు''

సంకేత్ గుర్తుకొస్తున్నాడు. వాడు పెద్దయ్యేనాటికి ఈ ప్రపంచం ఎలా ఉంటుందో అనే ఆలోచన వచ్చింది. ఇదంతా సజావుగా ఉండదేమో. మొత్తానికేదో తీవ్రమైన కుదుపు వస్తుందేమో... మరి వారందరూ తట్టుకుంటారా? ఇంతకూ ఉత్తరంలో ఏమి రాశాడో? అసలు ఎలా ఉంటున్నాడో? పిల్లందరితోనూ కలిసిపోయాడు. ఇంకా బెంగగా ఉన్నాడు. ఏమైతేనేం చదువు బాగా వస్తుంది. తనో మంచి పౌరుడుగా ఎదుగుతాడు.... ఇంతకూ మంచి పౌరుడంటే ఏమిటి? తనొక్కడే ఎదిగితే బాగుంటుందా? ఇప్పుడు ఇందులో ప్రమేయం లేనివారే అందరూ. కానీ ఒకరిద్దరి అహంకారానికి ఎంతమంది అనుభవించాల్సి వస్తుంది.

"ఏం రవీంద్రగారూ నడిచి వస్తున్నారే' పలకరించారెవరో

'"బండి అక్కడ పెట్టాను'' అన్నాడు.

"ఇప్పుడే ఏం కాదా?"

పెదవి విరిచాడు రవీంద్ర. ఆయనో సిగరెట్ వెలిగించాడు.

"డబ్బుండి బాబూ! ఈ ముదనష్టం ఒక్కోడికి ఒక్కోరకంగా పాకింది. ఓ లారీ లోడు వేసుకెళ్తే వేలు వస్తున్నాయి మరి. కొడుకులకి తిన్నది అరగాలిగా. మధ్య మధ్యలో ఇలా ఆటలాడుకుంటారు. ఆ తర్వాత ఎనభై, తొంభైల్లో పోతారు. ఎవరినో గుద్దేసి ఆళ్లని చంపి వీళ్లు ఛస్తారు. కనీసం చిన్నవైనా పోయేట్లులేవా?"

"కష్టంగా ఉందండి''

"సరే కానీండి. నలుగురితోపాటు మనం" అన్నాడాయన.

ఇంక ఆయన కబుర్లు చెబుతూనే ఉన్నాడు. సమయం ఎంతయిందో తెలియటం లేదు. దాదాపు గంటకి ఓ లారీ పద్మవ్యూహం నుండి బయటపడి ముందుకి కదలింది భారంగా. ఓ పది వాహనాలు కదిలాక తిరిగి ఆగింది.

ఇంకో అరగంట గడిచింది. తిరిగి కదిలిక ఆరంభం అయింది. సరిగ్గా అరగంటకి లైన్ క్లియర్ అయింది. అప్పుడు బయలుదేరాడు రవీంద్ర. రోడ్డు నడుమ ఆగిపోయిన లారీ లారీలా కనిపించలేదు. కుప్పకూలిన సంస్కృతిలా ఉంది. ఎండమావి లాంటి మానవత్వంలా అనిపించింది.

రవీంద్ర సరాసరి ఇంటికివెళ్లాడు. తాళం కప్ప చూడగానే నీరసం వచ్చింది. ఇంటివాళ్ల దగ్గరకు వెళ్లాడు. ముందు ఆకలిగా ఉందనిపించింది. పనిమనిషి వచ్చింది. తాళం చెవులు అందించింది.

అడగకూడదనుకుంటూనే అడిగాడు.

"ఎక్కడికి వెళ్లారు?"

"తెలియదండయ్యా''




వెళ్లి తలుపులు తీశాడు. ఫ్రిజ్ తలుపు తెరిచాడు. అందులో ఓ బ్రెడ్ పాకెట్ ఉంది. వరసగా ఎగ్స్ కనిపించాయి. వాటిని అందు కుని కిచెన్ రూంలోకి నడిచాడు. ముందు బ్రెడ్‌ని నెయ్యితో వేయించాడు. తర్వాత నాలు గు గుడ్లతో ఆమ్లెట్ తయారు చేశాడు.

వాటిని తిన్నాకగానీ, ఆకలి తీరినట్లని పించలేదు. తిరిగి అప్పుడు గుర్తొచ్చింది సంకేత్ ఉత్తరం. కనిపిస్తుందేమోనని చూశా డు. ఎక్కడా కనిపించలేదు. షెల్ఫ్ తీశాడు... లేదు. బీరువా వెదికాడు... లేదు. పుస్తకాలు పేజీలు తిప్పి చూశాడు... కనిపించలేదు.

అసహనంగా ఉంది. కోపంగా ఉంది. కనిపించినవన్నీ విసిరేయాలనుంది. ఎవరూ లేరు. ఇల్లంతా బోసిగా అనిపించింది.

ఈ ప్రపంచంలో తను తప్ప ఇంకెవరూ లేనట్లుగా ఫీలయ్యాడు.

ఎందుకో శరీరమంతా చెమటలు పట్టింది. చేతులు కంపిస్తున్నాయి. ఇంక అక్కడ కూర్చోవాలనిపించలేదు. తాళంవేసి బండి తీసుకుని బయటికొచ్చాడు. ఒక్క కిక్‌తో స్టార్టయింది. పనిమనిషి పరిగెత్తుకు వచ్చేసరి కి దూసుకుపోతున్న వాహనం కనిపించింది. సరాసరి ఓ బార్ ముందుకు వెళ్లాకగానీ ఆ వేగం కంట్రోల్ కాలేదు.

మరో అయిదు నిముషాల తర్వాత క్వార్టర్ బాటిల్ ముందుంది. ఇంక సమయం ఎలా గడిచిపోయిందో తెలియదు. బిల్‌పే చేసి ఇంటికి వెళ్లేసరికి ఇంటి ఓనర్‌గారితో వసుంధర ఏదో మాట్లాడుతోంది. రవీంద్రని చూడగానే లేచి వచ్చింది.

"కీస్ ఇవ్వకుండా వెళ్లిపోయారే!"

రవీంద్ర మాట్లాడలేదు. తాళం తీసి గదిలో కి అడుగుపెట్టాక అన్నాడు "ఎక్కడికి వె ళ్లావ్''

"షాపింగ్‌కి. ఏంటి అలా అడిగారు'' అంది.

"ఆ ముక్క చెప్పి పోవచ్చుగా''

"ఎవరికి'' అంది ఆశ్చర్యంగా.

"ఆ కింద పనిమనిషికి... అయినా షాపింగ్‌కి టైం ఉండదా?"

"ఆవిడ మంచి చీరలు వచ్చాయి రమ్మంటే వెళ్లాను. అందులోనూ ఏదో స్కీం పెట్టారట" అంది.

"ఏం కొన్నావ్?" అసహనంగా అన్నాడు.

"అసలు విషయమేంటో చెప్పండి. అరు స్తున్నారేంటి. నేనేదో తప్పు చేసినట్లు. మీరు ఎక్కడెక్కడ తిరుగుతున్నారో నాకు చెబుతు న్నారా? ఇందాక మీరు వెళ్లేటప్పుడు కనీసం తాళం చెవులు ఇచ్చారా? ఎక్కడికి వెళ్లారో తెలియదు. ఇంకా నయం. ఇప్పుడు వచ్చారు కాబట్టి సరిపోయింది. లేకపోతే సాయంకాలం దాకానో..."

"నేను చచ్చేననుకో... ఏం చేసేదానివి''

వసుంధరకి కోపమూ, అవమానమూ ఏక కాలంలో కలిగాయి. చాలా కఠినంగా జవాబు చెప్పాలనుకొంది. కానీ అతికష్టం మీద నిగ్ర హించుకుంది. పెదవులు అదురుతుండగా రవీంద్రని తీక్షణంగా చూసి బీరువా తలుపు తెరిచింది. అందులోని ఓ చీరను అందుకుని మూసింది. మౌనంగా బెడ్‌రూంలోకి వెళ్లి చీర మార్చుకుంది.

రవీంద్రకి ఏం చేయాలో అర్థం కాలేదు. వాడు రాసిన ఉత్తరం ఎక్కడపెట్టావని అడగ టానికి అహం అడ్డు వచ్చింది. వసుంధర కిచెన్ రూంలోకి వెళ్లింది. అక్కడ అడ్డదిడ్డంగా పడున్న వాటినన్నింటినీ సింక్‌లో వేసింది.

"అయ్యగారికి ఆకలయి ఉంటుంది. అయి తే మాత్రం ఆ అరుపులేమిటి? ఇలా ఊరు కుంటే కాదు'' అనుకొంది.

రవీంద్ర లుంగీ కట్టుకొని పడుకున్నాడు. వెంటనే నిద్ర పట్టేసింది. తిరిగి తను లేచేసరి కి రాత్రి అయిపోయింది. వసుంధర బుక్స్ చూసుకుంటోంది. రవీంద్ర మాట్లాడకుండా వెళ్లి స్నానం చేశాడు.

క్లబ్బుకి వెళ్తేనో అనిపించింది.

వెంటనే బట్టలు ధరించాడు. బయటకు నడుస్తుంటే ఒక్కసారి మాత్రం వసుంధర తలపైకెత్తి చూసింది. రవీంద్ర సరాసరి క్లబ్బుకి వెళ్లాడు.

మరో పావుగంట తర్వాత ముక్కలు కలుపుతున్నాడు. నోట్లో సిగరెట్ ఎర్రగా కాలుతోంది. అరగంట తర్వాత చూసుకున్నాడు. కనీసం ఎనిమిది వేలు ఉంటాయనిపించింది.

"వెళ్లిపోదామా'' అనుకున్నాడు.

"ఏంటి ఆలోచిస్తున్నారు. ఈ రోజు మీకు బాగుందిలే' అన్నారెవరో.

ఇంకో రౌండ్ ఆడదాం అనుకున్నాడు. ముక్కలు పంచారు. అన్నీ సర్దాడు. జోకర్ వచ్చింది. ఆటంతా బాగుంది. ఇంక ఓ ముక్క కలవాలి. మహా అయితే రెండు రౌండ్లు జరుగుతుందేమో. అందరూ ఆడతారా... పారేస్తారా అని చూశాడు. ఒకరు తప్పించి అందరూ ఆడారు. మొదటి కార్డు వేస్ట్... రెండోసారి ఉపయోగం లేదు. మూడోసారి...

"షో... అన్నాడు తన పైన వ్యక్తి.

నోటిదగ్గరకూడుని ఎవరో లాక్కుపోతున్న భావన కలిగింది. చాలా నిరాశ కలిగింది.

"పేక ఎత్తిన కాడినుండి ఎక్స్‌టెన్షనండి. ముక్క కలవలా'' అన్నాడు.

"మరేంటనుకున్నారు. ఎక్స్‌టెన్షన్ లేక ఎకరాలమ్మేరు'' అన్నాడొకాయన.

తిరిగి పేక పంచారు. రవీంద్ర ఒక్కో ముక్క ఎత్తుకొని సర్దాడు. ఆడాలా, వద్దా అని సందేహించాడు. ఆట చూస్తే కళ్లు తిరిగిపోతాయి. జోకర్ వచ్చింది. రెండు ట్రిప్‌లెట్‌లున్నాయి. లైఫ్ లేదు... కేవలం ఓ ముక్క కాకపోతే అన్నీ పెద్ద కార్డులు.

"మీరే' అన్నారెవరో.

ముక్క అందుకున్నాడు. ఉపయోగం లేదు. డిస్కార్డ్ చేశాడు.

నాలుగు రౌండ్లు తిరిగాయి. ముక్క రావటంలేదు. విపరీతమైన టెన్షన్. పారేద్దామా అనుకుంటాడు... పారేయలేడు. ఇంకోసారి చూద్దాం అనుకున్నాడు. లాభం లేదు.

'షో' అన్నారెవరో.

ఫుల్‌కౌంట్!

'లైఫ్ అండ్ డెత్... చాలా చిత్రమైన స్థితి. ముక్క కలిస్తే బతకటం, లేకపోతే నాశనం. పేకాట ఫిలాసఫీ అది. జూదం మనిషి నెందుకంత ప్రలోభ పరుస్తుందో ఇంకో అరగంట తర్వాతగాని అర్థం కాలేదు. వచ్చినవన్నీ పోయి ఇంకో వెయ్యి రూపాయల నష్టం. రౌండ్ అయ్యాక లేచాడు. బయటికి వచ్చాడు. శరీరం వెచ్చగా ఉందనిపించింది. ఆట పోయేకొద్దీ ఎందుకంత పట్టుదల వచ్చిందో అర్థం కాలేదు. ఎనిమిది వేలు కాక ఇంకో వెయ్యి పోయిన భావన కలిగింది.

చాలా బాధనిపించింది.

మొన్న వచ్చిననాటి సంతోషం గుర్తు రాలేదు. ఎలా ఇంటికొచ్చాడో తెలియదు. తలుపు తీసి పక్కకు తప్పుకొంది. లుంగీ కట్టుకొచ్చి మంచం మీద పడుకుంటూ దిండు సర్దాడు. ఎందుకో అనుమానం వచ్చి పరుపు పైకెత్తాడు.

అప్పుడు కనిపించిందా ఉత్తరం...

ఎంతో ఆరాటంగా తెరిచాడు...

అందులో ఇంకే విషయాలూ లేవు...

"డాడీనీ, నిన్నూ చూడాలనిపిస్తోంది''

ఒకే మాట...

రెక్కలుంటే అలా ఎగిరిపోయి ఊటీలో వాలాలనిపించింది. అంతలోనే అనుకున్నాడు.

"నాన్నా, నీ ఉత్తరంలో చాలా చాలా విషయాలుంటాయనుకున్నాను. మరీ ఇంత క్లుప్తంగా రాస్తావని అనుకోలేదు''

వసుంధర రవీంద్రకేసి చూసింది.

"భోజనం మీద కోపపడాల్సిన అవసరం




లేదేమో'' అంది.

రవీంద్ర మాట్లాడకుండా డైనింగ్ టేబుల్ దగ్గరకి నడిచాడు.

★ ★ ★

"ఓసారి ఇంటికి వెళ్లి చూసి రండి. ఇల్లు జాగ్రత్తగా చూసుకుంటున్నారో లేదో తెలియాలిగా'' అంది వసుంధర.

సూర్యం రవీంద్ర ఇంటికి వచ్చి తీసుకు వెళ్తానని ఫోన్ చేశాడు. ఇంకో అరగంటలో హైదరాబాద్ ప్రయాణం ఉంది. బయలుదేరే సమయానికి ఎప్పుడు వెళ్లి చూద్దామా అనిపించింది. మాధవరావుగారూ, యాదగిరీ, ఇతర మిత్రులు గుర్తొచ్చారు. ఓసారి ఆఫీస్‌కు వెళ్లి చూసుకోవాలనిపించింది. ఇదివరకటి టైమింగ్స్, ఆ పనిలోని కష్టసుఖాలు గుర్తుకు వచ్చాయి.

"అసలా ఇంటిని అమ్మేస్తే ఎలా ఉంటుంది?" అంది వసుంధర.

"లోన్ మీదుందిగా''

"అది క్లియర్ చేద్దాం. దాని గురించి కాదు మాట్లాడేది. ఇంక హైదరాబాద్‌లో మనకు ఆ ఫ్లాట్ ఎందుకంటారు?"

"ఏమో... రెండు సంవత్సరాలు పోయాక వెనక్కి వెళ్దామనిపిస్తుందేమో''

"అంతగా అయితే రెంట్‌కుంటాం. నాకెందుకో అది డెడ్ కాపిటల్ అనిపిస్తోంది. మనకు అద్దె ఎంత వస్తుందో చూడండి. మనం తీసుకున్న నాటికీ ఇప్పటికీ చాలా మార్పు వచ్చింది. కనీసం లక్షన్నర పెరిగుంటుంది. ఆ డబ్బుతో లోన్ ఎమౌంట్ క్లియర్ చేయవచ్చు. మిగతాది మనం ఇన్వెస్ట్ చేయవచ్చు''

"షేర్లమీదా?"

"మాట్లాడితే షేర్లు షేర్లు అనకండి. మీ చేపలకంటే షేర్లు తక్కువేం కాదు. మీరు సంవత్సరంలో సంపాదించే డబ్బు మేం మూడు నెలల్లో సంపాదిస్తాం"

"మునిగిపోతేనో'

"చేపల్లో ఆ రిస్క్ లేదా! అసలు రిస్క్ లేని వ్యాపారం ఎక్కడుంటుందో చెప్పండి. అందుకని నేను చెప్పిన విషయం ఆలోచించండి''

"మాధవరావుగారేమంటారో'

"ఆయనేమంటారో కాదు. మీరేమంటారో చెప్పండి. నిర్ణయం తీసుకోవలసింది మనం" అంది చిరాగ్గా.

"అది కరెక్టే. మనం ఆయన సలహాలు తీసుకుంటుంటాం కదా!"

"ఆయన అనవసరం అంటాడు. మానుకుందామా?"



"అది కాదు... కొన్ని స్థిరాస్తుల్ని కాపిటల్ కింద చూడకూడదు. అసలు మనిషి గోలంతా ఇంటికోసం అయితే, ఉన్న దాన్ని అమ్మమంటున్నావ్'

"నేను చెప్పేది మీకు అర్థం కాలేదు లెండి''

"అర్థం అయిందిలే వసుంధరా... డబ్బుకి

ఓవోపిమ్ ఇంజక్షన్ ఇయ్యమంటావ్''

"అదేమిటి?" అంది.

"ఆ ఇంజక్షన్ ఇస్తే ఇంక చేపలో మిగిలే దంటూ ఉండదు. అన్నీ గుడ్లే... అట్లాగే డబ్బుని ఎన్ని రకాలుగా లాభం వచ్చేలా చేయవచ్చో నువ్వు ఆలోచిస్తున్నావు. నేను ఆలోచించేది ఇంకోరకంగా ఉంది. అంతే''

"నేను సూటిగా ఓ మాట అడగనా''

"అడుగు'' అన్నాడు.

"మనం ఉన్న ఉద్యోగం నుండి ఎందుకొచ్చాం ఇక్కడికి''

రవీంద్ర ఏదో అనబోయి ఊరుకున్నాడు.

"డబ్బు సంపాదించడానికి. అందులో తప్పేం ఉందో నాకు తెలియదు. రెండోది నా డ్రీమ్స్‌లా ఇప్పుడున్న ఇల్లు లేదు. కడితే అలాంటిది కట్టుకుందాం. రెండు సంవత్సరాల తర్వాత తిరిగి హైదరాబాద్ వెళ్లాలే అనుకుందాం. అప్పుడు ఇంకో ప్లాట్ కొనుక్కుంటాం. టెన్ పర్సెంట్ మహా అయితే ట్వంటీ పర్సెంట్ పెరుగుతుంది. ఆ లాభం మనం ఈలోగా సంపాదించగలం"

కారు హారన్ వినిపించింది.

"వచ్చేశారు'' అన్నాడు రవీంద్ర.

"నేను చెప్పింది ఆలోచించండి''

"చూద్దాంలే' అని సూట్‌కేసు తీసుకొని బయలుదేరాడు.

సూర్యం చెప్పినట్లు హంగామాతోనే ఉంది వ్యవహారం. ఇంకా ఇద్దరు వస్తున్నారు. వారి వయసు కూడా ఏభై దాటుతుంది. కారు మెత్తగా సాగుతుంటే వివిధ విషయాలమీద మాట్లాడుకుంటున్నారు.

"అది కాదు బావా. నారాయణ మావయ్య ఆస్పత్రిలో నెలరోజులుండిపోలా. ఓ ఏభైకి బిల్లు చేశాడు. ఇంకా నువ్వే మిగిలిపోయావు''




"మన ఆరోగ్యానికేంటిరా బాబూ... ఉక్కులాంటిది''

"ఉక్కయితే మనిషికి రోగాలు రావంటావా ఏమిటి?"

"వస్తే గిస్తే మనకొకటేరా. గుండెపోటే''

"అయితే లక్షకి బిల్లు పెడతావ్''

"అపోలో అయితే అంతవుతుంది. బైపాస్‌కి అక్కడిదాకా ఎందుకు... హైదరాబాద్‌లో చాలు''

"చాల్లే ఊరుకోండి. ఎప్పుడూ రోగాల గురించేనా మాట్లాడేది'' అన్నాడు సూర్యం.

"మరేం మాట్లాడమంటావు... వయసయిపోయిందిగా. ఇంక వచ్చేది రోగాలే మరి''

"దేశంలోకి కొత్త కొత్త రోగాలొస్తున్నాయి. మీ చేపలకి ఏం రోగాలొస్తన్నయో మీకు తెలుస్తుందా. అది సరేగాని సూర్యమా... మన కుమారంగాడు లేడూ ఆడి చెరువులో చేపలు పుటుక్కున చచ్చూరుకున్నాయి. ఎందుకు పోయినయ్యో తెలవక ఆడు తల బద్దలు కొట్టుకుంటున్నాడు''

రవీంద్ర ఆసక్తిగా ముందుకు వంగాడు.

"డాక్టర్‌కి చూపించలేదా?"

"ఏదో చేస్తున్నాడులే' అన్నాడు.

"ఎందుకలా జరిగిందంటారు?" అన్నాడు రవీంద్ర.

వాళ్ళిద్దరూ తిరిగి రాజకీయాలు మాట్లాడుకుంటుంటే సూర్యం చెప్పాడు.

"రకరకాల కారణాలు. ఎరువులు మరీ ఎక్కువగా వాడినా డేంజరే. ఒక్కోసారి గ్యాస్‌ఫామ్ అవుతుంది. దాంతో అడుగుభాగంనుండి బుడగలు పైకొస్తుంటాయి. అప్పుడు వెంటనే చేపలు పట్టేయాలి. లేకపోతే ఏముంది. నాశనం. మొత్తం సంవత్సరం ఖర్చులూ, శ్రమా దండగ. మామూలు రైతయితే చేతులెత్తెయ్యటమే''

"చేతులెత్తటమేంటబ్బాయ్. మొన్న నాకెవరో చెప్పారు. ఆళ్ళ ఊర్లో అప్పులయిపోయి మందు తాగి పోయాడంట. ఇంతకుముందు

ప్రత్తిరైతులు ఇట్టాగే చచ్చిపోయారు. మరి రేపు చేపల రైతులూ అంతేనేమో'' అన్నాడా యన.

రవీంద్రా, సూర్యం ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

ఆ ముసలాయన ఆపటంలేదు.

"అది కాదుగానబ్బాయ్... రొయ్యల చెరువయితే రెండు సంవత్సరాలు చాలంటున్నారు. ఈ చేపలది బాగా లేటు''

"మంత్రాలొస్తే చిటికెలో అయిపోద్దిగా. అయినా ఇప్పుడే ఎవడో పోయాడని చెప్పావ్. ఇంతలోనే రొయ్యల చెరువంటావు. ఇవింకా నయం. అదయితే ఇంకొంచెం తొందరగా పోవచ్చు'' అన్నాడు సూర్యం.

రవీంద్రకెందుకో ఆ 'చావు' అనేమాట నచ్చలేదు. బయలుదేరేముందు వసుంధర మాటల్లోగాని, రోజువారీ జీవితంలోగాని మాటలు ఆనందం ఇవ్వటం మానేశాయి అనిపించింది.

ఏ సంభాషణ చూసినా అందులో అందమైనదేమీ ఉండదు. భార్యతో మాట్లాడినా, అపరిచితుడితో మాట్లాడినా, స్నేహితుల్తో మాట్లాడుతున్నా ఏదో వెలితి. మాటలు తప్పనిసరి అవసరం. లేకపోతే ఈ ప్రపంచం ముందుకుపోదు. మరెందుకని ఇంత అనుభూతి రాహిత్యమో అర్థం కాదు. అంతా రొటీన్. అంతా అవసరాలు. ఏ విషయం తీసుకున్నా అంతకుమించి ఎదగకపోవడం.

గతంలో ఇలా లేదు... మాధవరావుగారు గానీ, మరొకరుగానీ ఆకర్షణీయంగా మాట్లాడరుగానీ ఎంతో కొంత జీవం ఉన్నట్లనిపించేది. మరీ ఈ నడుమ ఆ వెలితి ఎక్కువైంది. అందుకు కారణం ఏమిటి?

సీటు వెనక్కి జారిపోయి అన్వేషణ ఆరంభించాడు. అతని ఆలోచనల్లోకి మెల్లగా సంకేత్ వచ్చి ఆగాడు. ఏదో రహస్యం తెలిసినంత సంతోషం కలిగింది. ఇంటి దగ్గర తనతో మాట్లాడుతుంటే, తన పక్కన పడుకుంటే, తన కోపం, తన అల్లరి, తన సంతోషం... ఇవన్నీ తమందరివీ అనిపించేవి.

ఇప్పుడలాంటి సహజమైనదేదీ లేదు.

సంకేత్ ఏడుపు వాడిదే. నిద్రరాక అమ్మా అని పిలిచినా వినిపించదు. పక్కపక్కనే ఉండి కూడా తామిద్దరూ ఎంతో దూరమవుతున్న భావం పెరుగుతోంది.

"ఏమిటాలోచిస్తున్నారు'' అన్నాడు సూర్యం.

"మా బాబు గుర్తొచ్చాడు''

"అదృష్టవంతుడు''

"ఏం అదృష్టంలెండి. వాడు లేని ప్రపంచం డొల్లగా ఉంది''

"తప్పదులెండి. అయినా మీరు ఒక్కడితో సరిపెట్టుకున్నారయ్యే. ఇంకొకరు ఉండటం అవసరం" అన్నాడు సూర్యం.

కారు ముందుకెళ్తూనే ఉంది. చల్లటిగాలికి నిద్రలోకి జారిపోయాడు రవీంద్ర. హైదరాబాద్ చేరుకున్నాక హెూటల్లో మూడు గదులు తీసుకున్నారు.

రవీంద్ర ముందుగా ఆఫీస్కి ఫోన్ చేశాడు. మాధవరావుగారు లైన్లోకొచ్చారు.

"నేను రవీంద్రని''

"ఎక్కడినుంచి మాట్లాడుతున్నారు?"

"భాగ్యనగరంనుంచే''

"అదేమిటి... ముందుగా చెప్పాపెట్టకుండా రావటం? ఎక్కడనుండి?"

"నేను హెూటల్నుండి మాట్లాడుతున్నా. ఫ్రెండ్తో వచ్చాను. ఇక్కడ పనయ్యాక ఆఫీస్కొచ్చి కలుస్తాను''

"తప్పకుండా రండి''

స్నానపానాదులు పూర్తయ్యాయి. అందరూ కలిసి హాస్పిటల్కు వెళ్ళారు. అదేదో పిక్నిక్ స్పాట్లా ఉంది. ముసలిజనం పంచెలు కట్టి, ధగధగ మెరిసే చొక్కాల్తో నడు

స్తుంటే చూడముచ్చటగా ఉంది. ఈయనకి బిల్లు తక్కువగా వేస్తే బాధపడిపోతాడన్నట్లు గా ఉంది.

ఎవరి ముఖాల్లోనూ బాధ కనిపించటంలేదు.

పెళ్ళి సంబంధం మాట్లాడటానికి వెళ్తున్నట్లుగా ఉంది. గుంపులు గుంపులుగా జనం.

"దేశంలో ఇన్ని రోగాలున్నాయా?" అనిపించింది.

అంతలోనే ఇంకో ఆలోచన వచ్చింది.

ఈ హాస్పిటల్స్ ఆలోచన ఎవరిదోగాని చాలా గొప్పది అనుకున్నాడు. ఎందుకో అది హాస్పిటల్‌లా అనిపించలేదు. ఏభైఎకరాల చేపల చెరువులా కనిపించింది.

జనమంతా అందులోని చేపల్లా అనిపించారు.

చేపల పెంపకంలోని క్రమమంతా ఈ హాస్పిటల్ నిర్మాణంలోనూ, నిర్వహణలోనూ కనిపించింది.

"ఆహా! ఎంత గొప్ప మేధస్సు. టెక్నిక్ పేరుతో భారతప్రజల సంపాదనని ఎంత బాగా కొల్లగొట్టే ఏర్పాట్లు జరిగిపోయాయి. ఈ దేశంలో డబ్బులు దండుకునే రంగం ఇంతకంటే ఎక్కడ దొరుకుతుంది. చేపలో, రొయ్యలో కొన్ని సంవత్సరాల తర్వాత మెల్లగా కనుమరుగైనా ఆశ్చర్యం లేదు. కానీ ఈ రోగాలు మాయం అవుతాయా?"

రవీంద్ర ఆలోచనల్లోనే కాలం గడిపాడు. ఆ కార్యక్రమం పూర్తయ్యాక ఆఫీస్‌కి వెళ్దాం అనుకున్నాడేగాని సూర్యం పడనీయలేదు.

"ఉండు మిత్రమా మనమో ప్రొడ్యూసర్‌ని కలుద్దాం" అన్నాడు.

"ఏ ప్రొడ్యూసర్?"

"ఇంకెవరు? సినిమా నిర్మాతనే"

"ఎవరండి బాబూ... పేరేంటి?"

"గోపాల్ అని మా చుట్టం. ఈ నడుమ ఆ




పనిమీద తిరుగుతున్నాడు"

"ఇంతకుముందు ఏం చేశాడు?"

"ఇంతకుముందూ, ఇప్పుడూ చేపల చెరువులే. మనాడికి కొంచెం సినిమాపిచ్చి. సినిమా తారలన్నా కూడా. బాగా సంపాదించాడు. ఆ డబ్బులు ఏం చేయాలో అర్థంకాక ఇలా హైదరాబాదూ, మద్రాసూ తిరుగుతుంటాడు"

"ఇంతకూ ఆయన ఇక్కడే ఉన్నాడా?"

"ఉన్నాడండి బాబూ. సాయంకాలం సిటింగ్ ఉంది అన్నాడు. అంటే స్టోరీ డిస్కషన్ అన్నమాట. అదేం కుదరదు. మాతో సిటింగ్ ఉందని చెప్పా. ఇంక ఎక్కడికీ కదిలేపనిలేదు. మనం అటు పోవాలి"

"ఎక్కడుంటాడు?"

"బంజారాహిల్స్‌లో"

"స్వంతమేనా?"

"లేదు. అద్దెకి తీసుకున్నాడు"

★ ★ ★

అదేదో రాజభవనంలోకి అడుగుపెట్టినట్లుంది. గోపాల్ ఆ ఇల్లు మొత్తం దగ్గరుండి చూపించాడు.

"ఏంలేదు బాసూ- రూపాయలు ఈ కొండ మీద పరిచేశాడు. అందులోనూ గురుడు ఈ దేశంలో కాదు ఉండేది. అమెరికా. మీరెప్పుడైనా ఓపెన్‌కాస్ట్ బొగ్గుగనులు చూశారా?" అనడిగాడు రవీంద్రని. లేదన్నట్లుగా తలూపాడు.

మామూలుగా అయితే బావుల్లో దిగి బొగ్గు తవ్వుతుంటారు. ఓపెన్‌గా ఉంటుంది. తవ్వటం పోయటం. ఎవడి ఓపిక వాడిది. ఆ రకంగా అక్కడ తవ్వి కన్వేయర్ బెల్ట్‌మీద ఇండియా పంపించి ఇక్కడ గట్టేశాడు. ఆ షాండిలియర్ చూడండి. ఎంతవుతుందంటారు... అటు చూడండి. ఒక్కో గదికి ఎంత ఖర్చవుతుందో చూసుకోండి. ఇంతచేసి వాడిక్కడుంటాడా... ఉండడు. మనమెటూ సినిమా అనుకుంటున్నాంకదా. షూటింగ్‌కి పనికొస్తుందికదాని తీసుకున్నా"

"రెంట్ ఎక్కువేమో"

"విడిగా అయితే ఎక్కువే. షూటింగ్ పర్పస్‌కయితే బాగానే ఉంటుంది. కానీండి. మనం ఇట్లాంటివి కట్టలేకపోయినా కనీసం ఇందులో ఆనందంగా ఉండొచ్చుకదా"

"నీకేంటిరా... నువ్వు తలుచుకుంటే ఇలాంటిదో లెక్కా?"

"మన ధీరి వేరు సూర్యం. కొంపమీద ఇంత ఖర్చుపెట్టం. అయినా నువ్వు ఇల్లు కట్టావ్. ఇక్కడినుండి చూడు. చుట్టూ గోడ. మధ్యలో అంతా ఖాళీ ప్రదేశం. లోపలికి ఎవడూ రాడు. రావాలని నువ్వు కోరుకోవు. వచ్చి చూస్తే ఎక్కడ అసూయపడి పోతారో అని నీ భయం. మరి ఇన్ని లక్షలు తగలేసి నీ వైభవాలని నువ్వు దొంగనతంగా దాచుకో వాలి. మన లైన్ అది కాదు. ఎంజాయ్‌ది లైఫ్. నోట్ సూర్యం వైఫ్ కాదు లైఫ్. ఉమెన్ మీద ఖర్చుపెట్టు. వైన్‌మీద ఖర్చుపెట్టు. ఎక్స్‌పోజ్ కావటం కోసం ఖర్చుపెట్టు. ఈ మూడూ మిళితమైన రంగం ఇదొక్కటే. అసలు మనమింకా సినిమా ఎనౌన్స్ చేయలే దు. ఎంత గ్లామరనుకున్నావ్. అందమైన అమ్మాయిలే నాకో పాత్ర కావాలి. నాకో పాత్ర కావాలి అంటూ తయార్. ముందు నాకు కాల్షీట్స్ రానీ"

"ఎవరితో అనుకుంటున్నారండి" అన్నా డు రవీంద్ర.

"ఒకరని కాదు. టాప్ ఫైవ్‌లో ఎవరు ఓ.కే. అంటే వాళ్ళతో. ట్రై చేస్తున్నాం. అవుతుందనుకుంటున్నాను. హీరోయిన్‌ని తర్వాత బాంబేనుండి పిలిపిద్దాం" అన్నాడు.

"కమాన్... మనం నా గదిలో కూర్చుందాం"

తిరిగి అది ఇంకో ప్రపంచం. మధుబాల ఫొటోలు ఆ గదినిండా వివిధ భంగిమల్లో అలంకరించివున్నాయి.

"నేను మధుబాల ఫ్యాన్‌ని. నా దురదృ ష్టం ఆమె బతికిన రోజుల్లో పసివాడిగా ఉండటం. ఆమెకు చెంది నా దగ్గర చాలా ఆల్బమ్స్ ఉన్నాయి. వాట్ ఎ వండర్‌ఫుల్ లేడీ షీ ఈజ్" అన్నాడు గోపాల్ తన్మయత్వంతో.

"అవును" అన్నాడు సూర్యం.

రవీంద్ర ఆమె గురించి విన్నాడుగానీ ఇంత ప్రత్యేకంగా ఎప్పుడూ చూడలేదు. ఆ చిత్రాలు చూస్తుంటే మతిపోయినంతపన యింది.

"అబ్బో... మహానుభావురాలు. రవీంద్రగా రూ ఇప్పటివాళ్ళంతా రంగుల బొమ్మలు. చేయి జారితే పగిలేగాజుముక్కలు. మధు లాంటివాళ్లు శతాబ్దానికో, అరశతాబ్దానికో పుట్టి, ఇలా లక్షలాదిమంది గుండెలు పిండేసి వెళ్ళిపోతారు. నిజంగా అలాంటివాళ్ళ వయ సు ఓ థర్టీఫైవ్‌లోనో, మరో సంవత్సరంలోనో ఆగిపోతే బాగుండను. ప్రతి తరంవారూ ఆ అందాన్ని చూసి తరిస్తారు"

"గోపాలూ... చచ్చిపోయిన కళాకారిణి గురించి ఎందుకురా?"

"మరేంటో చెప్పు"

"ఏంటి కబుర్లేనా?"

"అది కాదురా. నువ్వు హైదరాబాద్ వచ్చింది నీ భార్యకి ఆపరేషన్ కోసమా లేకపోతే..." అన్నాడు రవీంద్రని చూస్తూ

"ఎవరి ఆనందం వాళ్ళది బాబూ"

"అంటే ఆవిడకి ఆపరేషన్ చేయించుకో వటం ఆనందమా?"

"అంత పెద్ద పేరెందుకు లేరా? ఆ ఆపరే షన్ మా దగ్గర గంటలో అయిపోతుంది. మరి ఇక్కడ ఎందుకన్నామనుకో. నామీద ప్రేమలే దూ... ఇష్టం లేదూ అంటూ గోల. కానీ... ఎన్ని ఖర్చు కావటంలా... అందులో ఇదొకటి అనుకున్నాం. తీసుకొచ్చాం. అంతే"

"అది సరే. ఇంతకూ రవీంద్రగారు..."

"మరెందుకనుకున్నా. ఆయనకు వేరే ప్రో గ్రాం ఉంది. లాక్కొచ్చా"

రవీంద్రకు వారి సంభాషణ పూర్తిగా అర్థం

కావటంలేదు.

గోపాల్ ఫోన్ అందుకున్నాడు. ఏవో నెంబర్లు డయల్ చేశాడు.

"నేను గోపాల్‌ని" అన్నాడు.

"అవును. ఫ్రెండ్స్ వచ్చారు. కారు పంపించమంటావా... నువ్వే నీ కారులో వస్తావా... గుడ్... తనని కూడా తీసుకురాకూడదూ... ఆc... ట్రై చెయ్యి. అలాగే"

సర్వెంట్‌ని పిలిచి చెప్పాడు. అన్ని ఏర్పాట్లు జరుగుతున్నాయి.

"సూర్యం... డిషెస్ ఏం కావాలో చెప్పు. బంజారానుండా? ఇంకెక్కడైనా"

వద్దు బాబూ నాకయితే ఊరు చివరి దాబాలో ఐటమ్స్ బాగుంటాయి. ఖరీదైనవి కాదు. రుచికరమైనవి కావాలి.

"ఇంక ఆ విషయం గురించి నాకు వదిలేయ్" అని డ్రైవర్‌కి ఏమేం తేవాలో వివరంగా చెప్పాడు.

"త్వరగా రావాలి. ఎక్కువ డీల్ చేయకు. ఈరోజు నువ్వు త్వరగా వెళ్ళిపోదువుగాని"

"యస్ సర్" అనేసి వెళ్ళిపోయాడు.

సర్వెంట్ గ్లాసుల్లో డ్రింక్ సర్వ్ చేశాడు. డబల్‌డోర్ రిఫ్రిజరేటర్‌లో అన్నిరకాల సాఫ్ట్ అండ్ హాట్ డ్రింక్స్ ఉన్నాయి. ఇంక ప్రత్యేకంగా వేయించిన జీడిపప్పు, చిప్స్ ఉంచాడు.

"కమాన్" అన్నాడు.

ముగ్గురూ గ్లాసులు సున్నితంగా టచ్‌చేసి "ఛీర్స్" చెప్పుకున్నారు. గోపాల్ సిగరెట్ వెలిగించాడు.

"చిన్నప్పుడు ఈ రంగం అంటే పెద్ద క్రేజ్. ఇప్పుడు లోపలకొచ్చి చూస్తున్నాకదా చాలా నవ్వు కూడా వస్తుంటుంది. చాలా కొద్దిమంది తప్పితే ఇంత సంపాదిస్తున్నా డబ్బు విషయంలో పిసినారితనంతో ఉంటారు. ఓ బిగ్‌హీరో ఉన్నాడు. తను ఎంత క్యాలుక్యులేటెడ్ అంటే మన కోస్తా ఏరియాలో ఆక్వా కల్చర్ ఎంతుంది... ఫిష్ టాంక్స్ ఎన్నున్నాయి అనేది... వాళ్ళ ఆదాయాలు టకటక చెప్పేస్తాడు. మనం అక్కడ సంపాదించటం ఇక్కడ వీళ్ళ చేతుల్లో పోయటం... ఎవడు అదృష్టవంతుడంటావ్. పైగా వాళ్ళేమంటారో తెలుసా? మీరు అనుభవించినట్లు మేమెక్కడ అనుభవిస్తాం సార్. మా జీవితం అంతా ఫ్లడ్‌లైట్ల నడుమ గడచిపోతుంది అని... బహూశా అదీ నిజమే కావచ్చు. మనకున్న స్వేచ్ఛ వారికెక్కడుంది?"

"అవును..." అన్నాడు జీడిపప్పు నోట్లో పెట్టుకుంటూ సూర్యం.

రవీంద్ర ఎందుకో పక్కకు తిరిగాడు, మెరుపు మెరిసినట్లయింది.

ఓ అప్సరస నడిచివస్తోంది. ఆ దిగ్భ్రాంతి నుండి కోలుకోకముందే... వెనకనుండి ఇంకో సుందరి. తను ధవళ వస్త్రాలు ధరించింది.

"ఓ... నీరూ... వెలకమ్" అన్నాడు గోపాల్.

లైట్ రెడ్‌కలర్ చీరలో ఉన్న నీరూ అతని పక్కన కూర్చుంది. ధవళవస్త్రాల సుందరి రవీంద్ర చెంతన కూర్చుంది. వారి రాకతో మల్లెపూలూ, విదేశీ సెంటూ కలిసిన వాసన గుప్పుమందా గదిలో.

"కమాన్ డ్రింక్ తీసుకోండి"

"నో బాబా..."

"అయితే జిన్ తీసుకోండి"

"లేదు. కంపెనీ కోసం ఏపిల్ జ్యూస్ తీసుకుంటాం" అంటూనే లేచి ఫ్రిజ్‌నుండి తెచ్చింది. ఆమె నడుస్తుంటే గుడ్లప్పగించి చూస్తుండిపోయాడు రవీంద్ర. ఆమె తిరిగిరాగానే...

"మీకు పరిచయం చేయాలికదూ. వీడు సూర్యం. నాకు బ్రదర్ అవుతాడు. ఆయన రవీంద్ర. ఇంక ఈమె నీరజ..."

"హలో" అంటూ చేయి అందించింది సూర్యానికి.




"ఆమె పూజ"

చిరునవ్వుతో చేయిసాచింది పూజ. ఆమె చేతివేళ్లు తగిలి నరాలు జివ్వుమన్నాయి. శరీరమంతా ప్రకంపనలు. అసలు ఇదంతా కలా. నిజమా. తను ఎక్కడున్నాడు? ఏమీ అర్థం కావటం లేదు.

వారిద్దరూ ఏపిల్ జ్యూస్ తీసుకుంటున్నారు. మరికొద్దిసేపటి తర్వాత డ్రైవర్ పాకెట్లతో వచ్చాడు. గోపాల్ అతనికి ఏదో చెప్పి పంపించాడు.

"మీరేం చేస్తుంటారు'' అంది పూజ.

"ఫిష్ టాంక్స్ ఉన్నాయి'' అన్నాడు రవీంద్ర.

"మీకూనా'' అంది నీరజ.

"అవును'' అన్నాడు సూర్యం.

"తిరిగివచ్చి కూర్చున్నాక... ఫోన్ అని తెచ్చాడు సర్వెంట్.

"నేను గోపాల్ని'' అన్నాడు.

"అవును. నాకు రెలిటివ్స్ వచ్చారు. కుదరదు. ఇప్పుడే కూర్చున్నాం. ఆc అది కాదు... జస్టె మినిట్... సూర్యం.. నన్ను అర్జెంటుగా మాట్లాడాలి రమ్మని పిలుపు. కాదూ కూడదు, కనీసం ఓ గంటయినా రావాలంటున్నారు''

"ఎవరు?"

"టాప్ ఫైవ్‌లో ఒకరు''

"తప్పనిసరైతే చేసేదేముంది''

"ఆల్‌రైట్ నేను బయలుదేరుతున్నా'' ఫోన్ అందించాడు సర్వెంట్‌కి.

నీరజని పక్కకు తీసుకెళ్ళి ఏదో చెప్పాడు. ఆమె నవ్వుతూ తల ఊపింది.

సూర్యాన్ని పిలిచాడు. నీరజ వచ్చేసింది వెనక్కి.

"ఎవర్రా సినిమా తారలా?"

"ఛ... ఛ...వారి దగ్గరేముంటుంది. కాల్‌గర్ల్స్. చాలా హుందాగా ఉంటుంది వ్యవహారం. ఎవరికి బడితే వారికి రారు. గంట అన్నారుగానీ ఎంతసేపవుతుందో తెలియదు. మీరు ఎంజాయ్ చెయ్యండి. నేను త్వరగా రావటానికి ప్రయత్నం చేస్తా. భోజనం చేసెయ్యండి. తను కొత్తకదా. నువ్వే చూసుకో నేను ఎప్పుడో వస్తాను''

"అలాగే''

"రవీంద్రగారూ నేను వస్తాను''

మంత్రింపబడినవాడిలా తలూపాడు. గోపాల్ స్వయంగా కారు నడుపుకుంటూ వెళ్ళిపోయాడు. సూర్యం రవీంద్రని పక్కకు తీసుకెళ్లాడు.

"నీకు పూజ నచ్చిందా?"

"అంటే..." నసిగాడు.

"గోపాల్ మనకోసమే పిలిచాడు''

"వీళ్ళు''

కాల్‌గర్ల్స్. వీళ్ళకి కార్లూ. భవనాలుంటాయి. పెద్ద పెద్ద బిగ్‌షాట్స్ వీళ్ళకోసం ఫోన్‌చేసి పిలిపించుకుంటారు.

రవీంద్ర కళ్ళు పెద్దవయ్యాయి.

"మనం భోంచేశాక మన గదుల్లోకి వెళ్దాం. ఈ రాత్రికి వాళ్ళుంటారు'' అందరూ కలిసి భోంచేశారు. తర్వాత పూజతో కలిసి ఆ గదిలోకి అడుగుపెట్టాడు. సూర్యానికి ఇన్ని పరిచయాలున్నాయని తెలియదు. అసలు ఇదంతా కలలా ఉంది. ఇదేకాదు శ్యామ్ అనే మాంత్రికుడు ఫోన్‌లో పిలిచిన నాటినుండి దీర్ఘంగా నడుస్తున్న కలే అనిపించింది.

కళ్ళు తెరిస్తే ఆ స్వప్నం బ్రద్దలయిపోతుందేమోనన్నంత భయం కలిగింది. ఆ మంచమూ, దానిమీద పరుపులూ అతి అందంగా, సుతి మెత్తగా ఉన్నాయి. ఆమెను తాకాలంటే ఎందుకో భయంగా ఉంది.

"మీరేదో అనీజీగా ఉన్నారే' అని నుదుటిమీద చెయ్యి వేసింది. ఇంక నిగ్రహించుకోవటం సాధ్యంకాలేదు. అమాంతం కౌగిలించుకున్నాడు.

"అంత తొందరెందుకు'' అంది నవ్వు

తూ.

రాత్రి ఎలా కరిగిపోయిందో తెలియదు. రవీంద్ర ఆమె నెంబర్ నోట్ చేసుకున్నాడు.

"ఈ అనుభవాన్ని నేను మరిచిపోలేను" అని చెప్పాడు.

ఆమె నవ్వింది.

"పూజా...నువ్వు సరేనంటే నేను నిన్ను నాకోసం ఉంచుకుంటా"

"వద్దు రవీంద్రా...నన్ను భరించలేరు"

"అంటే" అన్నాడు ముఖం వివర్ణమవుతుండగా.

"ఇంకోరకంగా అనుకోకండి. అయినా మీరు ఎప్పుడు పిలిచినా నేను వస్తాను"

"అంతేకాదు. నువ్వు నా కోసం మాత్రమే కావాలి"

"చూశారా... మనిషి స్వార్థం. ఇంతకు ముందు మీరెవరో నాకు తెలియదు: నేనెవరో మీకు తెలియదు. అదేరకంగా గోపాల్ అనుకుంటే మన పరిచయం అయ్యేది కాదు. ఈ ప్రపంచంలో ఏదీ ఎవరి స్వంతం కాకపోతేనే మంచిది" అంది పూజ.

"నా గురించి ఏమనుకుంటున్నావో నాకు తెలియదు. పూజా నేను ఉమనైజర్‌ని కాదు. నీలాంటి అపురూప సుందరికోసం వెతుక్కుంటున్నాను"

"కానీ... మీకు వివాహం అయింది"

"అందుకే... నాకు నువ్వు కావాలి. నా కోసం నువ్వు రాలేవా?"

"మీ భార్యను వదిలి వస్తారా?"

"నీకు తెలుసు. ఆ బంధం చుట్టూ చాలా బాధ్యతలున్నాయి. ఇంకేవో ఉన్నాయి. అవి తెంచుకోవటం సాధ్యం కాదు"

"నేనూ అదే చెబుతున్నాను. మాకూ అంతే. కొన్ని విషయాలు మరిచిపోవటం నేర్చుకోవాలి. లేకపోతే అనవసరంగా బాధలు మిగులుతాయి. ఇదో అనుభవం. అంతే. మీరెప్పుడైనా హైదరాబాద్ వస్తే రండి. మోస్ట్ వెల్‌కమ్. ఓ ఫ్రెండ్‌గా ఈవెనింగ్స్ ఎంజాయ్ చేద్దాం. నా సలహా ఏమిటంటే శాశ్వత బంధాలు పెంచుకోవద్దు. ఈరోజు ఉంది ఎంజాయ్ చేయండి. రేపు లేదు. నో రిగ్రెట్స్... మనుషులకి దుఃఖాలు ఉండకూడదు. ఆనందాలే"

రవీంద్ర మాట్లాడలేకపోయాడు కొంచెంసేపు.

"మీరేం చదివారు?"

"అదంత అవసరమా?" అంది నవ్వుతూ... తనే అంది.

"డబ్బు సంపాదించటానికి చదువు అవసరం లేదు. ఒక్కోసారి డబ్బు సంపాదించాలంటే ఈ చదువు తెచ్చే సంస్కారం అడ్డు వస్తుంటుంది. అందుకే డబ్బుయాచ ఉన్న వారి నెవరినీ ఆ ప్రశ్న వేయకండి. మనందరం మామూలు మనుషులం" ఈసారి దిగ్భ్రాంతి చెందాడు.

చరిత్రలో ప్రతి వేశ్యా ఎంత మరుగునపడిపోయినా తాత్వికురాలిగా మాత్రం జీవించి వుంటుంది అనుకున్నాడు.

"ఇది కూడా ఓ మరువలేని అంశం. నన్ను మాత్రం గుర్తుంచుకోండి"

పూజ మనోహరంగా నవ్వింది. ఆ నవ్వు నిండా ఎన్ని అర్థాలున్నాయో అనుకున్నాడు. ఎప్పుడు వచ్చాడో తెలియదు. ఉదయానికల్లా గోపాల్ తయారయిపోయాడు. కలలా ఆ అప్సరసలిద్దరూ మాయం అయిపోయారు.

"గోపాల్‌గారూ మీ ఆతిథ్యం మరువలేనిది"

"థాంక్స్‌టు బొచ్చె రాగండి, శీలావతి" అన్నాడు గోపాల్.

సూర్యం విరగబడి నవ్వాడు.

"అవును బాసూ. అవి కనక లేకపోతే ఏ ఉద్యోగమో, వ్యవసాయమో చేసుకుంటూ..." రవీంద్ర నవ్వాడు.




"రాత్రి పనయిందా?"

"అయింది. వెంటనే కాల్‌షీట్లు ఇస్తానన్నాడు''

"మరి కథో..."

"వారంరోజుల్లో తయారు చేయించాలి. ఆ హీరోకి కథ అవసరంలా. మనకి ఆయన కావాలి. అసలు రాజుగారూ- ఏడు చేపల కథ తీస్తే హిట్ అవదా''

"ఎందుకవదూ... ఆరు చేపలు ఎండవు. ఒకటే ఎండిపోయేది'' అని సూర్యం ఇంకా అన్నాడు.

"కనీసం చేపల చెరువుకుపడే కష్టం. మంచి కథకోసం పడండిరా'' గోపాల్ నవ్వాడు.

★ ★ ★

"ఏంటండి బాబూ. నిన్న వస్తానన్నారు. చాలా సేపు ఎదురు చూశాను. కనీసం ఫోన్ అయినా చేయలేదు. చూసి చూసి ఇంక రారేమోననుకుని వెళ్ళిపోయాను'' అన్నాడు మాధవరావు.

"సారీ మాధవరావుగారూ. అనుకోకుండా వేరేచోటికి వెళ్ళాల్సివచ్చింది. ఫోన్‌చేసి చెప్పాలనుకున్నాను. కానీ వీలు కాలేదు''

"అది సరే ముందు అమ్మాయి, బాబూ ఎలా ఉన్నారు?"

"బాగున్నారు. బాబుని ఊటీలో చేర్పించాం. మీకు రాశారా?"

"లేదండి'' అన్నాడు.

"అక్కడయితే చదువు బాగుంటుంది. మేం వాడి గురించి పట్టించుకోలేకపోతున్నాం. రెండోది మేం ఉండేచోట అంత పెద్ద స్కూల్స్ కావు. ఆ ఊరి వరకు బాగుంటాయి''

"అలాగా. మంచిదేలెండి. పిల్లవాడు ముందు కొంచెం బాధపడినా తర్వాత చదువులో పడిపోతాడు''

"ఇంకా ఏమిటి మాధవరావుగారూ''

"ఏముంది. మీ ఇంటి అద్దెలన్నీ ఇన్‌స్టాల్‌మెంట్ కింద కట్టేస్తున్నాం. ఓసారి వెళ్ళివద్దామా''

"పదండి'' అన్నాడు.

ఇంతవరకూ ఆ ఇంటిలో ఉన్నవారిని చూడనేలేదు.

"మనకు తెలిసినవారే. ఎలాంటి సమస్య ఉండదు. అవసరమైతే వేరే ఇల్లు తీసుకొని వెళ్తారు. అందుకే ఇచ్చాను'' అన్నాడు దారిలో.

ఇంటి దగ్గర ఆమె ఉంది. ఓసారి ఆ గదుల్లోకి తొంగి చూస్తే పాత జ్ఞాపకాలు మనసుని చుట్టుముట్టాయి. ఆమె 'టీ' తయారుచేసి అందించింది. తిరిగి వెనక్కివచ్చారు.

"ఇల్లు చాలా బాగా చూసుకుంటున్నారు'' అన్నాడు సంతృప్తిగా.

"అవును. నాకు బాగా తెలుసు కాబట్టే ఇచ్చాను''

నిజానికి రవీంద్రకి ఆశ్చర్యం కలిగింది. ఇంట్లో ఉంటున్నవారి ఆర్థిక పరిస్థితి ఏమిటో తెలియదుగానీ అభిరుచి మాత్రం విలువ కట్టలేనిది. అంత నీట్‌గా సర్దుకున్నారు. ఒకనాడు తనను నిరాశపరిచిన ఆ ఇంటిలో అంత అందం ఉందని తిరిగి ఈరోజే అర్థం అయింది. తిరిగి తాము ఇక్కడికి వస్తే వారిని పంపించేయాలి. ఎందుకో ఆ ఆలోచన నచ్చలేదు.

"ఇంకా సంగతులు చెప్పండి. మీ వ్యాపారం ఎలా ఉంది?"

"బాగానే ఉందండి. మనం జాగ్రత్తగా చేసుకుంటే ఆదాయం బాగుంటుంది. కాకపోతే ఇదివరకటి జీవితం గుర్తుకు వస్తున్నప్పుడే కొంచెం బాధగా ఉంటుంది. అందులో ఓ ఆనందం ఉంది. ఇప్పుడింకో తరహా''

"నిజమే. డబ్బుని బట్టి మన అవసరాలు మారుతుంటాయి. గడిచిపోయిన రోజులు ఎప్పుడూ బాగానే ఉంటాయి. అయినా

జీవించటం ఓ ఆర్ట్. అది తెలిసినవాడు ఎక్కడున్నా, ఏం చేస్తున్నా అందంగానూ, ఆనందంగానూ ఉంటాడు'' అన్నాడాయన. రవీంద్ర మౌనంగా తలూపాడు.

మాధవరావుగారిలో ఆ కళ ఉందో లేదో తనకు తెలియదు. కానీ ఆయన మాత్రం ఎప్పుడూ పనిలో మునిగిపోయివుంటాడు. బహుశా ఆయన ఆనందం అదే కావచ్చు నేమో.

"అదిసరే మాధవరావుగారూ. ఇక్కడి ఫ్లాట్ అమ్మేస్తే ఎలా ఉంటుందనే ఆలోచన వచ్చింది?"

"అదేమిటి ఇంక అక్కడ సెటిలయిపోయి నట్లేనా?"

"దాదాపుగా అంతే. ఓవేళ వచ్చినా అప్పు డు ఆలోచించుకుందాం అనుకున్నాను''

"అమ్మాలంటే అమ్మేయవచ్చు. దానికి పెద్ద సమస్యేంలేదు. మీరు ఇంకోసారి ఆలో చించుకోండి. ఆ విషయం నాకు రాయండి. అమ్మేద్దాం" అన్నాడాయన.

"అలాగే. నేను మీకు ఫోన్‌చేసి చెబుతాను. మిగతా లోన్ ఎమౌంట్ ఎంతవుతుందో కూడా కనుక్కొని ఉంచండి. అది కూడా క్లియర్ చేసేద్దాం"

"అలాగే చేద్దాం" అన్నాడాయన.

"ఏం సాబ్... బాగున్నారా?" అన్నాడు యాదగిరి వచ్చి.

"బాగానే ఉన్నాను''

"కొంచెం రంగు తగ్గింది సాబ్''

"హైదరాబాద్ నీళ్లు మనకి పడతాయి. అక్కడ నీళ్లు అంతే. రెండోది ఇక్కడంటే ఆఫీసులో కూర్చుని చేసే ఉద్యోగం. అక్క డంతా తిరగటమేగా''

"మీ చేపల చెరువులు చూడాలె సారూ''

"చూద్దురుగాని. నిన్నూ, మాధవరావుగా రినీ తీసుకువెళ్తాను. పిల్లలంతా బాగున్నారు కదా''

"బాగున్నారు సార్''

"మంచిది. నేను బయలుదేరతా'' అన్నా డు.

వచ్చేముందు యాదగిరి జేబులో నాలుగు వందలు కుక్కాడు.

"దేనికి సాబ్ ఇదంతా''

"ఏంలేదులే. పిల్లలకి ఏమైనా కొనివ్వు'' అన్నాడు.

"మరోసారి ఆలోచించుకొని నాకు కబురు చేయండి'' అన్నాడు మాధవరావు.

"అలాగే'' అని సూర్యం దగ్గరికి వెళ్ళాడు.

హాస్పిటల్లో హడావుడిగా ఉంది. హైదరా బాద్‌లోని బంధువులు చూడటానికి వచ్చారు. వారందరి ముఖాలు కళకళలాడుతున్నాయి. వారి మాటల్లో చీరలూ, నగలూ చోటు చేసు కుంటున్నాయి. మగవారు మాత్రం రాజకీ యాల గురించి చర్చించుకుంటున్నారు.

సూర్యం పక్కకి వచ్చాడు.

"ఏమంటున్నారు?"

"అవుతుంది. డేట్ ఫిక్స్ చేస్తున్నారు. నేను కూడా నాలుగురోజులుండి వస్తా. అంత గా అయితే మళ్ళీ హైదరాబాద్ రావచ్చు. అక్కడ పనులు ఎలా సాగుతున్నాయో చూ సుకోవాలిగా. మీరెప్పుడు బయలుదేరుతున్నా రు''

"ఈరోజు''

"అయితే అక్కడ కలుసుకుందాం" అన్నా డు.

రవీంద్ర హాస్పిటల్‌నుండి వచ్చాక పూజ గుర్తుకు వచ్చింది. వెంటనే ఫోన్ చేశాడు. రింగవుతోందిగానీ ఎవరూ తీయటం లేదు. మరి రెండు సార్లు ప్రయత్నం చేశాడు. అదే పరిస్థితి. ఏమైందా అనుకున్నాడు. ఎందుకో ఇంక ఉండాలనిపించలేదు. సరాసరి స్టేషన్‌కి వెళ్ళిపోయాడు.

ఆ సమయంలో ట్రైన్ ఉంది.




వెనక్కి ప్రయాణం ఆరంభం అయింది.

★ ★ ★

"ఏమిటి హైదరాబాద్ విశేషాలు'' అనడిగింది వసుంధర.

"అంతా బాగుంది. ఇల్లు బాగానే చూసుకుంటున్నారు. మాధవరావుగారితో ఇల్లు అమ్మే విషయం గురించి మాట్లాడాను. ఆయన అమ్మమంటే అమ్ముతారు. ముందు నన్ను ఇంకోసారి ఆలోచించుకుని ఫోన్ చేయమని చెప్పారు. అదీ విశేషం"

"సూర్యంగారి మిసెస్ ఆపరేషన్ ఎప్పుడు?"

"ఇంకా రెండు రోజుల్లో చేస్తారేమో''

"ఇంకా విశేషాలేమిటి?"

"విశేషాలు సరే. సంకేత్‌కి ఉత్తరం రాశావా?"

"లేదండి'' అంది.

"అంటే కనీసం ఉత్తరం రాసే తీరిక కూడా లేదా?"

"తీరికని కాదు. మనం ఉత్తరాలు ఎక్కువగా రాస్తుంటే మరీ బెంగపడిపోతాడు''

"రాయకపోయినా ఎదురుచూస్తాడు. అయినా కొంతకాలంపాటు వాడికి ఉత్తరాలు రాయకపోతే ఎలా? అందులోనూ వాడూ మనని చూడాలి అని తప్పించి ఇంకో ముక్క రాయలేదు''

"అవును మరి. అంత గారాబం నేర్పితే ఇలానే అవుతుంది. ఇన్ని చెప్పి పంపించాం. అయినా మామూలే. చక్కగా చదువుకోవటం చేతగాక ఇబ్బందిపడిపోతాడు. ఎప్పుడూ అమ్మా, నాన్న పక్కనుంటే సరిపోతుందేమో'' కోపంగా అంది.

"పోనీలేవోయ్. వాడు చిన్నపిల్లాడు. ఇంతకుముందు ఎక్కడికీ వెళ్ళలేదు. ముందు వాడికో ఉత్తరం రాయి''

"రాస్తాను. ఆ కవర్‌లో మీరూ నాలుగుముక్కలు రాయండి. మళ్ళీ నాన్నగారు ఉత్తరం రాయలేదంటే ఏడుస్తాడు'' అంది వసుంధర.

రవీంద్ర తలూపాడు.

"మీరు మాధవరావుగారికి వెంటనే ఫోన్ చేస్తున్నారా?"

"చేద్దాం"

"ఇంకో పనిచేయండి. ఆయన ఎవరికో చెప్పటం, వారు రావటం ఇదంతా చాలా కాలం పడుతుందేమో. డైలీలో ఓ ఏడ్ ఇస్తే సరిపోతుంది. సిటీ ఎడిషన్‌వరకి చాలు. అంతగా అయితే మాధవరావుగారి ఫోన్ నెంబర్లో సంప్రదించమంటే సరిపోతుంది'' రవీంద్ర అలానే నన్నట్లుగా తలూపాడు.

"ఇంక ఆలస్యం ఎందుకు... ఫోన్ చేయండి''

"చేస్తానుకదా. మరీ అంత హడావిడి. పనులన్నీ క్షణాల్లో జరిగిపోవు. కనీసం ఆలోచించుకోనీయవు. ఇంత క్విక్ డెసిషన్స్ అంత మంచిది కాదు'' కసురుకున్నాడు.

ఆమె ఇంక మాట్లాడలేదు.

రవీంద్ర బయటకు వెళ్ళిపోయాడు. ఓ హోటల్‌లో కూర్చుని మరోసారి ఆలోచించాడు.

ఇల్లు అమ్మటం సరయిందా? కాదా?

వెంటనే నిర్ణయానికి రాలేకపోతున్నాడు. వసుంధర అసహనం చూస్తుంటే మాత్రం తనే మాధవరావుగారికి ఫోన్‌చేసి చెప్పేటట్లుంది. ఏమైతే అయింది. ఇల్లు అమ్మేద్దాం. రాబోయే పరిణామాల గురించి ఇప్పుడు ఆలోచించే అవసరంలేదు అనుకున్నాడు.

ఫోన్‌లో మాధవరావు దొరికాడు.

"నేను రవీంద్రని. ఇల్లు అమ్మేద్దాం అనుకున్నాం. మీరు వెంటనే ఓపని చేయండి. తెలిసినవారుంటే చెప్పండి. ముందయితే లోకల్ ఎడిషన్‌లో ఓ చిన్న ప్రకటన ఇచ్చి మీ నెంబర్ ఇవ్వండి. ధరల గురించి మీకు తెలుసుకదా. మీరు ఫర్వాలేదు. అనుకుంటే నాకు రింగ్ చేయండి. హైదరాబాద్ వచ్చే

స్తా''

"అలాగే'' అన్నాడు మాధవరావు.

పెద్ద భారం తొలగినట్లయింది.

అప్పుడు గుర్తొచ్చింది పూజ వెంటనే రింగ్ చేశాడు. రింగవుతోంది. కొద్దిక్షణాల తర్వాత అవతలినుండి మనోహరంగా వినిపించింది.

"పూజా హియర్''

"నేను రవీంద్రని'' ఎక్సయిటింగ్‌గా అన్నాడు.

"రవీంద్ర... ఓ... మీరా? ఎక్కడనుండి?''

"మా ఊరునుంచే. మొన్న హైదరాబాద్‌లో మీ కోసం ప్రయత్నం చేశాను. ఫోన్ లిఫ్ట్ చేయలేదు''

"నేను లేను. ఏమిటి విశేషం?''

"ఊరికినే మాట్లాడాలనిపించింది. అది సరే. మీరు భాగ్యనగరం తప్పితే ఇంకెక్కడకీ రారా''

"ఎక్కడికి రమ్మంటారు''

"జీవితం బోర్‌గా అనిపించటం లేదా మా ఊరురండి'' అన్నాడు.

"నాకు జీవితం గురించి ఆలోచించే తీరిక ఎక్కడుంది. నాలుగు రోజులు ఈ నగరం విడిచిపెట్టటానికి ఇంకొంచెం వయసు రావాలి''

"మీరు బాగా మాట్లాడతారు''

"అది సరే... యస్.టి.డి. కదా నా మాటలు చాలా ఖరీదుగా ఉంటాయేమో''

"ఉండనివ్వండి... మీ దగ్గరే ఉమర్‌ఖయ్యాంలా ఉండిపోవాలనిపించింది''

ఆమె నవ్వింది.

"మీ నవ్వుకూడా బావుంది''

"థాంక్స్ రవీంద్రా... త్వరగా ఓసారి హైదరాబాద్ రాకూడదూ''

"తప్పకుండా వస్తాను. బహుశా అతి త్వరలో''

"వెల్‌కమ్... ఉంటాను'' ఫోన్ పెట్టేసింది.

రవీంద్రకెందుకో మహదానందం కలిగింది. గాల్లో తేలిపోతున్నట్లుగా వెళ్ళాడు. నారాయణ మేతలు కడుతూ కనిపించాడు. ఆ పని పూర్తయినాక వచ్చాడు.

"చూడు నారాయణా... అప్పుడప్పుడూ చెరువు నాలుగు మూలలకి తిరిగి చూస్తుండు. ఎరువులు ఎక్కువయితే గ్యాస్ తయారు కావచ్చునంటున్నారు. ముందు బుడగల లాంటివి వస్తే ఇంక చేపలు బతకటం చాలా కష్టం''

నారాయణ తలూపాడు.

కొబ్బరి చెట్లను పరిశీలించాడు. వాటికి చెందిన కొన్ని పనులు చెప్పాడు.

"ఇంకా సంగతులేమిటి నారాయణా'' అన్నాడు.

"మీకు తెలియదా... షావుకారి చెరువుల్లో విషం కలిపారండి'' అన్నాడు.

"ఎప్పుడు'' అన్నాడు ఆశ్చర్యంగా.

"రెండు రోజులవుతుందండి''

"అయితే''

"చేపలన్నీ చచ్చిపోయి నీళ్ళమీద తేలిపోయాయండి. చూసేవారికి కళ్ళంట నీళ్ళు వచ్చాయండి. ఒకటా రెండా ఎన్ని చేపలండి బాబూ. అలా నీళ్ళమీద తేలుకుంటూ పడున్నాయి. ఆటన్నింటినీ బయట పారబోయటానికి ఎంత ఖర్చవుద్దో. ముందా నీళ్ళన్నీ తోడించేత్తన్నారండి''

"ఎవరు చేశారంటున్నారు?''

"ఏమోనండి... గొడవలుగా ఉంది. పోలీసులు వచ్చారండి. ఆయన ఎవరిమీదనో అనుమానం ఉందని చెప్పాడంటండి''

"జాగ్రత్తగా ఉండు నారాయణా నేను వెళ్తాను'' అన్నాడు.

ఎందుకో భయం కలిగింది. తన చిన్నతనంలో కుప్పలు తగలబెట్టేవారు. అలానే గడ్డివాములు తగలబెట్టేవారు. అరెస్టులూ, కోర్టుల చుట్టూ తిరగటాలూ, అదంతా ఓ




ప్రపంచంగా ఉండేది. ఇప్పుడు చేపలకూ పాకిందన్నమాట. అయినా మనిషి మీద కోపం ఉంటే నోరులేని జీవాలమీద చూపించటం ఏమిటి? అవి ఎలా అయినా చనిపోవాల్సిందే. అయితే మనిషి ఆహారంగా ఉపయోగపడటానికీ, దీనికీ తేడా లేదూ... ఇది ఎవరు చేసినా దారుణమే. తగాదాలు తీర్చుకునే పద్ధతి ఇదికాదు. ముందు ఈ రకమైన ట్రెండ్‌ని దెబ్బతీయాలి అనుకున్నాడు. బండి షావుకారు ఇంటివైపుకెళ్తుంటే ఆయనే ఎదురయ్యాడు.

"మీ దగ్గరకే వస్తున్నా, నేను హైదరాబాద్ వెళ్ళాను. ఏమిటీ దారుణం" అన్నాడు రవీంద్ర.

ఆయన నల్లటి కళ్ళజోడు ధరించాడు. అది తీసి జేబులోపెట్టాడు. కళ్ళు ఎర్రగా ఉన్నాయి. గంభీరంగా నవ్వాడు.

"ఆళ్ళకి చేతయింది చేశారు. మనకి చేతయింది చెయ్యాలిగా''

"ఇంతకీ ఎవరనుకుంటున్నారు''

"ఇంకా ఎక్కడ... తెలుస్తుంది. వాళ్ళను అంత తేలిగ్గా ఎలా విడిచిపెడతాం. నేను డి.యస్.పితో మాట్లాడటానికి వెళ్తున్నా. మళ్ళీ కలుసుకుందాం" అని బులెట్‌మీద వేగంగా వెళ్ళిపోయాడు.

"ఇలా అయితే వ్యవసాయంగానీ, ఇంకోటిగాని ఎలా చేస్తాం" అనుకున్నాడు.

దారిలోనే రిటైరైన ఓ మాస్టారు కలిశారు.

"ఏం బాబూ చెరువులెలా ఉన్నాయి''

"ఏం చెరువులోనండి భయంగా ఉంది. షావుకారిగారి చెరువులో విషం కలిపారంట కదా''

"అవును... అది పిరికి చేష్ట. అయినా రోజులు బాగా మారిపోతున్నాయి. ఇంతవరకూ ఆ పని చేసిందెవరో తెలియదు. షావుకారంటే చాలామందికి కోపం. ఈ ఊర్లో ఇప్పుడు రెండు పార్టీలు కాదు, కులానికో పార్టీ అయింది. ఎవడికాడు ఇంకోడ్ని చూస్తే ఏడుపే. ఆడు సంపాదిస్తున్నాడంటే ఆడు సంపాదిస్తున్నాడనే ఏడుపు తప్పితే ఇంకోటి లేదనుకో''

"అది సరేనండి... కనీసం ఎవరిమీదనైనా అనుమానంగా ఉందా?"

"లక్షమందిమీద అనుమానం ఉంటుంది. ఈ పని ఎవరైనా చేయొచ్చు. ఫలానా కులంవాడు కలిపుండొచ్చు. లేదా రాజకీయం ఉండొచ్చు. ఇంకా మాట్లాడితే నువ్వున్నావ్. నామీద నీకు శతృత్వం ఉంది. నాకు షావుకారంటే పడదు. అది అందరికీ తెలుసు. నువ్వు నన్నేమీ చేయలేవు. అందుకని షావుకారిచేలో విషం కలుపుతావ్. ఆయనకి నామీద అనుమానం వస్తుంది. ఇంక ఇద్దరూ కొట్టుకుంటారు. నువ్వు చూస్తూ ఉండొచ్చు. అర్ధమైందా. నువ్వంటే నువ్వని కాదు. మాట వరసకి చెబుతున్నా. అంటే ఎవరైనా చేయటానికి అవకాశాలున్నాయి. పగాడే చేస్తాడనుకోవటానికి లేదు''

మాస్టారి వివరణ విని ఆశ్చర్యపోయాడు. అందులో వాస్తవం ఉందనిపించింది.

"అంతే కాదయ్యా... నాకు తింటానికి లేదు. నీకు కార్లున్నాయి. మేడలున్నాయి. నేను నిన్నేం చేయలేను. కానీ నీకు నష్టం కలిగించగలను కదా. అలానూ జరిగి ఉండొచ్చు. అందుకే మాలాంటి వాళ్ళం 'కృష్ణా-రామా' అనుకుంటూ ఓ మూలన పడున్నాం"

"పోనీండి ఎటుకొట్టుకుపోతే అటు కొట్టుకుపోతుంది. ఎవడాపగలడు వీటిని. చెబితే ఎవడు వింటాడు'' అన్నాడు.

"అవును... ఎవరూ వినేలా లేరు'' అన్నాడు రవీంద్ర.

"అయినా అబ్బాయి, నాకు తెలియక అడుగుతున్నా. ఇప్పుడు శత్రుత్వానికి కారణాలుండాలా చెప్పు'' అనడిగాడు.

"అదే..." అంటూ నసిగాడు.

"అది కాదయ్యా రాత్రంతా ఆ బార్లలో పడి తాగితాగి తిమ్మిరెక్కుతుంది. తలకాయ

తిరిగి ఏదో మాటంటాడు. ఎదురోడికి కూడా తలకెక్కి ఉంటుంది. అంతే తలలు పగలటమో, కత్తుల్తో పొడుచుకోవటమో. సిగరెట్టు కాడా, కోడి కూర కాడా, అమ్మాయిల దగ్గర ఎక్కడ బడితే అక్కడ కత్తులు తీసుకోవటం... ఇంకా నయంలే. ఇక్కడింకా కత్తేలే. బాంబులు రాలా, ఆ రాయలసీమలో అయితే ఇంక చెప్పేదేముంది. అయ్యా నేననుకుంటాను కదా. మేం బతికిన కాలం చాలా మంచిది. ఛాదస్తం అనుకో, మరోటనుకో. నా అభిప్రాయం అది'' అనేసి వెళ్ళిపోయాడు.

రవీంద్రకి మనసంతా అదోలా అయిపోయింది. ఇంటికి వెళ్ళిపోయాడు.

"ఏమిటీ అలా ఉన్నారు'' అనడిగింది వసుంధర.

"ఏం లేదు''

"అది కాదు... ఏమన్నా జరిగిందా?"

"ఏం జరగలేదు. మన షావుకారి చెరువుల్లో విషం కలిపారెవరో. చేపలు చచ్చిపోయాయి''

"ఇన్సూరెన్స్ చేశారా?"

"ఏమో... అయినా చెరువులకి ఇన్సూర్ చేయరేమో. ఇంతవరకు మనం ఆ విషయం గురించి ఆలోచించలేదు. పచ్చి సరుకు గదా''

"ఎందుకు చేయరు. తప్పకుండా చేస్తారు. అందులోనూ ఇంట్లో సామాన్లకీ, గోల్డ్‌కీ ఇన్స్యూర్ చేస్తున్నప్పుడు చెరువులకెందుకు చేయరు''

"అదేదో వాళ్ళు చూసుకుంటారు. అసలు ఇన్నిరోజులు చేసిన 'శ్రమ' వృధా అయిందే అని నేననుకుంటున్నా''

వసుంధర ఆలోచిస్తోంది.

"ఏమైనా మనం 'ఆక్వా' గురించి ఆలోచిస్తే బాగుంటుంది. ఎంత తక్కువ అనుకున్నా, సంవత్సరానికి మూడు క్రాపులు తీయవచ్చునంటున్నారు''

"లాండ్ ఎక్కడుంది?"

"ఎందుకుండదండి. మనం దానిగురించి తిరగాలి. అదే దొరుకుతుంది''

"వసుంధరా, దాని ప్రాబ్లమ్స్ దానికున్నాయి. అసలు 'ఆక్వా'కి చెంది పెద్దపెద్ద పరిశ్రమాధిపతులు ముందుకొచ్చారు. చేపలు కొంతవరకునయం. ఆ వాటర్ ఏ మాత్రం పొల్యూట్ అయినా రొయ్యలు బతకవు. రెండోది మనం దూరంగా ఉండి చూసుకుంటానంటే కుదరదు''

"అంతగా అయితే మనం అక్కడే ఉంటాం. డబ్బులంటే చేదామనకి. ఈ విషయం గురించి ఆలోచించండి''

"సారీ వసుంధరా, నాకు ఈ చేపల చెరువులు చాలు. అంతగా అయితే వీటినే డెవలప్ చేసుకుంటాను. అంతకు మించి నేను పరుగులు తియ్యలేను. ఈ రోజు రొయ్యలు నయం అనిపించవచ్చు. రేపు పీతల పెంపకం లాభసాటి అవుతుంది. ఎల్లుండి ఇంకోటి... ఇలా ఎంతదూరం"

"అలా అనకండి. కాలంతోపాటు పరిగెత్తాలి. గుర్రపుబండి దగ్గర ఆగిపోయామా, మారుతీకారుతో ఆగిపోతుందా. అంతే, మనం ముందుకు పోవాల్సిందే. లాభంగా ఉన్న రంగంకాక ఇంకే రంగాన్ని మనం సెలక్ట్ చేసుకుంటాం?"

"అంటే 'తృప్తి' వద్దంటావా?"

"తృప్తి చెందే వయసు కాదిది. ఇంకా కొంతకాలం ఆగాలి'' నవ్వుతూ అంది. ఎందుకో 'పూజ' గుర్తుకొచ్చింది. చేపల చెరువు తాలూకు విషం గురించి మరిచిపోయాడు.

"అవును... నిజమే చెప్పింది వసుంధర. తృప్తి చెందే వయసు కాదిది'' అనుకున్నాడు. అతనింకేం మాట్లాడకపోయినా వసుంధరకీ సంతృప్తిగా ఉంది. తన మాటల ప్రభావం భర్తమీద ఉంటుందని తెలుసు. రెండుమూడు సార్లు అలా చెబుతూ పోతుంటే ఖచ్చితంగా




ఆ పని చేసి తీరతాడు. అదలా ఉంటే ఆమెకి నిరాశగా ఉంది.

తను బాగుంటుందని కొనమన్న షేర్లు చేతిలోకి రాగానే ఒక్కసారిగా ధర పడిపోయింది. కనీసం ఇరవై అయిదువేలు షార్ట్... ఇలా ఎందుకు జరిగిందో తనకు అర్థం కావటంలేదు. ఇంటి ఓనర్‌గారు చెప్పిందే నిజం అనుకొంది.

"ఇదంతా జూదం" అంటాడాయన.

జూదంలో తెలివితేటలు కొంతవరకే పని చేస్తాయి. కానీ ముక్కలు రాకపోతే ఎంత గొప్ప ఆటగాడైనా ఏమీ చేయలేడు.

షేర్లలోనూ అంతే. ఎంత గొప్ప తెలివికల వాడైనా ఓ దెబ్బతో ఎగిరిపోవచ్చు. ఉత్పత్తి, పంపిణీలమీద లేదా డిమాండ్‌మీద మాత్రమే ఆధారపడేవి కాదు షేర్లు. అవి పెరగటానికీ తరగటానికీ వెనక అనేక శక్తులు పనిచేస్తుంటాయి. వాటి అన్నింటిమీదా కన్నువేసి ఉంచటం ఎవరికీ సాధ్యంకాదు. అందుకే ఈ రంగంలో జరిగే చమత్కారాలు ఇంకెక్కడా ఉండవు. ఫ్యాక్టరీ ఇంకా పూర్తికాదు. ప్రొడక్టు మార్కెట్‌లోకి ఎప్పుడు వస్తుందో తెలియదు. అయినా అనధికార ప్రీమియం మాత్రం పెరుగుతూ ఉంటుంది. ఎందుకిలా జరుగుతుందో ఆలోచించే తీరిక ఉండదు. కొద్దిమంది మాత్రమే అలా విశ్లేషించుకుంటారు.

ఇవన్నీ ఆయన నోటివెంట వింది వసుంధర. షేర్స్‌కు చెందినఅనేక పుస్తకాలు తెప్పిస్తారు ఇంటివారు. వాటన్నింటినీ ముందేసుకొని తనో చిత్రం తయారు చేసుకుంటుంది. ఇంతకు ముందు లేదుగానీ, ఈసారి కొంచెం షాక్. నష్టం అయితే అయింది. వాటని అమ్మేద్దాం అనుకుంది.

ఇంటి ఓనర్‌కి కూడా ఓ ఏభైవేలు లాస్ వచ్చింది. అయినా వారేం తొణకలా. తిరిగి పూడ్చుకోగలం అనే నమ్మకంతో ఉన్నారు.

★ ★ ★

సూర్యం వచ్చాక రవీంద్రకి కబురు చేశాడు.

"చూశారా... ఘోరం జరిగిపోయింది. మన చేపల రైతులంతా ఎవరికివారుగా ఉంటే లాభంలేదు. ముందు మనందరం ఓ సంఘంగా ఏర్పడాలి''

"ఎవరు కలిసొస్తారు'' అన్నాడు రవీంద్ర.

"అలా అనొద్దు. మన ప్రయత్నం మనం చేద్దాం. సక్సెస్ అయితే మంచిదే కదా''

"అలానేకానీండి. గోపాల్‌ని కలిసారా?"

"లేదండి బాబూ. ఆరోజు మనకి దొరికాడు. చాలా అదృష్టం"

"స్నేహానికి విలువిస్తాడనుకుంటానే'' అన్నాడు.

"అవును... వాడలా ఉన్నాడుగానీ చాలా విషయాలు తెలుసు. ఎంత కాలుక్యులేటెడ్‌గా ఉంటాడంటే కాలవలో పారేసినా లెక్కపెట్టి పారేస్తాడు. విచ్చలవిడిగా ఖర్చుపెడతాడు. అయినా వాడి కంట్రోల్ తప్పడు''

"మళ్ళీ ఎప్పుడు వెళ్తున్నారు?"

"రెండు రోజులు ఆగాక వెళ్తాను''

అప్పుడే ఎవరో వచ్చారు. సూర్యం వాళ్లని పిలిచాడు.

"నమస్కారమండి'' అంటూ వచ్చారు.

"ముందు విషయం ఏమిటో చెప్పండి''

"ఏం లేదు బాబూ. గుడికడదామనుకుంటున్నాం. అందరి దగ్గరకీ చందాలకోసం బయలుదేరాం" అన్నాడాయన.

ముఖంమీద బొట్టుపెట్టాడు. చేతిలో కాషాయరంగు సంచి మీద 'హరేరామ హరేకృష్ణ' అని రాసుంది.

"ఎక్కడ కడుతున్నారు''

"దగ్గర్లోనే. రోడ్డుకి ఆనుకునే. 'నాలుగు వందల గజాలు దానం చేశారు. ఇంకో రెండు వందల గజాలు కొనాల్సి ఉంది. మీలాంటి వారు సహకరిస్తే అన్నీ సకాలంలో జరుగుతాయి''



"ఇంతకీ ఎవరి గుడి''

"భక్తాంజనేయస్వామిది''

"మొన్న ఎవరో వచ్చారు. షిరిడీ సాయిబాబా గుడి కడుతున్నాం అని చందా తీసుకువెళ్ళారు'' అన్నాడు సూర్యం.

"అవునండి... ఆ గుడి కూడా నిర్మాణంలో ఉంది''

"ఇంతమందికి గుడి కట్టించటం ఎందుకు చెప్పండి. అయినా దేశంలో గుడులకేం తక్కువ. ఎక్కడ బడితే అక్కడ ఉన్నాయి. చాలా వాటిల్లో దీపం వెలిగించే నాథుడు లేడు. కనీసం అలాంటివాటిని ఉద్ధరించినా లాభంగానీ ఇదంతా ఎందుకు చెప్పండి''

"అంతదానికి మనమెంతటి వాళ్ళం చెప్పండి. ప్రభుత్వం పూనుకోవాలి. మహాదాతలు పూనుకోవాలి. అంతేగాని మనలాంటి వారికి సాధ్యంకాదు. అయినా మనమేం చేయాలో నిర్ణయించేది ఆ పైవాడు. ఆధ్యాత్మికతకి అంతం ఏమిటి? ఆరంభం ఏమిటి? దేశంలో ఎన్ని ఆలయాలు నిర్మించినా నష్టం లేదు. షావుకారిగారి చేలో విషం కలిపారు. పాపభీతి ఉన్నవారు ఆ పని చేయగలరా? అలా చేయటంవలన ఎంత నష్టం అయింది. అలాంటిది మనసును ప్రశాంతంగా ఉంచుకోవటం కోసం చేసే ప్రయత్నానికి దండగ అనుకోకూడదు''

సూర్యం రవీంద్రకేసి చూశాడు.

"మీరు వాదన అనుకోకుంటే ఇంకో మాట చెబుతా. కొన్ని పదుల కోట్లు మద్యంమీద తగలేస్తున్నాం. అందువలన లాభం ఏముందంటారు? అందుకే మీలాంటివారు ఉదారంగా విరాళాలు ఇవ్వాలి. అప్పుడే ఈ ప్రాంతం కళకళలాడుతుంది. ఆ భగవంతుడు మిమ్మల్నీ, మీ కుటుంబాన్నీ, మీ చేపలనూ సదా రక్షిస్తాడు.

"సరే ఆ పుస్తకం ఇలా ఇవ్వండి'' అన్నాడు సూర్యం.

అందుకున్నాక చూశాడు. వందల్లో ఉన్నాయి అంకెలు.

"రెండువందలు రాస్తున్నా''

"తమ దయ" చేతులు జోడించాడతను.

పుస్తకం అందుకున్నాడు రవీంద్ర. తనూ రెండువందలు రాసి అందించాడు. వాళ్ళు వెళ్లాక అన్నాడు సూర్యం.

"ఈ కోస్తా ఏరియాలో ఏ కల్చర్ పెరుగుతుందో సర్వే చేస్తే నాకు కనిపించింది, ఈ గుళ్ళ కల్చర్. ఎక్కడ చూసినా గుడి. అసలు ఈ దేశం బాగుపడాలంటే ఈఆధ్యాత్మిక దృక్పథంనుండి జనం బయటపడాలి. అరే, దారి పొడుగునా అవే. ఆ విగ్రహాలు ఎంతెంత పెద్దవి. వాటికి బంగారాలు, కిరీటాలు ఒకటా, రెండా... ఇంతింత డబ్బుని ఏదైనా ప్రాడక్ట్ చేయగలిగే దానిమీద పెడితే ఎంతమంది బతుకుతారో చూడండి. అదేంలేదు. మన జనం కూడా అంతేలెండి. మంచిపని చేస్తున్నాం అంటే కానీ ఇవ్వరు. అదే ఏ గుడో అంటే మాత్రం వందలు వందలు పారేస్తారు''

రవీంద్ర నవ్వాడు.

"మనమూ ఇచ్చాం కదా'' అన్నాడు.

"ఛస్తామా, సెంటిమెంట్ మీద కొట్టాక, ఆంజనేయస్వామి చేపల్ని కలకత్తా చేరేదాకా చల్లగా చూస్తాడంటే ఇవ్వకేం చేస్తాం. ఇంకా మీకు తెలియదేమో. ఆ ఎన్నికలు రానీండి. వస్తారు మన దగ్గరికి. కమ్యూనిస్టు పార్టీ వాళ్ళు వస్తారు. ఇవ్వక ఛస్తామా. ఇటునుండి చందాలు తీసుకుంటారు. అటునుండి భూస్వాములు నశించాలి అని కేకలేస్తారు. వాళ్ల మీద వీళ్ళు చాలా నయం కదండి బాబూ. నెత్తిమీద చెయ్యిపెట్టి ధన, కనక, వస్తు, వాహనాలు రావాలని దీవిస్తారు''

ఈసారి రవీంద్ర కడుపు చేత్తో పట్టుకుని నవ్వుతుండిపోయాడు.

"వామ్మో... మీతో చాలా కష్టమండి బాబూ''

"మరేంటనుకున్నారు. ఈ చేపలమీద రూ.





పాయి వస్తే అదంతా మనదే అనుకుంటారు పిచ్చిజనం. దీనెనక ఎంత మందుంటారో లెక్కలు తెలియదు. తెలిస్తే గుండెలు బాదుకోరూ''

"ఏమైనా ఓసారి లెక్కలు తయారుచేయండి చూద్దాం"

"అలాగే. అందుకే చెబుతున్నా. ఓ గుడికట్టాలంటే నలుగురు కలవాలి. కమ్యూనిస్టులు ఈ దేశానికి ఓ మంచి విషయం నేర్పారు రవీంద్రా''

"చెప్పండి''

"సంఘాలుగా ఏర్పడండి అనేది కదా వాళ్ళ నినాదం. ప్రపంచ కార్మికులారా ఏకంకండి అంటారు. మరి కార్మికులందరూ ఏకం అయ్యారో లేదో గాని యజమానులందరూ ఏకం అయ్యారు. ఇప్పుడు బాగా పని చేసే సంఘాలు వ్యాపారస్థులవే. అంచేత మనం అంటే చేపల ఉత్పత్తి దారులమంతా ఓ సంఘం కావాలి. అవసరమైతే నిధులు పోగేసుకోవాలి. మనకో కార్యాలయం ఉండాలి. ఇంక అక్కడ కూర్చుని మన సమస్యలు చర్చించుకుని, అవసరమైతే గవర్నమెంట్‌తో యుద్ధం చేయాలి''

"మీ సూచన చాలా బాగుంది'' అన్నాడు రవీంద్ర.

"నేనింక ఈ పనిలో ఉంటాను'' అన్నాడు సూర్యం.

★ ★ ★

పది రోజులు గడిచిపోయాయి.

రవీంద్ర మాధవరావుకి ఫోన్ చేశాడు.

"నేనే మీతో మాట్లాడుదామనుకుంటున్నా'' అన్నాడాయన.

"చెప్పండి. ఎవరైనా అడిగారా?"

"అవును. మూడు లక్షల చిల్లరకి అడుగుతున్నారు. మీరు వస్తే ఇక్కడ కార్యక్రమాలు పూర్తిచేసుకోవచ్చు''

"అలాగే. ఎప్పుడు రమ్మంటారు''

"మీ ఇష్టం. మీరు ఎంత త్వరగా రాగలిగితే అంతమంచిది''

"అలాగే'' అని ఫోన్ పెట్టేశాడు.

వసుంధరతో ఈ విషయం చెప్పాడు.

"ఇంక ఆలస్యం ఎందుకు. ముందు ఆ లోన్ ఎమౌంట్ క్లియర్ చెయ్యండి. తర్వాత వారి పేరుతో రిజిస్టర్ చేయవచ్చు''

"నువ్వు కూడా వస్తావా?"

"నేనెందుకు'' అంది.

"అదేమిటోయ్. మనం ఎంతో ప్రేమగా కొనుక్కున్న ఇల్లు. కొన్ని సంవత్సరాలపాటు అందులో బతికాం. అమ్మేస్తున్నప్పుడైనా చూడాలనిపించటంలేదా?"

వసుంధర ఓ నిముషం ఆలోచించి నిట్టూర్చింది.

"ఎందుకండి. అక్కడికి వచ్చిన దగ్గర్నుండి బాధ. తలోరకంగా సలహాలు ఇస్తారు. అమ్మటం ఎందుకంటారు. మరోరకంగా మాట్లాడుతారు. అవన్నీ విన్న దగ్గరనుంచి మరింత బాధకలుగుతుంది. ఇప్పుడయితే ఒకటే బాధ"

రవీంద్ర మాట్లాడలేదు.

"మీకయితే ఆ ఇల్లు అమ్మటం ఇష్టంలేదు. నాకోసం అమ్ముతున్నారు. అవునా?"

"ఏదో ఒకటిలే. అయితే నేను మాత్రమె వెళ్లాలి''

"అవును. ఇంకో విషయం అడ్వాన్స్‌లు గట్రా తీసుకోవద్దు. ఎలాంటి ఎగ్రిమెంట్లు రాయకండి. మొత్తం డబ్బంతా ఇవ్వటం, రిజిస్ట్రేషన్ చేయటం ఒకేసారి జరిగిపోవాలి. అర్థమైందా? లేకపోతే ఇంక సంవత్సరాల తరబడి డబ్బులు రావు. మనం ఇంకొకరికి అమ్ముకునే అవకాశం ఉండదు''

"నువ్వు కూడా వస్తే ఎలాంటి పొరపాట్లు జరగవుగా'' అన్నాడు.

"మీరు పొరపాట్లు చేస్తారని కాదు.

ముందు జాగ్రత్తగా చెబుతున్నాను''

"సర్లే' అన్నాడు.

తను రాత్రి హైదరాబాద్‌కి బయలుదేరాడు. అత్తా, మామ వచ్చారు.

"అల్లుడేడమ్మాయ్'' అన్నాడు వసుంధర తండ్రి.

"హైదరాబాద్ వెళ్ళారు''

"ఏమిటో పని''

"మా ఫ్లాట్ అమ్ముదామనుకున్నాం. ముందు ఇంకొంత లోన్ మిగిలుంది. అది పే చేసి అమ్మేయటానికి వెళ్ళారు''

ఎందుకో వెంటనే ఆయనేం మాట్లాడలేదు. పడుకోబోయేముందు భార్యతో అన్నాడు-"చూశావా ఇల్లు అమ్ముతూ కూడా మనతో మాటమాత్రం అనలేదు''

"మనిల్లేం అమ్మటం లేదుగా'' అందామె.

"అదిగో ఆ వ్యంగ్యమే వద్దన్నది. స్థిరాస్థులు ఎవరూ అంతత్వరగా అమ్ముకోరు. అది ఏర్పరుచుకోవటమే కష్టం. అయినా ఇప్పుడేమంత అవసరం అయిందని అమ్ముకోవటం"

"అదే తెలిస్తే ఈ అమ్ముకోవటం ఏమిటో కూడా తెలిసేది. అయినా మనం పిల్లని బయటకు పంపాక ఇంక వాళ్ళు మనకు చెప్పారా లేదా అనేది అనవసరం. చెప్పారనుకోండి అది గౌరవం. లేదంటారా వారిష్టం. చిన్న పిల్లలు కాదు గదా''

"నిజమే అనుకో. ఇదంతా నాకేం నచ్చటంలేదు''

"నాకయితే అనవసరం. మనం పాతకాలపువాళ్ళం. అందుకే పిల్లల్ని గుండెల్లో పెట్టుకుని పెంచాం. ఇంతవండిపెడితే తిని చదువుకొని పెద్దయ్యారు. ఆ ఎలిమెంటరీ స్కూలు ఆ హైస్కూలు వీటిలో చదివే పైకొచ్చారు. నాలుగు రోజులు చుట్టాలింటికి పోతే కంటి మీద కునుకుండేదికాదు. ముందసలు వాళ్ళు కదిలేవారా. ఎప్పుడూ అమ్మ కావాలి, నాన్న కావాలి. అన్నీ పెళ్ళితోనే పోయాయి. అది నిన్నటి బతుకు. ఇది వాళ్ళ స్వంతం. మనమెవరం మాట్లాడటానికి''

"అదేమిటే అట్లా వేదాంతం మాట్లాడతావు'' అన్నాడాయన చిరాగ్గా.

"వేదాంతం కాదండి. ఉన్నది మాట్లాడుతున్నాను. అసలు ఒక్క నలుసు చాలు అనుకున్నారు. కాదన్నాం. ఆగారా. ఆపరేషన్ చేయించుకున్నారు. పోనీ వాడిని దగ్గరుంచుకున్నారా. ఎక్కడికో తరిమేశారు. వీళ్ళపాటి తెలివి ఇక్కడే చదువుకున్నా వస్తుంది. ఆ ముక్క చెప్పామనుకో. ఇంకో రకంగా అర్థం చేసుకుంటారు. అందుకే ఆ పిల్లవాడినే బతిమాలుకోవటం. అయినా రేపేదైనా జరిగితే మనమేమన్నా ఆరుస్తామా తీరుస్తామా. నాకు మాత్రం బాధ ఉండదా. చిన్నతనంలో చెప్పకుండా ఏ పనీ చేసేవారు కాదు. ఇప్పుడు పెద్దవాళ్ళయిపోయారు. ఆ అబ్బాయి సంగతి వదిలేయండి. మనమ్మాయి సంగతి చూడండి. తను మిమ్మల్నో నన్నో అడగవచ్చు కదా. అనవసరం అనుకోబట్టే. ఇంక బాధేమిటి''

"సర్లే... రేపు ఉదయం వెళ్ళిపోదాం"

"అదేమిటి రెండు రోజులు ఉందామని బయలుదేరతీశారు'' అంది.

"అనుకున్నాను. కానీ ఇక్కడ ఉండాలని లేదు''

"అదేమిటండి అది ఏమన్నా అనుకోదూ''

"ఏమీ అనుకోదు. అది పెద్దదయిందని నువ్వే చెప్పావుగా. అయినా అది ఏం అనుకుంటే మనకెందుకు. ఇంకోమాట కూడా చెబుతున్నా. అది ఏమైనా అనుకోవాలనే నేను వెళ్దామంటున్నా. నువ్వు వస్తావా? రావా?"

"బాగానే ఉంది. మీకు నేను తప్పితే ఎవరు దొరుకుతారులే' అంది. మరునటిరోజు భోజనం చేశాక వెళ్ళిపోయారు.

వెళ్ళేముందు వసుంధర ఉండమని అడగలేదు.




"అప్పుడే వెళ్ళిపోతున్నారే. అసలు ఎందుకొచ్చినట్లు?" అని మాత్రం అంది.

"చూద్దామని వచ్చాం. ఆయనకి పనులున్నాయి. నాకే చూడాలనిపిస్తే తీసుకొచ్చారు. చూశాం కదా. వెళ్తున్నాం"

వసుంధర తలూపింది. వారిద్దరూ రిక్షాలో బస్‌స్టేషన్‌కి వెళ్ళారు.

"కనీసం మనవడి గురించైనా చెప్పిందా?"

ఏదో ఉత్తరాలు రాస్తున్నాడని మాత్రం అంది. అసలు కీలకమంతా ఆ ఇంటి ఓనర్ దగ్గర ఉన్నట్లుందండి''

"కొంచెం అర్థమయ్యేట్లు చెప్పు''

"ఎప్పుడూ ఆమెతోనే కబుర్లు. మాట్లాడితే అవేవో కంపెనీ షేరు పెరిగింది అంటుంది. లేకపోతే బ్యూటీ పార్లర్‌కు వెళ్దామా అంటుంది. మీ అమ్మగారు వచ్చారు కదా. చీరెలు చూస్తారా అంటుంది. ఇంక మన పిల్లయితే ఆ కళ్ళనిండా ఎంత భక్తో' అంది.

"వాళ్ళకంటే లక్షల్లక్షలున్నాయి. ఏ ఆటయినా ఆడతారు. మనకి ఎలా కుదురుతుంది. సొంతం నాలుగురాళ్ళు వెనకేయకుండానే చందమామ కావాలంటే ఎలా?" అంది. ఆయనింకేం మాట్లాడలేదు.

"నేను ముందే చెబుతున్నాను. మనకున్నది చాలు. అనవసరంగా ఈ రొంపిలోకి మాత్రం మీరు రావద్దు. ప్రశాంతంగా కాలం గడిచిపోతోంది. ఎందుకో దాన్ని ఈసారి చూస్తుంటే చిన్నప్పటి వసుంధరలా అనిపించలేదండి. ఇంటికెళ్ళగానే ఎంత సంతోష పడిపోయేది చిన్నపిల్లలా. అదేమీ లేదు. కనీసం మనవడి కబుర్లు నాలుగు చెప్పిందా? ఇదివరకయితే వాడిలా చేశాడు, అలా చేశాడంటూ చంపుకుతినేది. ఇప్పుడేమో నన్ను మించిన తెలివితేటలు కలది ఈ ప్రపంచంలో లేదన్నట్లుగా ఉంది''

"మంచిదేగా. మనకీ సంతోషమే'' అన్నాడాయన.

వెళ్ళగానే బస్ దొరకలేదు. దాదాపు రెండు గంటలపాటు అక్కడే కూర్చుని ఎదురుచూశారు. ఎప్పటికో బస్ వచ్చింది. ఆడవారికోసం ప్రత్యేకించిన సీటు ఆమెకి దొరికింది. ఆయన నిలబడే ఉన్నాడు.

ఆయన ఎంత సమాధాన పరుచుకుందామన్నా సాధ్యం కావటం లేదు.

బాధ ముల్లులా హృదయాన్ని గుచ్చుతూనే ఉంది.

★ ★ ★

మాధవరావుగారిని కలవగానే ఆయన ఎవరికో ఫోన్ చేశాడు. సాయంకాలం అయిదుగంటల తర్వాత ఆయన కలవగలనని చెప్పాడు. ఆ రకంగానే వచ్చాడు. మూడు లక్షల పాతికవేలకు బేరం కుదిరింది. నాలుగురోజుల్లో క్యాష్ ఇచ్చేటట్లు ఒప్పందం జరిగింది. ముందుగా బ్యాంక్ లోన్ వరకు ఇవ్వవలసిందిగా అడిగారు. రెండు రోజుల్లోగా ఏర్పాటు చేయగలనన్నాడు.

మాధవరావుగారు తమ ఇంటికి రమ్మని అడిగినా రవీంద్ర మృదువుగా తిరస్కరించాడు. తను లాడ్జిలోనే ఉన్నాడు.

ఖాళీగా ఒక్కరోజు మాత్రం ఉన్నాడు. ఈలోగా గోపాల్ గురించి ఆలోచన వచ్చింది. ఆయన్ని కలిస్తే బాగుంటుందికదా అనిపించింది. అంతలోనే తనేం అనుకుంటాడో మరీ చిల్లరమనిషిగా అనుకుంటాడేమోనను కున్నాడు. కొన్ని సినిమా పత్రికలు కొన్నాడు. వాటిలో గోపాల్ నిర్మించబోయే సినిమా తాలూకు వివరాలు కనిపించాయి. కథ ఎప్పుడు తయారైందో తెలియదు. మొత్తంమీద అందరూ పేరున్న నటీనటులే. టెక్నీషియన్స్ కూడా. త్వరలో షూటింగ్ ప్రారంభం అవుతుందన్నారు. అందుకే ఆయన్ని డిస్టర్బ్ చేయకూడదనుకున్నాడు.

అయితే పూజ విషయంలో తను తొందర పడలేదు. ముందు ఇంటికి చెందిన పనులన్నీ పూర్తి చేయాలనుకున్నాడు. మాధవరావుగారు

ఎవరెవరితోనో మాట్లాడాడు. లోన్ ఎమౌంట్ పే చెయ్యటం. తనఖా రద్దు చేయటంతోపాటు నో డ్యూస్ సర్టిఫికెట్ వచ్చింది. ఇంకా అవసరమైన కాగితాలన్నీ ఆయనే తెప్పించాడు. మరో రెండురోజుల తర్వాత మొత్తం డబ్బు అందింది. మరుసటిరోజు రిజిస్ట్రేషన్ ఏర్పాట్లు జరిగిపోయాయి.

"అంత డబ్బు లాడ్జిలో ఉంచటం ఎందుకు? బ్యాంక్‌లో వేస్తే బాగుంటుందేమో'' అన్నాడు మాధవరావు.

"ఒక్కరోజుకి ఎందుకండి. రేపు మరలా డ్రా చేయటం అంతా తలనొప్పి. మీ దగ్గర ఉంచండి''

"ఏం అవసరం లేదు. రేపు ఇంత క్యాష్ తీసుకువెళ్ళటం కూడా అంత మంచిది కాదు. మీ ఎకౌంట్ నెంబర్ తెలుసుగా''

"తెలుసు''

"నేను మాట్లాడి ట్రాన్స్‌ఫర్ చేయిస్తాలెండి'' అన్నాడు.

పదివేలు మాత్రం విడిగా ఉంచి మిగతావి పంపించే ఏర్పాటు చేయమన్నాడు. ఉదయాన్నే రిజిస్ట్రేషన్ కార్యక్రమం కూడా దగ్గరుండి పూర్తి చేయించాడాయన.

"మీకు నేను చాలా ఋణపడివున్నాను. మీ స్వంతపనులు కూడా ఇలా చేసుకోరేమో'' అన్నాడు రవీంద్ర.

"భలేవారే... ఇది మాత్రం నా స్వంతపని కాదా, ఏమైనా ఈ డబ్బుని జాగ్రత్తగా ఉపయోగించండి. మీరు కష్టపడి సంపాదించుకున్నదిది'' అన్నాడాయన.

"తప్పకుండా'' అన్నాడు.

"మరి ఎప్పుడు బయలుదేరుతున్నారు?"

"రేపు సాయంకాలం"

"కనీసం భోజనానికయినా మా ఇంటికి వస్తారా?"

"ఎందుకండి. ఇంట్లో వాళ్ళని ఇబ్బంది పెట్టడం"

"ఇంకా నయం. ఇంట్లో నేను భోంచేయటమే ఇబ్బంది అనేట్టున్నారు. అసలు రోజూ ఇంట్లో గొడవ. ఇక్కడికే తీసుకురావచ్చుకదాని''

"నాకు బాధ కలిగించిన విషయం ఒకటేనండి. మన ఇంటిలో అద్దెకు చేరిన వారి గురించే. ఇంత త్వరగా ఖాళీ చేయాల్సి ఉంటుందని వారు అనుకుని ఉండరుకదా''

"హైదరాబాద్‌లో ఇవన్నీ మామూలే. అయినా మనం ముందే చెప్పాం. ఎప్పుడయినా ఖాళీ చేయాలని. కేవలం అర్ధరాత్రిలో ఖాళీ చేసినవారు ఎందరో ఉన్నారు. ముందు ఇళ్లు దొరుకుతాయి. అదీ విశేషం"

"అలా అయితే ఓపని చేస్తానండి. రేపు ఉదయం మీ ఇంటికి భోజనానికి వస్తాను. సాయంకాలం నేను వెళ్ళిపోతాను''

"మంచిది'' అన్నాడు.

ఆ సాయంకాలం జ్యూయలరీ షాపుకి వెళ్ళి మూడున్నరవేలు పెట్టి ఓ రింగ్ కొన్నాడు. చాలా అందంగా ఉంది. రవీంద్రకెంతో నచ్చింది. బిల్ కూడా జతచేసి పాక్ చేయించాడు. లాడ్జికి వెళ్ళి తృప్తిగా స్నానం చేశాడు. అప్పుడు హాయిగా ఉందనిపించింది.

వెంటనే పూజ కోసం ప్రయత్నం చేశాడు. తను ఇంటి దగ్గరే ఉంది.

"ఎక్కడినుంచి?"

"హైదరాబాద్‌నుంచే''

"ఎప్పుడు రావటం?"

"నాలుగు రోజులయింది. చాలా బిజీ. పనులన్నీ పూర్తయ్యాయి. రేపు వెళ్ళిపోదామనుకుంటున్నాను. అందుకే ఫోన్ చేశాను. లక్కీగా దొరికావు పూజా. ఇంట్లోనే ఉంటున్నావా?"

"బహుశా... మీ సంగతి చెప్పండి''

"ఏం లేదు. మనం కలుసుకోవటం ఎలా వీలవుతుందా అని ఆలోచిస్తున్నా. ముఖ్యంగా ప్రైవసీ దొరకాలికదా''




"మీకు అభ్యంతరం లేకపోతే మా ఇంటికి రండి''

"అభ్యంతరమా?" నవ్వాడు.

"ఎక్కడ దిగారు'' అంది పూజ.

చెప్పాడు.

"అలా అయితే నేనే వస్తాను. మీరు హెూటల్‌కింద నాకోసం వెయిట్ చేయండి పద్మినీ ప్రీమియర్ కారు. నెంబరు నాలుగు ఎనిమిదులు''

"ఎనిమిదంటే అంత ఇష్టమా?"

"కాదు. అయిదు అంటే ఇష్టం"

"ఎంతోసేపట్లో రావటం"

"మహా అయితే అరగంట"

"ఎదురు చూస్తాను''

పది నిమిషాల్లో తయారైపోయాడు. రూమ్ లాక్‌చేసి తాళంచెవి రిసెప్షన్‌లో అందించి బయటికొచ్చి నిలబడ్డాడు.

ఇరవైనిమిషాలు దాటింది. కారు హారన్ మోగేసరికి అటు చూశాడు. నాలుగు ఎనిమిదులు కనిపించాయి. మెల్లగా నడుచుకుంటూ వెళ్ళి డోర్ తెరిచాడు.

క్షణంలో అది మూసుకుపోయింది. పూజ నడుపుతోంది. నల్లటి అద్దాలకు తెరలు వేలాడుతున్నాయి.

ఆమెకేసి చూడకూడదనుకుంటాడు. కానీ తనవల్ల కావటంలేదు. ముఖానికి లైట్‌గా కేక్ అద్దింది. లిప్‌స్టిక్ పూసింది. మెడలో నెక్లెస్ మెరుస్తోంది. అలా నడుమ నడుమ చూస్తుండిపోయాడు. మరో అరగంట తర్వాత ఓ ఇంటిలోకి ప్రవేశించింది.

కారు గ్యారేజ్‌లో పెట్టి "రండి'' అంది.

ఇల్లు చాలా విశాలంగా ఉంది. ఖరీదుగా ఉంది. ఇది స్వంతమా, అద్దెదా అనుకున్నాడు. బయట లాన్‌ని అందంగా తీర్చిదిద్దుతున్నారు. ఇంత డబ్బు ఉండి ఈ రకమైన జీవితం ఎందుకో అర్థంకాలేదు.

"పూజా... ఇల్లు చాలా బాగుంది''

"రెంట్ కూడా బాగానే ఉంటుంది''

"నీకు స్వంత ఇల్లు లేదా?"

ఆమె నవ్వింది.

"ఓ ఇంటిదాన్ని కాలేదుగా. అదే కోరుకుంటే ఓ చిన్న అద్దెకొంప. వెయ్యి రూపాయల జీతం తెచ్చే మొగుడు... పిల్లలూ, రోగాలు... అలాంటిదేంలేదు కాబట్టే ఈ రాజ భవనాలూ కార్లూ, నౌకర్లూ''

ఆమె లోపలకు తీసుకువెళ్ళి తన గది చూపించింది. ఆ గోడలమీద నలుపు తెలుపుల్లో పూజ చిత్రం గీసి ఉంది. అందులోనూ గదిలోని లైటు వెలుతురులో మహా కాంతివంతంగా కళాత్మకంగా మెరిసిపోతోంది.

"ఎవరా చిత్రకారుడు?" అన్నాడు రవీంద్ర.

"సమీర్... బెంగాలీ''

"ఎలా పరిచయం?" అన్నాడు.

ఆమె నవ్వుతూ చెప్పింది. "రవీంద్రా పిల్లాడిలా మాట్లాడుతుంటారు''

"నిజమే'' అంగీకరించాడు.

"ఇక్కడ ఆర్ట్ ఎగ్జిబిషన్ ఏర్పాటు చేశాడు. మొత్తం ఓ పది రోజులు. ఎక్కువగా మోడ్రన్ ఆర్ట్ వేస్తుంటాడు. అతను వేసిన ఒక్కో చిత్రం ఖరీదు ఎంతో తెలుసా? నలభైవేలనుండి లక్ష రూపాయలదాకా. ఒక్క రాత్రిమాత్రం నాతో ఉన్నాడు. తనూ చిన్నపిల్లాడే. నాతో వచ్చేయకూడదూ అన్నాడు. కాకపోతే నా ఒక్కడికోసమే జీవించూ అనలేదనుకో'

రవీంద్ర సిగ్గుతో తల వంచుకున్నాడు.

"గొప్ప ఆర్టిస్ట్. వచ్చిన దగ్గర్నుండి డిమ్ లైట్ వెలుతుర్లో కూర్చోబెట్టాడు. అప్పటికప్పుడు బ్రష్ అందుకున్నాడు. .నీ ముఖానికి రంగులు అవసరంలేదన్నాడు. అలా నేను కూర్చుని ఉంటే చాలాసేపు కుంచెతో నా చిత్రాన్ని రూపుదిద్దాడు. దానినే నాకు కానుకగా ఇచ్చాడు. నిజానికి లక్ష రూపాయలు ఇచ్చినా అతను ఇలాంటిది గీయడేమో. ఆ స్పందన రావాలికదా!"



"అదిసరే. ఇదో మాస్టర్ పీస్''

"అవును. అందుకే నా గదిలో దాచుకున్నాను. ఈ గదిలోకి ఎవరికీ ప్రవేశం లేదు. మీకు చూపించాలనిపించింది. పదండి వెళ్దాం"

"పూజా నాకీ గదినుండి కదలాలనిపించటంలేదు. ఈ బొమ్మని చూస్తూ జీవితాంతం గడిపేయాలనుంది''

"రవీంద్రా... బీ ప్రాక్టికల్. నాకా పేరెందుకో ఇష్టం. నాకు ఆయన గీతాంజలి అంటే ఇష్టం. ఎన్నిసార్లు చదివినా ప్రతిసారీ ఓ కొత్త అనుభవం. అంతేకాదు ఆయన అద్భుతమైన ప్రేమలేఖలు రాశారు. మీరు చదివారా?"

"లేదు'' అన్నాడు తలూపుతూ.

"ఆయన పేరయితే పెట్టుకున్నారు. ఆ పొయిటిక్‌వేలోకి మీరు రాలేకపోయారు. మీ జీవితంలో చాలా మిస్సవుతున్నారు'' నవ్వింది.

ఆమెనే చూస్తున్నాడు.

"ఎప్పుడైనా ఎవరికైనా ప్రేమలేఖ రాశారా?"

"లేదు''

"కనీసం మీ భార్యకి''

"ఊహూం..."

"మీ పాపకి... లేదా బాబుకి''

"లేదు పూజా... లేదు''

"పోనీ మీకు ఎవరినుండైనా వచ్చిందా?"

తల వంచుకున్నాడు.

"సమీర్ ఏమంటాడో తెలుసా... నన్ను తనతో వచ్చేయమన్నాడు. జస్ట్‌ఫర్ ఆర్ట్ సేక్. నన్ను తనతో కలిసి కొండల్లో, గుట్టల్లో, అరణ్యాల్లో తిప్పుతానన్నాడు. ప్రతిచోటా ఏదో భంగిమలో నేను స్తంభించాలి. ఓ కొత్తకోణంలో నన్ను చిత్రించటం మొదలుపెడతాడు. అలా సముద్రాలవెంటా, నగరాలవెంటా వెన్నెలరాత్రుల్లో అతను కుంచెయిపోతాడు. అలాంటి గొప్ప ఆర్టిస్ట్‌ని నేను కాదని తిరస్కరించాను. ఎందుకో తెలుసా?"

అయోమయంగా చూశాడు.

"ఇంతకూ సమీర్ బొమ్మ బాగుందా? నేను బాగున్నానా?"

అప్పటికీ మాట్లాడలేదు.

"రవీంద్రా మీరు చెప్పలేరు. నాకంటే నా బొమ్మ అద్భుతంగా ఉంటుంది. ఆ విషయం నాకు తెలుసు. అతను ఎంత గొప్ప ఆర్టిస్టయినా అతను నీలాంటి పిల్లవాడు కాదుగా'' అంది.

"అంటే'' అన్నాడు.

"నువ్వు నాకు అచ్చంగా కావాలన్నావు రెండోది నేనసలు ఉమనైజర్‌ని కాదన్నావ్. నిజం చెప్పు''

"కేవలం ఒక్కసారి మాత్రమే పూజా... నన్ను నమ్ము''

పూజ మనోహరంగా నవ్వింది.

"అందుకే నువ్వు నచ్చావ్. ఆ స్వార్థమూ, ఆ అబద్ధం కూడా నాకు నచ్చాయి. సమీర్ వెంట వెళ్లాలంటే నాకూ అతని కళంటే పిచ్చి వుండాలి కేవలం ఒకరినొకరు ప్రేమించుకోవటం కాకుండా ఆ కళను ప్రేమించగలిగితే అతనితో జీవితం బాగుంటుంది. లేకపోతే ఒకేచోట ముద్దగా నల్లరంగు పూస్తే ఎంత భయంకరంగా ఉంటుందో అంత భీభత్సంగా ఉంటుంది''

రవీంద్రకి భయం కలిగింది. ఇలాంటి మాటలు తనింతవరకూ వినలేదు. రెండవది తనకంటె వసుంధరకి ఎన్ని తెలివితేటలున్నా హైదరాబాద్‌లో వెలుగు చూడలేదు. అయినా కూడా వసుంధర తన భార్య. తనకు లోబడి వుంటుంది. కానీ పూజ అలా కాదు. స్వతంత్రురాలు. స్వతంత్రంగా ఉండే ఏ స్త్రీ అయినా పురుషుడికి భయాన్ని కలిగిస్తుందా అనుకున్నాడు.

"నన్ను భరించటం నీవల్ల కాదు రవీంద్రా'' అనే మాటలు గుర్తొచ్చాయి.

అది నిజమే. తను ఇంజనీర్ కావటానికి,




కష్టపడ్డాడు. ఎప్పుడూ ఏవో లెక్కల్లో మునిగి పోయేవాడు. నలుగురు కలిసినప్పుడు కూడా అదే సంభాషణ. ఇంత జీవితం ఉందని తెలియదు. ఇంకా ఈ చేపల చెరువులూ, భార్యా, పిల్లవాడూ ఎవరితో పనిలేకుండా ఈమె చెంతన కూర్చుని తననే చూస్తుంటే రోజంతా, సంవత్సరాలూ గడిచిపోవాలి. కానీ అంగీకరించదుకదా!

"ఇంతకూ ఆ రాత్రి సమీర్ ఏం చేశాడో తెలుసా? కళ్లు వాలిపోతుండగా నా మీదకు వాలిపోయి పెదవులమీద మృదువుగా చుంబించి అలా కార్పెట్‌మీదకి వాలిపోయాడు. ఇంకో విషయం తెలుసా? సమీర్‌కి పెళ్లికాలేదు. అతను చేసుకోపోతేనే బాగుంటుంది''

"ఆ రాత్రి ఆ దృశ్యం మరో చిత్రకారుడెవరైనా చూసుంటే ఇంకో గొప్పచిత్రం గీసి వుండేవాడు. వెన్నెలని తలపించే వెలుతురు గదిలో... స్టాండ్‌లో బిగించిన ఫ్రేమ్‌లోపల ఓ స్త్రీ, కింది కార్పెట్‌మీది నిద్రిస్తున్న చిత్రకారుడు. ఎలా ఉంటుందంటావ్'

"నాదగ్గర నీ అంత భాష లేదు. ఒక్కముక్కలో మహాద్భుతం అనిమాత్రం చెప్పగలను'' అన్నాడు రవీంద్ర.

"మీరు డ్రింక్స్ తీసుకుంటారా?"

"వద్దు. నీ మాటలిస్తున్న కిక్స్ చాలు''

"కిక్సా...?" అంది.

"అవును. ఇన్ని సంవత్సరాలు ఎంత అనుభూతి రాహిత్యంతో బతికావ్ అంటున్నాయి నీ మాటలు. అసలు నీలాంటి స్త్రీ ఉంటే ఇంక మధువుతో ఏ పురుషుడికీ అవసరం రాదు. ఇంతకూ ఇంత గొప్ప వ్యక్తివి... ఇలాంటి జీవితంలోకి ఎలా...?" ఆగిపోయాడు.

"ఎంత గొప్ప వ్యక్తిని'' అంది చిలిపిగా.

"అది నీకు తెలియదు''

"నాకు తెలుసు రవీంద్రా మహాకళాకారులనుండి మామూలు బిజినెస్ పీపుల్‌వరకూ నాకు తెలుసు. అందరిలోనూ ఉండవలసినదానికంటే ఎక్కువ ఉంది''

"ఏమిటది?" అన్నాడు.

"మొదటిది డబ్బు. రెండవది ఆర్ట్'

"ఆర్ట్ కూడానా?"

"అవును. ఏది ఎక్కువైనా ప్రమాదమే. పెర్వెర్షన్ వస్తుంది. నాలోను ఏదో ఎక్కువ ఉంది. అందుకే ఇలా అయ్యాను. అంతకంటే వివరాలు తెలుసుకోవటంవల్ల సుఖం లభించదు. అంతకుమించి రవీంద్ర రచయితగానీ, కవిగానీ కాదుకదా!"

"అందుకే ఇప్పుడు బాధగా ఉంది''

"బాధపడకు. ఈ ప్రపంచం నాలాంటివారిని బిచ్ అంటుంది. ఆ కొద్ది గంటలూ జ్వరపీడితుడిలా ప్రేలాపనలు. తిరిగి జీవితంలోకి వెళ్లగానే ఇంకోరకంగా. అందుకే నేను పురుషుణ్ణి నమ్మను. నీవేకాదు. చాలా మంది అడిగేమాట అదే. నాతో ఉండిపోకూడదూ అని. ఒక్క స్త్రీనేకాదు. డబ్బూ, అధికారం వారితోనే ఉండిపోవాలనుకుంటారు. అది ఎలా సాధ్యం... సరే అన్నీ కబుర్లే. రండి కనీసం కూల్‌డ్రింక్ తీసుకుందాం"

ఆమె వెంట నడిచాడు. ఆమె చేతులమీదుగా అమృతం అందుకున్నాడు.

"పూజా నన్నీ రాత్రికి ఈ ఇంటినుంచి పంపించేయవుకదా!"

"ఎందుకంత భయం?"

"ఈ ఇంటిలో ఒక్కదానివి ఎలా ఉండగలుగుతున్నావ్?"

"నాతో ఓ విడో ఉంటుంది. ఆమె ఈ రోజు లేదు. అయినా నాకు భయం లేదు. నేను పురుషప్రపంచం నడుమ జీవిస్తున్నాను''

"పూజా నిన్ను తాకాలంటే భయంగా ఉంది''

"ఎందుకు?"

"కాలిపోతానేమోనని''

"పిచ్చివాడా, నన్ను దేవతలా చూడకు. ఓ రాత్రికి ఖరీదు కట్టిన ఆడదానిలా చూడు. అప్పుడు అధికారం వస్తుంది''

"నావల్ల కాదు''

"అయితే ఇక్కడెందుకు?"

"ఈ రాత్రికి నీచెంతనే పడుకుంటాను''

"ప్రమాదం" అంది నవ్వుతూ.

మరోగంట తర్వాత భోజనం చేశారు. అందులోనూ ఆమె కళ కనిపించింది. ఆమె మీద చేతులు వేసుకొని హాయిగా నిద్రపోయాడు. కొద్దిసేపటి తర్వాత లేచి చూసింది. ఎందుకో అతన్ని ముద్దాడాలనిపించింది. అతని నుదిటిమీద ముద్దుపెట్టింది.

రవీంద్ర ముఖం చిట్లించాడు తనకు తెలియకుండానే.

తెల్లవారింది.

పక్షులు అరుస్తున్నాయి. రవీంద్రకి అకస్మాత్తుగా మెలకువ వచ్చింది. ఉలిక్కిపడి లేచాడు. పక్కన పూజ లేదు.

"ఆమె నైటీతో తోటలో తిరుగుతోంది. ఆమె చేతిలో ఏదో పుస్తకం ఉంది. ఎందుకో తన శ్రీమతి గుర్తుకొచ్చింది.

ఆమె చదివే పుస్తకాలు వేరుగా ఉంటాయని గుర్తుకొచ్చింది. అసలు తనిలా రావటం తెలిస్తే ఆమె ఏమనుకుంటుందో అనిపించింది.

పూజ పుస్తకంలోంచి తలెత్తింది. రవీంద్ర కనిపించాడు.

ఆమె చిరునవ్వుతో నడిచివచ్చింది.

"అప్పుడే లేచారా?" అంది.

మరో రెండుగంటలు దొర్లిపోయాయి.

బయలుదేరేముందు కొంచెం సందేహించాడు.

ఎలాగో ధైర్యం చేసి ఆమె చేతికి పర్స్ అందించాడు.

"ఏమిటిది?" .

"పర్స్... అందులో డబ్బుంది. నీకు ఎంతకావాలనుకుంటే అంత తీసుకో. మొత్తం కావాలన్నా ఉంచుకో. నాకేం అభ్యంతరం లేదు''

"ఏమాత్రం ఉంటుందేమిటి?"

"చూస్తే తెలుస్తుందిగా. అయితే నువ్వన్నట్లుగా నేను చిన్నవాడ్నే''

ఆమె పర్స్ అందించింది.

"ఎందుకిలా?"

"రవీంద్రా... నాకూ సాయంకాలాలు గడవాలి. నేను చెప్పిందంతా బుద్ధిమంతుడిలా విన్నావ్. ఇంకో ముక్కలో నన్ను తాకటానికి భయపడ్డావ్. నువ్వు నా స్నేహితుడివి మాత్రమే. అందుకే నీతో గడిపిన క్షణాలకు ఖరీదు కట్టలేను''

"ఎప్పుడూనా?"

"అది చెప్పటానికి నేనెవర్ని?"

"పూజా! జీవితంలో నన్ను కరుణించు. ఈ ప్రపంచాన్ని తృణప్రాయంగా వదులుకొని నీదగ్గరకొస్తాను''

"బయలుదేరదాం" అంది.

కారులో తిరిగి ప్రయాణం. పూజను చూడాలనిపించలేదు. ఆ చిత్రం గుర్తొచ్చింది. తన రూపం మనసులో ముద్రించుకున్నాడు. హోటల్ ఇవతల కారు ఆగింది.

"మళ్లీ నీ దర్శనభాగ్యం ఎప్పుడో' అన్నాడు.

"అది చెప్పడానికి మనమెవరం?"

"నీ ఆతిథ్యానికి ధన్యవాదాలు''

ఆమె నవ్వింది. తలుపు మూసుకుంది. కారు ముందుకు కదిలి వేగం అందుకొంది. కనిపించినంతమేరా చూస్తూండిపోయాడు. ఎప్పటికో అక్కడినుండి కదిలాడు. తిరిగి కర్తవ్యం గుర్తుకువచ్చింది. గదికి వెళ్లాడు. గదిలో విడిచిన బట్టలు సర్దాడు. సూట్‌కేస్‌లో పెట్టి రెడీ చేశాక టైమ్ చూసుకున్నాడు. ఆసరికి మాధవరావుగారు ఆఫీస్‌కి వచ్చి




వుంటారు.

బయటకు వచ్చాడు. ఆఫీస్‌లో మాధవరావుగారిని విష్ చేశాక, ఇతర మిత్రుల్తో మాట్లాడుతూ కూర్చున్నాడు. లంచ్‌టైం అయింది. మాధవరావుగారు వచ్చి

"ఇంక వెళ్దాం" అన్నాక బయలుదేరారు.

ఇంటిదగ్గర చాలారకాల వంటకాలు చేయించాడాయన.

"ఇన్ని రకాలు ఎందుకండి. అనవసరంగా శ్రమ తీసుకున్నారు''

"ఇందులో శ్రమేం ఉందిలెండి'' అందామె.

"మీరందరూ ఓసారి మా చెరువుల దగ్గరికి రావాలి. నేను కారు ఎరేంజ్ చేస్తాను. పిల్లలూ మీరూ రావాలి'' అన్నాడు రవీంద్ర.

"మీతోపాటు ఆవిడ కూడా వస్తే బాగుండేది'' అందామె.

"నేను రమ్మన్నాను. తనకి ఇష్టంలేదు. ఇల్లు అమ్మటంకదా!"

"అవును... బాధగా ఉంటుందిలెండి''

భోజనాలు పూర్తయ్యాక కిళ్లీ ఇచ్చాడు.

"ఇది కూడానా?" అన్నాడు రవీంద్ర.

అప్పుడు జేబులోనుండి పాకెట్ తీశాడు.

"ఏమిటండి?" అడిగాడాయన

"నిన్న రింగ్ కొన్నానండి... చూడండి'' అన్నాడు.

"ఎక్కడ కొన్నారు? ముందుగా చెబితే మనకు తెలిసినవారున్నారుగా''

"బిల్ ఉంది చూడండి''

"అది జాగ్రత్తండి బాబూ. రేపు ఇది మంచి బంగారం కాదనుకోండి. అడిగితే మాదగ్గర కొన్నావని నమ్మకం ఏమిటంటాడు?" అన్నాడాయన.

"అందుకే బిల్ కూడా తెచ్చాను''

ఆయన ఉంగరం తీసి చూశాడు. "ఇలా రావోయ్'' అంటూ పిలిచాడు. ఆమె రాగానే అందించి "ఎలా ఉందో చెప్పు'' అన్నాడు.

"చాలా బాగుందండి'' అందామె.

తిరిగి అది పెట్టెలో పెట్టి అందించబోతే రవీంద్ర ఆయన వేలికి తొడిగాడు.

"ఇదేమిటండీ బాబూ'' అన్నాడు కంగారుగా.

"ఏమీలేదు. మీదగ్గర నా గుర్తు వదిలి వెళ్ళాలనుకున్నాను. ఈ రింగ్‌ని చూసినప్పుడల్లా నేను గుర్తుకు వస్తాను''

"భలేవారే! ఇది లేకపోయినా మీరు గుర్తొస్తారు. అందులో ఎలాంటి సందేహం పెట్టుకోకండి''

"ఆ సంగతి నాకు తెలుసు. నా తృప్తి కోసం"



"అలాంటప్పుడు ఏ చిన్నవస్తువో ఇవ్వాలి. అంతేగాని ఇంతింత ఖరీదైన కానుకలు కాదు''

"అమ్మా నువ్వన్నా చెప్పు. ఇది ప్రేమతో ఇస్తున్నది. కాదనకూడదు''

"ఎందుకండీ'' అందామె మొహమా

టంగా.

"చూడండి మాధవరావుగారూ! ఇంక నాకు బాధ కలుగుతుంది. మీకది ఇష్టం అయితే ఇవ్వండి'' అన్నాడు.

"సరే కానీండి'' అన్నాడు ఇంకేం చేయలే నట్లుగా.

సాయంకాలం హైదరాబాద్‌నుండి వె ళ్తుంటే అనిపించింది.

'ఈ నగరంతో అనుబంధం తీరినట్లేనా?'

★ ★ ★

ముందు చెరువులు చూసుకోవాలి. ఇన్ని రోజులుగా అవి ఎలా ఉన్నాయో, ఏమైనా జరిగిందేమో అనుకుంటూ రవీంద్ర వెళ్తుంటే ఎవరో పిలిచినట్లనిపించింది. బండి స్లో చేశా డు. వెనక్కి చూస్తే చేతులూపుతున్నాడు రామచంద్రరావు. ఆయనదగ్గరకెళ్లాడు.

"ఏం బాబూ బాగున్నావా?" అన్నాడు.

"బాగానే ఉన్నాను''

"చెరువులెలా వున్నాయి?"

"నాలుగు రోజులుగా లేను. హైదరా బాద్‌లో ఉన్నాను''

"నేను కూడా అక్కడే ఉన్నాను. ఏంటి పని?"

"చిన్న పనుండి వెళ్లాను. మీరేంటి ఇక్క డున్నారు?"

"నీకేమైనా అర్జెంట్ పనుందా?" అన్నాడా యన.

"లేదు... చెరువులదగ్గరకెళ్తున్నా?" అన్నా డు.

"ఏంలేదు. ఓ అరగంట కూర్చుని మాట్లా డుకుందాం. ప్రపంచంలో ఏం జరుగుతోందో మనం తెలుసుకోవాలిగా!" అన్నాడు.

"ఎక్కడ కూర్చుందాం? ఇంటికి వెళ్దా మా?"

"ఇంటికెందుకబ్బాయ్? ఏ కాఫీహోటా ల్లోనో కూర్చుందాం"

"రండి'' అన్నాడు.

ఓ హోటల్‌ముందు ఆగింది బండి. రామ చంద్రరావుని తీసుకొని ఏ.సి. గదిలోకి వెళ్లా డు.

"టిఫిన్ చేస్తారా?"

"లైట్‌గా తీసుకుందాం" అన్నాడు.

బేరర్‌కి ఆర్డరిచ్చాడు.

అప్పుడు ఆరంభించాడు రామచంద్రరావు.

"ఇక్కడికి దగ్గర్లో చిన్న గొడవ వచ్చిప డిందబ్బాయ్. ఆ పనిమీద వచ్చాను. అవ సరం అనుకుంటే హైదరాబాద్ వెళ్లి రావాల నుకుంటున్నాం. నీకు తెలుసుగా. మన రోడ్ల న్నీ ఎందుకూ పనికిరాకుండాపోయాయి. అందుకని ఆ గూడెంలో ప్రెసిడెంటూ అంద రూ సమావేశం అయ్యారు. గవర్నమెంటు దగ్గర డబ్బు లేదు. ఈ రోడ్లు ఎప్పుడు బాగుపడతాయో తెలియదు. ముందు జనాని కి ఇబ్బంది. వ్యాపారానికి ఇబ్బంది. అందు కని ఆ రోడ్డేదో మనమే వేసుకుందాం అనుకు న్నారు. కొంత విరాళాలు కూడా వసూల య్యాయి. మొత్తంమీద పెద్ద గోతులన్నీ పూడ్పించారు. ఎర్రమట్టి చల్లించారు. ఇదివర కటిమీద ఇప్పుడు ఫర్వాలేదు. అయితే ఎంత సేపు. గట్టిగా ఓ అరగంట వానలు కురిస్తే మళ్లా మామూలే. ఇదంతా ఓపక్కననుకో'' అని ఆగాడు.

"మంచిపనే చేస్తున్నారుకదా'' అన్నాడు.

"సాంతం విను. ఇంకా ఆ రోడ్డుకోసం చేపల లారీలనుండి రైతులనుండి కొంత డబ్బు వసూలు చేస్తున్నారు. కొంతమందికి ఇది గిట్టలేదు. పోలీసు కంప్లైయింట్ ఇచ్చా రు. సి.ఐ. వచ్చి మొత్తాన్ని అరెస్ట్ చేసుకొచ్చా డు''

"ఇదొకటా'' అన్నాడు రవీంద్ర.

"అవునుమరి. గ్రామం సంగతి ఎవడికి పట్టింది బాబూ. అన్నీ రాజకీయాలు. ప్రె సిడెంటుది ఓ పార్టీ. ఆయన మంచిపనులు




...స్తుంటే ఎదుటోడి కడుపు మండుతుందిక దా. వాడు చేసేపని వాడు చేస్తాడు. సి.ఐ.గా రు ఏం చేస్తాడు. అలా వసూలు చేయకూడ దంటాడు. గోతులు పడితే ఆయనకేంటి? మనుషులు పోతే ఆయనకేంటి చెప్పు''

"ఇప్పుడేమయింది?" అన్నాడు కుతూహ లంగా.

"ఏమయ్యేదేముంది? మొత్తం జనం లారీ ల్లో బయలుదేరి వచ్చారు. అప్పటికప్పుడు టెంట్లు వేశారు. పోలీస్ స్టేషన్‌ముందు కూర్చున్నారు. పేపర్ చూడలేదా? స్టేట్ మెంట్ వచ్చిందికదా! జిల్లా నాయకులొచ్చా రు. ముందు యస్.పీ.నుండి డి.ఐ.జిదాకా ప్రయత్నం చేస్తున్నాం. అంతా గందరగో ళంగా వుంది''

"విడిచిపెట్టరా?"

"ఎందుకు విడిచిపెట్టరు. బెయిల్ తీసు కుంటాం. అదికాదుగా. ఈ పనిని రాజకీ యంగా ఉపయోగించుకుంటే మనం చూస్తూ కూర్చోలేంకదా! అందులోనూ ప్రెసిడెంటు మనాడు. ముందిక్కడ అయితే కలెక్టరేట్ దగ్గర టెంట్ వేయాలనుకుంటున్నాం. ముందు రోడ్డు వేయిస్తారా లేదా అనేది తేల్చుకోవాలికదా!"

"బలవంతంగా వసూలు చేశారా ఏమిటి?"

"బలవంతం లేకుండా డబ్బులు ఎలా వసూలవుతాయి? ఆ నక్సలైట్లు చూడు. అన్ని ఆయుధాలు కొనుక్కుంటున్నారంటే డబ్బులు ఎక్కడినుండి వస్తున్నాయను కుంటున్నా. బాబూ మాకు చందా ఇవ్వండి అంటే ఇస్తారా? కబురు చేస్తారు. నువ్వు ఇంత ఇవ్వాలి అని చెబుతారు. అంతగా అయితే కొంత తగ్గించుకుంటారు. వాళ్లు అడిగితే ఎవడన్నా కాదంటాడేమో చూడు. వెయ్యి అడిగితే వందన్నా ఇవ్వాల్సిందే. అలా లేక పోతే పార్టీలు నడవ్వు. ఇంకా మిగతా పార్టీ లంటావా రేపు వారితో చేయించుకోవాల్సిన పనులుంటాయి కాబట్టి ఇస్తారు. రోడ్డు బాగు చేయిస్తున్నాం అంటే ఎవడో క్రాక్ ఉంటాడు. మీకేమిటి అవసరం అంటాడు. మీరు గవర్న మెంటా అంటాడు. కుర్రాడెవడన్నా కోపంగా మాట్లాడితే తగాదా. నేనివ్వను ఏంచేస్తావో చేసుకో అంటాడు. అక్కడినుండి గొడవలు''

"అదొక్కటే కాదులెండి. ఇలాంటి విషయా ల్లో నలుగురూ ఓ మాటనుకుని చేయాలి. ప్రెసిడెంటుగారో ఇంకోరో అనుకుని చేస్తే మిగ తావారికి బాధగానే ఉంటుంది. రెండోది ఎంత వసూలవుతుందో, ఎంత ఖర్చు చేస్తు న్నారో లెక్కలు ఉండాలికదా'' అన్నాడు.

"అదీ నిజమేలే'' అన్నాడు రామ చంద్రరావు.

"ఇదో పెద్ద తలనొప్పి అయిపోయింది. పండగ వస్తుందంటే చాలు. దారి పొడుగునా డబ్బాలు పట్టుకొని ఆపుతుంటారు. చిన్నచి న్న పిల్లలనుండి పెద్దవారిదాకా. అందులో ఎంత ఖర్చు పెడతారో, ఎంత వాడుకుంటారో ఆ భగవంతుడికి తెలియాలి. ఎంత చిరాకుగా ఉంటుందంటే మంచిపని ఎవరు చేస్తున్నారో అర్థంకాదు. తీరా చూస్తే అలాంటివారు వచ్చి నా మనకు ఇవ్వాలనిపించదు''

"అవునబ్బాయ్! ఈ చందా సంస్కృతిని అధికారపార్టీనుంచి అందరూ అందుకున్నా రు. సరే... రాజకీయాల్లో తిరుగుతున్నాంక దా! అన్ని పనులూ మనవే. అదీ విషయం. ఇంక నీ సంగతులేమిటి?"

"ఏముందండి... ఆ చేపలకు మేతలు వేయించుకోవటం, చెరువులమీద పను లుంటే చేయించుకోవటం. ఇంతకుమించి పనులేం ఉంటాయి చెప్పండి''

"అలా కాదు బాబూ! మీలాంటి కుర్రాళ్లు అలా సంతృప్తి పడితే లాభంలేదు. రాజకీయా ల్లోకి రావాలి''

"మనకెందుకు సార్! అదంతా ఓ రొచ్చు గుంట"

"చాలా పొరపాటు పడుతున్నావు. ఈరోజు అన్ని వ్యాపారాలకంటే లాభసాటి వ్యాపారం



ఇదే. వెధవ ఎం.ఎల్.ఏ. భయంకరంగా సంపాదిస్తుంటే! అయిదు సంవత్సరాల్లో కనీసం ఏభైలక్షలు సంపాదించినవారున్నారు. నీకు తెలుసో తెలియదో మనోడే ఓ కుర్ర ఎం.ఎల్.ఏ ఉన్నాడు. చదువుకునే రోజుల్లో కమ్యూనిస్టు పార్టీల చుట్టూ తిరిగేవాడు. ఎప్పుడు దూకాడో తెలియదు. అధికార పార్టీ లోకి వచ్చాడు. ఎం.ఎల్.ఏ. అయిపోయాడు. ట్రాన్స్ఫర్లదగ్గరనుండి ప్రతిదానికీ రేటు. ఇంజనీర్లని పిలిపించి ఇంత పంపిస్తావా బదిలీ చేయించమంటావా అంటాడు. లేదా కంప్లయింట్ చేస్తానంటాడు. ఎంక్వయిరీ చేయిస్తానంటాడు. అంతే ఎంత డబ్బు పోగేసేడో''

"అది మనకి చేతకాదులెండి''

"ఈ రంగంలోకి వస్తే అదే చేతవుతుంది. అయినా డబ్బుకోసమే కాదబ్బాయ్. అధికారం ఓ మత్తులాంటిది. రోజూ ఎందరో వచ్చి కలుస్తుంటారు. పెద్దపెద్ద పరిచయాలు అవుతాయి. సభలకు పిలుస్తారు. సన్మానాలు చేస్తారు. ఇంక ఓపక్కనుండి తిడుతుంటారు. అవన్నీ ఉంటాయి. అయినా ఈరోజు ప్రతి కులంలోనూ నాయకులు డెవలప్ అవుతున్నారు. అలా కాకపోతే బతకటం కష్టం. నువ్వు చూడటానికి బాగుంటావు. నీ ముఖంలో యువనాయకుడి లక్షణాలున్నాయి. అందుచేత నేను చెప్పింది ఆలోచించు. ఓసారి హైదరాబాద్ వెళ్దాం. నీకు మినిస్టర్స్ని పరిచయం చేస్తాను. ఇంకా పెద్దవారందరినీ. అయిదు సంవత్సరాలు తిరిగేసరికి నువ్వు నాయకుడివవుతావు. ఆ తర్వాత నీ అదృష్టం కలిసిరావాలి. రాజకీయ చతురత ఉండాలి''

రవీంద్ర నవ్వాడు.

"నవ్వకు బాబూ! ఈరోజున దేశంలో పరిస్థితి ఎలా ఉందంటే నువ్వు ముఖ్యమంత్రివి కావచ్చు. ప్రధానమంత్రివి కూడా కావచ్చు. ఇందులో ఏదీ అసాధ్యంకాదు. అదిమాత్రం గుర్తుంచుకో''

కాఫీ కూడా తాగాక రవీంద్ర బిల్ పేచేశాడు.

"రెండురోజులుంటారా?''

"ఏమో! ఇంకొంచెంసేపట్లో కారు తెచ్చి పద అంటే వెళ్లాలి. నీకెందుకు చెబుతున్నానంటే విషయాలు తెలుసుకోవాలి. ఈ ప్రపంచంతో నాకేం సంబంధంలేదంటూ కూర్చుంటే కుదరదు. అంతదాకా ఎందుకయ్యా రేపు చేపలకి ధర పడిపోయింది. అయ్యో అంటూ కూర్చోకూడదు. గవర్నమెంటు కొని జనానికి తినిపించాలని ఏజిటేషన్ చెయ్యాలి. నువ్వొక్కడివే చేస్తావా? అప్పుడు మాలాంటివాళ్లు కావాలి. దాహమయినప్పుడు గొయ్యి తవ్వటం కాదు. వస్తా'' అన్నాడు లేచి!

ఇద్దరూ బయటకొచ్చారు.

రామచంద్రరావు ఓ రిక్షా పిలిచి ... ఎక్కాడు. రవీంద్రకి అదే ఆశ్చర్యం. ఆయన విమానాల్లో ప్రయాణం చేయగలడు. అవసరమైతే నడుచుకుంటూ వెళ్లగలడు. ఎవరినన్నా అరిచి దబాయించగలడు. బాబ్బాబు అని సముదాయించగలడు. ఈ పనులన్నీ చేయటం చేతయితేనే ఆ రంగం. ఇంతకూ తనని రమ్మంటాడేమిటి... ఆయనకెందుకలా అనిపించింది? చదువుకునే రోజులనుండి కూడా రాజకీయాలకు దూరంగానే ఉంటూ వచ్చాడతను. ఏమో... రేపేం జరుగుతుందో ఎవరు చెప్పగలరు అనుకున్నాడు.

చెరువు దగ్గరికి వెళ్లి నారాయణని వెంటపెట్టుకొని చుట్టూ తిరిగాడు. మేత ఎలా ఉందో పరిశీలించాడు. కొద్దిసేపు చెరువులకేసి చూస్తూ నిలబడ్డాడు. అప్పుడప్పుడు చేపలు పైకి ఎగురుతున్నాయి. ఇదివరకయితే ఆ ఆనందం వేరు. రెండుమూడుసార్లు సరదాగా గేలాలు తీసుకొని చేపలు పట్టుకోవటానికి వెళ్లారు. అలా నీటిలోకి గేలంవేసి ఎదురుచూడటం... బెండు మునుగుతున్నప్పుడు కంగారుగా లాగడం అన్నీ గుర్తుకువచ్చాయి.

ఓసారిమాత్రం గేలానికి ఓ మోస్తరు చేప




పడింది. అప్పుడు కలిగిన ఆనందం ఇప్పటికి గుర్తుంది. ఇప్పుడు లారీలకు లారీలు పట్టుకున్నా ఆ ఆనందం కలగదు. అవన్నీ కంగారుగా ఎగురుతుంటే చూడటానికి ఆ దృశ్యం బాగుంటుంది. అంతే.

"నారాయణా'' అని పిల్చాడు.

చేస్తున్న పనాపి వచ్చాడు.

"ఊర్లో ఇంకా విశేషాలు ఏమిటి?"

"మామూలేనండి. రాజారావుగారి ముఠా చేపలు పట్టాలనుకుంటున్నారండి''

"గొడవలేం లేవుగా!"

"షావుకారిగారి గొడవేనండి. అదింకా నడుస్తూనేవుందండి''

"జాగ్రత్తగా చూస్తున్నావా?"

"అయ్యబాబోయ్! ఎంత మాటండి!"

"ఏంలేదు. రోజులు బాగుండలా. చేప పెరుగుదల ఎలా ఉందో చూస్తున్నావా?"

"బాగుందండి''

"మరేమిటి ఈసారి ఎప్పుడు పట్టుబడి?"

"మీరెప్పుడంటే అప్పుడండి బాబూ'' అన్నాడు.

"చూద్దాం... ముందు మార్కెట్ ఎలా ఉందో కనుక్కుందాం. మనకింకా టైముంది కదా!" అన్నాడు.

తిరిగి ఇంటికి వచ్చేసరికి వసుంధర లేదు. ఆరోజు దగ్గర్నుండి తన దగ్గర ఓ తాళంచెవి ఉంచుకుంటున్నాడు. తను ఏదో ఒక పనిలో ఉంటుంది. ఇంటి ఓనర్‌గారి భార్యకి ఎప్పుడూ ఏదో పని. దాంతోపాటు వసుంధరకి కూడా. ఆ విషయంలో ఇంక తను కల్పించుకోదలచలేదు.

ముందు ఆ డబ్బుని ఏం చేయాలా అనేది నిర్ణయించుకోలేకపోయాడు. ఇంతవరకూ వసుంధర షేర్ల గురించి అడగలేదు. అది ఈరోజు కనుక్కుంటే బాగుంటుంది అనుకున్నాడు.

స్నానం చేశాడు. గోడమీద సంకేత్ ఫొటో చూడగానే అనుకున్నాడు - 'ఏమిటో వీడి నుంచి ఉత్తరమే రాలేదు. తను కూడా మమ్మల్ని మరిచిపోతున్నాడేమో!'

ఎందుకో అనుమానం వచ్చింది. పరుపు పైకెత్తాడు.

అక్కడో ఉత్తరం ఉంది. సంకేత్ రాసిందే.

'ఈ మనిషికి మరీ తలకాయ లేకుండాపోతోంది. ఉత్తరం విషయం కూడా చెప్పటంలేదు' అనుకుంటూ తెరిచాడు.

మామూలే. అందులో ఏ విశేషాలూ లేవు. సంకేత్‌ని తలుచుకుంటే చాలా ఆశ్చర్యం కలిగింది. వీడిలో మార్పు రాదా అనుకున్నాడు. దేశంలో అనేకచోట్లనుండి అక్కడికి పిల్లలొస్తున్నారు. అందులో చిన్నపిల్లల దగ్గర్నుండి. తను మరీ చిన్నపిల్లవాడు కాదు. ఈపాటికి అలవాటైపోవాలి. ఇంకా అమ్మా, నాన్న కావాలంటే ఎలా అనుకున్నాడు. ఇంకో రెండునెలలుంటే ఇంటికి వస్తాడు. ఈలోగా ఓసారి చూసివస్తే బాగుంటుందా అనుకున్నాడు.

కొన్ని విషయాల్లో ఆ స్కూల్‌వారు చాలా కఠినంగా ఉంటారు. పదే పదే స్కూల్‌కి వచ్చి పిల్లల్ని చూడటానికి వారు అంగీకరించరు. అలాగే ఇంటిదగ్గరనుండి తిను బండారాలు వండిగాని, కొనిగాని పంపించకూడదు. ముందసలు వారికి అలాంటి అవసరం ఉండదు. వారికి ఇష్టమైనవన్నీ ఇస్తారు. చాక్లెట్లు, గుడ్లు, మాంసం, ఇలా ఏది కావాలంటే అది దొరుకుతుంది. చిక్కటి పాలు ఇస్తారు. ఆడుకోవటానికి పెద్ద మైదానం ఉంది. అందులో రకరకాల ఆటలు ఆడుకోవచ్చు. ఇంకో విషయం గురించి ఆలోచించుకునే తీరిక ఉండదు. అలాంటిది సంకేత్ రాజీపడలేకపోతున్నాడు.

ఈ లోపం తమదే. ఎప్పుడూ వాడిని తమతో ఉంచుకున్నారు. గారాబం చేశారు. అడిగినవన్నీ కొనిచ్చారు. ఇలా జరుగుతుందనే ఆలోచనే లేదు. ఏమైనా ఇప్పుడు చేయగలి

గింది లేదు అనుకున్నాడు. సంకేత్‌కి ఉత్తరం రాయాలనిపించింది. ఇన్‌లాండ్ కవర్ అందు కున్నాడు. ఏం రాయాలో తెలియదు. చాలా రాయాలనుకున్నాడు. కలం ముందుకు కదల టంలేదు. తర్వాత రాద్దాం అనుకున్నాడు.

బోర్‌గా ఉంది. పుస్తకాలు దొరుకుతాయే మోనని చూశాడు. ఎటు చూసినా వ్యాపార ప్రపంచమే. తనకు కావలసింది లేదు. టీ.వీ. ఆన్‌చేశాడు. దున్నపోతుల్లాంటి వస్తాదులు. ముఖాలకు చిత్రమైన రంగులున్నాయి. వారు బరిలోకి దిగారు. ఎందుకు కొట్టుకుంటున్నారో తెలియదు. దానికి చెందిన రూల్స్ ఏమిటో అర్థంకావటంలేదు. కిందపడేసి గాల్లోకి ఎగిరి తంతున్నాడు. రెండు చేతులూ గాల్లోకి లేపి కేరింతలు కొడుతుంటే వెనకనుండి ఎవరో వచ్చి ఓ తోపు తోశారు.

అమాంతం రోప్స్‌మీదపడి అదే ఊపుతో వెనక్కి వచ్చి వాడిని ఢీకొన్నాడు. కెవ్వున కేకలు... కేరింతలు... ఏం ఆనందమో తెలి యదు. ఏం సంస్కృతో తెలియదు. దృశ్యా లు చకచక మారుతున్నాయి. మోటార్‌సైకిళ్లని విల్లులా వంచి నడుపుతున్నారు. ఎవరో పడి పోయారు. రోడ్డుమీద జారిపోతున్నాడు. రేస్ ఆగటంలేదు. తిరిగి వస్తాదులు...

'పిచ్చి వెధవలు...' అనుకున్నాడు రవీంద్ర.

ఛానల్ మార్చాడు. పాటలు వస్తున్నాయి. మూడు పాటలకి మొహం మొత్తింది. అవే డ్రస్సులు... అడుగులు... నడుము ఊపటా లు... మనుషులే మారతారు. అదే ఊటీ... కాశ్మీరు... వెనకాల జూనియర్ ఆర్టిస్ట్‌లు...

'ఛ...' అనుకున్నాడు.

సరిగ్గా అప్పుడు వచ్చింది వసుంధర.

"ఎంతసేపయింది వచ్చి?"

"గంటయింది. తమరెక్కడికి వెళ్లారు"

"కొత్తరకం డిజైన్ వచ్చిందంటే వెళ్లాం. ఆవిడ చేయిస్తున్నారు. చాలా బాగుంది"

"నువ్వు కూడా ఆర్డరిచ్చావా?"

"లేదు. నాకు ఇంట్రస్ట్ లేదు. జస్ట్ ఆవిడతో వెళ్లాను. అన్నీ చూస్తాను. అంతే. ఉండండి డ్రెస్ ఛేంజ్ చేసుకొస్తా" అంటూ వెళ్లిపో యింది.

టీ.వీ. కట్టేశాడు. ఎక్కడికైనా వెళ్తేనో అనుకున్నాడు. క్లబ్బు గుర్తొచ్చింది.

'ఈరోజు పెద్ద స్టేకు ఆడితేనో!' అని పించింది.

క్లబ్బులో ముఖేష్ కలిశాడు.

"ఏంటి సార్ వస్తున్నారా రోజూ" అనడిగా డు.

"లేదు. ఓసారి మాత్రం వచ్చాను"

"వచ్చాయా, పోయాయా?"

"వెయ్యి రూపాయలు పోయాయి"

"అదేం పెద్ద ఎమౌంట్ కాదులెండి"

"అదిసరే. మార్కెట్ ఎలావుంది?"

"బాగానే ఉందండి. అయితే ఇదివరక టంత గొప్పగా లేదు. కానీ ఫర్వాలేదు"

"కారణం ఏమిటంటారు?" అన్నాడు రవీంద్ర.

"ఇదివరకటిమీద ప్రొడక్షన్ విపరీతంగా పెరిగింది. ఇంకా చెరువుల సంగతి చెప్పేదే ముంది? పిచ్చిపిచ్చిగా తవ్విపారేశారు. రోజూ మార్కెట్‌లోకి లారీలకు లారీలు వచ్చి పడుతుంటే రేటు తగ్గక ఏంచేస్తుంది?"

"ఇలా అయితే ముందుముందు ప్రాబ్లమ్ అవుతుందా?" అన్నాడు.

"ఏంకాదు. కాకపోతే కొత్తమార్కెట్ చూ సుకోవాలి. అంతదాకా ఎందుకు ఇంత ఉత్ప త్తి చేస్తున్నాం. మనవాడకం చాలా తక్కువ. ముందు జనానికి అలవాటు చేయాలి. బెంగా ల్‌వారికి చేప ఓ ట్రెడిషన్ లాంటిది. అస్సాం, మణిపూర్‌లాంటిచోట్లకి వెళ్లాలంటే ఓ ప్రా బ్లమ్. మార్కెట్ ట్రెండ్‌లో మార్పు వస్తే రిస్కయినా కొత్త మార్కెట్లు వెతుక్కుంటూ పోవలసిందే!"




"మీ పొజిషన్ ఎలావుంది?"

"మాదేముంది సార్. మీలాంటి రైతుల సహకారం ఉంటే బాగుంటాం. లేకుంటే లేదు. అయినా ఒకటండి. ఈరోజు మటన్ కిలో ఎనభైదాకా ఉంది. చికెన్ కూడా ఏభై నుండి అరవైదాకా ఉంది. అందులో సగం పెడితే చేప వస్తుంది. ముందు ఆరోగ్యానికి మంచిది. అందుకని చేపల విషయంలో ఆలోచించేపని లేదు. ఏ స్లంపు వచ్చినా కొన్ని నెలలే ఉంటుంది''

"సర్లెండి... ఓపని చెయ్యండి. మంచి ధర పలుకుతున్నప్పుడు నన్ను కాంటాక్ట్ చేయండి. పట్టించేద్దాం"

"అలాగే'' అని ఓ టేబుల్‌దగ్గరకు వెళ్లి కొంచెంసేపు ఆట చూశాడు. తర్వాత బాయ్‌ని పిలిచి వందనోటు అందించి ఏదో చెప్పాడు.

రవీంద్ర పదివేలతో వచ్చాడు. ఓ టేబుల్ దగ్గర కూర్చున్నాడు. ముక్కలు పంచారు. సమయం ఎలా గడుస్తోందో తెలియదు. ఒక్క ముక్క సరిగా పడదు. మొత్తం మూడురౌండ్లు తిరిగింది ఆట. సగం డ్రాపులే. ఆడినవన్నీ కౌంటులు. కనీసం ఒక్క ఆటయినా తిప్పింది లేదు. అయినాసరే పట్టుదలగా కూర్చున్నాడు.

రాత్రి రెండుగంటల ప్రాంతంలో చూసుకుంటే దాదాపు ఏడువేల రూపాయల నష్టం కనిపించింది. అయినా బాధనిపించలేదు. ఆట ఓడిపోతున్నకొలదీ పట్టుదల పెరుగుతోంది.

"ఈరోజు మీకు తరుగు నడుస్తుందే'' అన్నారెవరో.

మూడుగంటలకు బోర్ అనిపించింది. చూసుకుంటే వేయి రూపాయలుమాత్రం ఉన్నాయి.

'రేపు వద్దాం' అనుకున్నాడు.

"ఇంతసేపు ఎక్కడికెళ్లారండి బాబూ!" అంది ఆవులిస్తూ వసుంధర. రవీంద్ర మాట్లాడకుండా ముందుకు నడిచి, బాత్‌రూంలోకి వెళ్లాడు.

పడుకున్న చాలాసేపటికిదాకా నిద్ర రాలేదు.

ఎప్పుడు ఉదయం అవుతుందా అని చూశాడు. ఎప్పటికో నిద్రపట్టింది.

ఉదయం లేచేటప్పటికి పదిగంటలయింది. కళ్లు మండుతున్నాయి. బ్రష్ చేసి పేపర్ తిరగేస్తూ కాఫీ తాగాడు. వెంటనే స్నానం చేసి సరాసరి క్లబ్బుకి వెళ్లాడు. దారిలో ఓ పావుగంట మాత్రం ఆగి బ్యాంక్‌లో డబ్బు డ్రాచేశాడు. మొత్తం పదిహేను వేలున్నాయి.

రాత్రి ఆడినవారిలో ఇద్దరు ఇంకా ఆడుతూనేవున్నారు.

"నిద్రపోయి వచ్చారా? రండి సార్'' అంటూ ఆహ్వానించారు.

అలా కూర్చోవటం... రాత్రి పదిగంటలకి జేబు ఖాళీ అయింది. జేబులు వెతుక్కున్నాడు. రెండు వందలు మాత్రం కనిపించాయి. ఓ బార్‌లోకి వెళ్లి కూర్చున్నాడు. తలుచుకుంటే ఆశ్చర్యంగా ఉంది. రెండురోజుల్లో పాతికవేలు పోయాయి. అంతకుముందు వచ్చినవాటితో చూసుకున్నా ఇరవై ఒక్కవేల రూపాయలు పోయాయి. మందు తాగుతున్నాడేగాని పనిచేయటంలేదు.

'ఇలాకాదు ఓ పాతికవేలు తీసుకుని కూర్చోవాలి. అటో ఇటో తేల్చుకోవాలి' అనుకున్నాడు.

ఇంటికెళ్లాక వసుంధరతో పెద్దగా ఏం మాట్లాడలేదు. కాళ్లన్నీ పీకుతున్నాయి. గుండెల దగ్గర మంటగా ఉన్నట్లనిపిస్తోంది. చేపల చెరువుకి గ్యాస్ ఫామ్ అయిందో లేదోగాని తనకి అయింది. తలనొప్పిగా ఉందనిపించింది. వసుంధరని పిలిచి అమృతాంజనంతో మర్దన చేయించుకుందాం అనుకున్నాడు. పిలవాలనిపించలేదు. అంతలోనే తనేమైనా అంటే కోపం రావచ్చునని సందేహించా

డు. మెల్లగా నిద్రలోకి జారిపోయాడు.

కాలం పరుగులు తీస్తూనేవుంది.

లేచి, స్నానం చేసి కొత్తబట్టలు ధరించాడు. బ్యాంక్‌కెళ్లి పాతికవేలు డ్రా చేసుకున్నాడు.

ఆట మొదలయింది. గెలవటంకోసమే ఆడుతున్నాడు. చాలా జాగ్రత్తగా ఉన్నాడు. ఏమాత్రం టెంప్ట్ అవటంలేదు. ముక్కలు బాగుంటే తీస్తున్నాడు. లేకపోతే అవతల పడేస్తున్నాడు. అట్లా చూసినా రాత్రి పదిగంటలకి పదివేలు పోయింది. ఇంక కంట్రోల్ చేసుకోవటం తనకు కుదరలేదు. ఆట దాగుడుమూతలాడింది. ఓ రౌండ్ బాగుంటే ఆ తర్వాత పోతోంది. సమయం మూడుగంటలైంది. అలానే కూర్చున్నాడు. సిగరెట్లు తాగుతున్నాడు. టిఫిన్ తెప్పించుకుని తిన్నాడు. ఉదయం ఏడుగంటలు... వసుంధర గుర్తుకొచ్చింది. ఫోన్ చేసి చెబితేనో అనుకున్నాడు. ఇంకో గంటలో వెళ్దాం కదా అనుకున్నాడు. మూడు గంటలూ గడిచిపోయాయి. ఇరవైవేలు పోయాయి. చేతిలో ఇంక అయిదువేలు మాత్రం వున్నాయి.

ఆడాలా? వద్దా?

కొంచెంసేపు ఊగిసలాడాడు. 'ఇప్పటికి నలభై అయిదువేలు పోయాయి. ఈ అయిదు వేలు పోతే అరలక్ష. పోనీ... రేపటినుండి ఓ సలాం పెడితే సరిపోతుంది. అంతగా చెరువులో విషం కలిపారనుకుంటాను' అనుకున్నాడు. ముక్కలు పంచారు.

సాయంకాలం ఎనిమిది గంటలైంది.

"ఏమిటి సార్ పరిస్థితి?" అన్నారెవరో.

"ఇంకెక్కడా రికవరీ కాందే''

"మూడు రోజులదా''

"భలేవారే... పాతికతో నిన్న కూర్చున్నా''

పదిగంటల ప్రాంతంలో సరిగ్గా పాతికవేలున్నాయి చేతిలో.

ఇంక అక్కడ ఉండాలనిపించలేదు. వెంటనే బయలుదేరాడు.

తలుపు తీయగానే వసుంధర ముఖంలోని ఆగ్రహాన్ని గమనించాడు.

"ఇప్పుడే పోలీస్ రిపోర్ట్ ఇద్దామనుకుంటున్నా'' అంది.

"దేనికట?"

"తమరేమైపోయారో తెలియదుకదా! అందుకని. కనీసం ఫోన్ చేసి చెప్పేంత తీరికలేని పనులేమిటో?" అంది.

రవీంద్ర మాట్లాడకుండా బాత్‌రూంలోకి వెళ్లిపోయాడు. స్నానం చేశాక కొంత హాయిగా అనిపించింది. లుంగీ కట్టుకుని వచ్చాడు.

"హోటల్స్‌లో రకరకాల రుచులు మరిగితే ఇంట్లో తినాలనిపించదు'' వసుంధర తనకేసి చూడకుండా అంది.

"ఏమిటా సణుగుడు?"

"ఉన్నమాట అంటున్నాను''

"నీ వ్యాపారం నువ్వు చూసుకో. అనవసరంగా ఎందుకు మాట్లాడటం?"

"అది నిజమే. మీ వ్యాపారం మీరు చూసుకుంటున్నారు. ఏమాత్రం సంపాదించారేమిటి?"

"అంటే...?" అన్నాడు కోపంగా.

"మీరేం చేస్తున్నారో నాకు తెలియదనుకుంటున్నారా?"

"ఏం చేస్తున్నానంటావ్?"

"క్లబ్బుకి వెళుతున్నారు. పేకాట ఆడివస్తున్నారు. నాలుగు రోజుల్లో మీరు బ్యాంక్‌నుండి ఏభైవేలు డ్రాచేశారు. అదీ మీరు చేసే వ్యాపారం"

రవీంద్ర దిగ్భ్రాంతి చెందాడు. అంతలోనే మొండిగా అన్నాడు, "నా ఇష్టం వచ్చినట్లు నేను చేస్తా. నీ ఇష్టం వచ్చినట్లు నువ్వు చేస్తున్నావు. నేను కాదన్నానా? షేర్లు అంటూ కూర్చుంటావు. అందులో ఎంత వచ్చిందో ఎంత పోయిందో నాకు తెలియదు. షాపింగ్ లంటావు. కనీసం పిల్లాడి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందని కూడా గుర్తుండదు. ఆ




మంచంకింద పారేస్తావ్''

"అవునుమరి. పిల్లవాడంటే మీకు ప్రేమ కారిపోతోంది. నాకు కాదు చెప్పాల్సింది. ముందు క్లబ్బులో ఏభై నష్టమా? లక్ష నష్ట మా? అది తేల్చండి''

"మీ బాబు ఇచ్చిన ముల్లె నేను పాడుచే యలా''

"అలా వస్తున్నారా... పోనీ మీ బాబు ఇచ్చిన ముల్లె ఎంత పోయింది చెప్పండి''

"చెప్పు పెట్టి కొడతా. నీకు బాగా...''

"కొట్టు... బాగా ఏంటంట... రాత్రీ, పగ లూ పేకాడింది కాక బాగా అంట. అవును మరి అలగావాళ్లేం చేస్తారు. తాగుతారు. తందనాలాడతారు. ఇంటికొచ్చి పెళ్లాన్ని పట్టుకొని బాదుతారు''

రవీంద్ర వసుంధర చెంపమీద చరిచి అన్నాడు. "నేను అలగావాడ్నే. నోరు మూస్తా వా? నువ్వు కూడా అలగాదానిలా రోడ్డుమీదకి వెళ్తావా?''

వసుంధర బుగ్గ కందిపోయింది. ముందు అవమానభారంతో పెదవులు అదిరాయి.

"నువ్వు.... నువ్వు నన్ను కొడతావుక దూ...'' అంటూ దుఃఖం రాగా అక్కడినుండి వేరే గదిలోకి వెళ్లిపోయింది.

రవీంద్రకి అప్పుడు స్పృహ వచ్చింది.

'ఛ... ఎంత దిగజారిపోయాను. ఇంక జీవితంలో క్లబ్బుకెళ్తే నేను రవీంద్రని కాదు' అనుకున్నాడు.

రెండురోజులు గడిచిపోయాయి.

రవీంద్ర చెరువుల దగ్గరికి వెళ్లి సరాసరి ఇంటికొస్తున్నాడు. కనీసం బార్‌కేసి చూడటా నికి కూడా మనస్కరించటంలేదు. అయితే అహాన్ని వదులుకుని వసుంధరను మాట్లా డించలేకపోయాడు. ఆమె కూడా అంతే. తనుగా మాట్లాడాలనుకోలేదు.

ముందు అమ్మ దగ్గరికి వెళ్తేనో అను కుంది. వెంటనే ఆ ఆలోచనను విరమించు కుంది. డబ్బు సంపాదించాలనుండవచ్చు. కానీ ఆ జూదం ఏమిటో ఆమెకు ఎంత ఆలోచించినా అర్థంకాలేదు. ఇదివరకు మని షిలో ఇన్ని బలహీనతలు లేవు. ఈ మార్పు ఎంతవరకు వెళ్తుంది... అనుకుంటుండగా ఆమె కళ్లు విశాలం అయ్యాయి!

అంతకుముందెప్పుడూ ఆమెకు రవీంద్ర పై అనుమానం రాలేదు.

'రవీంద్రలో ఆ బలహీనత కూడా మొద లైందా?' అనుకుంది.



ఆమెకెందుకో దిగులు కలిగింది. ముందు పిల్లవాడు గుర్తొచ్చాడు. వాడేం చేస్తున్నాడో? ఇంతవరకు సరిగ్గా అలవాటు పడలేదు అను కొంది. తను ఇలా కావటానికి కారణం సంకేతా? సంకేత్ ఊటి వెళ్లటానికి కారణం... అలా విభజించుకుంటూపోతే హైదరాబాద్ దగ్గర ఆగుతుంది!

ఇల్లు అమ్మించి తప్పుచేసిందా?

ఇంకా నయం. ముందుగా తెలిసింది కాబట్టి సరిపోయింది. లేకపోతే మొత్తం డబ్బంతా అలా తగలేసేవాడేమో!

ఆయనలా తను చేయదు. ఇంతవరకూ రావలసిన లాభం పోయిందేమోగాని, నష్టంమాత్రం రాలేదు... ఆమె ఆలోచనల్లో ఆమె ఉంది.

అన్నం వండిపెడుతుంటే అతనే పెట్టుకు తింటున్నాడు.

రాత్రి పదిగంటలు దాటింది.

వసుంధర తలలోని మల్లెలు మనసుని వశం తప్పేలా చేస్తున్నాయి.

ఇంక నిగ్రహించుకోవటం సాధ్యంకాలేదు.

ఆమెను దగ్గరకు లాక్కున్నాడు.

"నన్ను ముట్టుకోవద్దు'' అంది వసుంధర.

"సారీరా''

"నో... నిన్ను ఏం చేస్తానో తెలుసా?"

"నువ్వు కూడా కొట్టు''

వసుంధర ఈడ్చి చెంపమీద కొట్టింది.

ఊహించని దెబ్బకి అదిరిపోయాడు. అంతులేని ఆగ్రహం వచ్చింది. కళ్లలో నీళ్లు తిరిగాయి. బలవంతాన నవ్వాడు.

"బాధ తెలిసిందా?"

ఆమెను బలంగా తనకేసి హత్తుకున్నాడు.

వసుంధర ఇంక బెట్టుచేయలేదు.

అర్ధరాత్రి సీరియస్‌గా చెప్పింది. "మీరు క్లబ్బుకిగాని, బార్‌కిగాని వెళ్లకూడదు. చెరువుల దగ్గరికి వెళ్లటం లేదా ఇంటికి రావటం చేయాలి. ఈసారి ఎక్కడికైనా వెళ్లినట్లు తెలిసినా ఇక్కడనుండి కాపురం ఎత్తేసి చెరువుల మీదకు వెళ్లిపోవటమే''

"అలాగే... నీ షేర్లు''

"అక్కడినుండే లక్ష షేర్లు కొనొచ్చు. అర్థమైందా?" అంది.

రవీంద్ర తలూపాడు.

"ఇప్పుడు చెప్పు. పేకాట లాస్ ఎంత?"

"ఇరవై వేలు''

"నీకు బాధనిపించలేదా?" అంది. రవీంద్ర వెర్రినవ్వు నవ్వాడు.

★ ★ ★

నారాయణకు ఆరోగ్యం బాగుండలేదని తెలిసి చూడటానికి వెళ్లాడు రవీంద్ర. మంచంమీద పడుకొని మూలుగుతున్నాడు.

"ఏంటి నారాయణా... ఏమైంది?" అన్నాడు.

"రాత్రినుండి కడుపు నొప్పిగా ఉందండి''

"టాబ్లెట్స్ వేసుకున్నావా?"

"లేదండీ... మామూలు కడుపులో నొప్పే కదా! అదే తగ్గిపోతుందనుకున్నాను. కానీ పెరిగిపోతోంది''

"నువ్వు బండిమీద కూర్చోగలవా?"

"కూర్చుంటాలెండి'' అన్నాడు.

"కూర్చుంటాలెండి కాదు. అంతగా అయితే ఆటోను పిలిపించటమో, బండి కట్టించటమో చేద్దాం"

"కూర్చుంటానండి''

వెంటనే నారాయణని తీసుకుని డాక్టర్ దగ్గరకు వెళ్లాడు. ఆయన నారాయణని పరిశీలించాక రవీంద్రతో చెప్పాడు "హాస్పటల్లో జాయిన్ చేయాల్సి వుంటుంది'' అని.

"అలాగే'' అన్నాడు.

క్షణాల్లో గది తీసుకున్నారు. నారాయణ గోల చేస్తున్నాడు. "నాకేం కాలేదు బాబూ! డబ్బులు కొట్టేయడానికి ఇలా చేపిస్తారు. ఇంకెక్కడికయినా పోదాం"

"నువ్వు మాట్లాడకుండా కూర్చుంటావా?" అన్నాడు.

ఇంటికి ఫోన్ చేసి వసుంధరని రమ్మని చెప్పాడు. డాక్టర్ దగ్గరికి వెళ్లి అడిగాడు "ఎనీ డేంజర్ సార్?"

"నో... అదేంకాదుగాని... ఇంతకూ వీళ్లు వాడుతున్న నీళ్లు ఎక్కడివి?"

"మా చెరువులమీద మంచినీళ్ల పంపు ఉంది. అవే వాడుకుంటారు''

"అవి పొల్యూట్ అయ్యాయేమోనని నా అనుమానం. రెండవది మన జనాభాకి నీళ్లు





కాచి చల్లార్చి తాగే అలవాటు లేదు. తనెప్పుడూ మేతలూ, మందులూ కలుపుతుంటాడుకదా గ్లాస్ వాడుతుంటాడా?''

"వాడతాడు సర్'

"అయినా అలాంటి విషయాల్లో జాగ్రత్తగా ఉండాలి. సాధ్యమైనంతవరకూ నీళ్లు కాచి తాగాలి. మీకింకో సంగతి తెలుసా? ఈ చేపల చెరువులవలన చాలా కొద్దిరోజుల్లో డ్రింకింగ్ వాటర్ సమస్య ఏర్పడబోతోంది. ఆల్‌రెడీ కొన్ని గ్రామాల్లో మంచినీళ్లు దొరకటంలేదు. వాళ్లు టాంకర్స్‌ద్వారా తెప్పించుకొంటున్నారు. డబ్బులుండాలేగాని విమానాల్లో తెప్పించుకోవచ్చుననుకోండి'' అన్నాడు.

"ఇంతకూ మా నారాయణకి..."

"వెంటనే చెప్పటానికి వీలులేదు. కనీసం నాలుగు రోజులు అబ్జర్వేషన్‌లో ఉంచుదాం. మీకు తెలుసుకదా! అతిసారవ్యాధి ప్రస్తుతం ఈ జిల్లాలో ఉంది''

రవీంద్ర. కళ్లు ముడుచుకుపోయాయి.

"డోంట్‌వర్రీ... ముందుగా తీసుకొచ్చారు. అదృష్టవంతుడు. ముందు సెలైన్ ఎక్కించాలి''

ఆ ఏర్పాట్లు జరిగిపోయాయి. వసుంధర రాగానే చూస్తుండమని చెప్పి చెరువులదగ్గరకొచ్చాడు.

"ఏమైంది బాబూ... ఆయనేడి?" అంది కంగారుపడుతూ నారాయణ భార్య.

"నీరసంగా ఉన్నాడని హాస్పటల్లో ఉంచారు. నువ్వో పని చెయ్యి. నీ బట్టలూ, నారాయణ బట్టలూ తీసుకొని మా ఇంటికి వచ్చేస్తే అక్కడినుండి నేనో, వసుంధరో హాస్పటల్ దగ్గరికి తీసుకువెళ్తాం" అంటూ ఓ ఏభైకాగితం అందించాడు.

"మరి ఇక్కడ...?" అని ఆగిపోయింది.

"ఆ విషయం గురించి నేను చూసుకుంటాగా?" అన్నాడు.

"నువ్వు వెంటనే బయలుదేరు'' అని చెప్పి సరాసరి సూర్యం దగ్గరకు వెళ్లాడు.

"ఏమైంది'' అన్నాడాయన.

"నారాయణకి అతిసారం అని అనుమానం. సెలైన్ ఎక్కిస్తున్నారు. నాలుగయిదు రోజులు అక్కడ ఉండాల్సిరావచ్చు. నాకు ఈ వారానికి ఓ మనిషి కావాలి. కొంచెం మేతలు కట్టడం అయి చేతనయినవాడయితే మంచిది''

"కొంప తీశాడే. నేను వెంటనే పంపిస్తాను. మనూరికి కూడా మొదలయిందా?"

"ఏమిటో ఈ దరిద్రం. రోజుకో కొత్త జబ్బు వచ్చిపడుతోంది''

"అదంతేనండి... దేశమంతా రోగాలమీద యుద్ధం చేసిందనుకోండి. అవి తగ్గిపోతాయి. అయితే ఈ రాష్ట్రంమాదే అని కొట్టుకుచస్తారు. ఆ సమస్యమీద పనిచేస్తే ఇదిగో ఈ రోగాలొస్తాయి. నేనింకా కొంతకాలం పడుతుందనుకున్నా. అప్పుడే మొదలయిందన్నమాట!"

"ఇంకా కన్‌ఫర్మ్ కాలేదనుకోండి''

"అనుమానం ఎందుకండి బాబూ! అతిసారం కాకపోతే, మితసారం. ఇంట్లో నీళ్లు కాచి వాడమని సీరియస్‌గా చెప్పాలి''

"అంత పొల్యూట్ ఎలా అయిందా అని ఆలోచిస్తున్నా''

"అదేంటండి... ఒక చెరువా రెండు చెరువులా? కాలవలోనుండి నీళ్లు పెడతారు బాగా నేవుంది. పట్టుబడి అయిపోయాక ఆ నీళ్లు తిరిగి కాలవలోకే కదా తోడిపోస్తారు. ఆ నీళ్లలో ఎన్నెన్ని మందులు కలిపారో అవన్నీ తిరిగి కాలవలో కలువటమేగా. ఇంక కలుషితం కాక ఇంకేమౌతాయి. మొన్న షావుకారు చెరువులో విషం కలిపారు. ఆ నీళ్లు కాలవలోకే కదా వదలాలి. ఎంతో కొంత పవరు మిగలదంటారా?"

"ఇదేంటండి బాబూ?"

"ఏంటంటే ముదనష్టం. నడమంత్రపుసిరి అంటారే అది. అది వస్తే ఇంక అసలు మనుషుల్ని చూడొచ్చుననంటారు. అలాగే

డబ్బులు మాత్రమే వస్తయ్యనుకుంటున్నారా, దాంతోపాటు ఎన్నెన్ని రానున్నాయో!"

"అవును... నాకూ అలానే అనిపిస్తోంది''

"అదిసరే రవీంద్రగారూ! మనం తెలివిగ లవాళ్లమా? ఆ జపాన్ దేశం వాళ్లా?"

"భలేవారే. వారికీ, మనకీ పోలిక ఏముంది?"

"అవునా... మరి మనదేశంనుండి వెధవ లయి అంత డబ్బు పెట్టుకుని రొయ్యలు కొనుక్కోవటం లేదుకదా! ఇట్లాంటి సవాలక్ష దరిద్రాలు వస్తాయని వారికి అనుభవం అయింది. మనకంటే డబ్బులు కావాలి. ఆ విషయం వారికి తెలుసు. నేను చెబుతున్నా పది సంవత్సరాల తర్వాత చూడండి... జనం ఏరకంగా ఉంటారో?"

"మరి ఈ విషయంమీద ఎడ్యుకేట్ చేయ వచ్చుకదా?" అన్నాడు రవీంద్ర.

"ఎవర్నండి... మీకు పాతికెకరం ఉంది. చెరువు వద్దంటే మానుకుంటారా? జబ్బులు వస్తే అమెరికా పోతావ్. అయినా గవర్న మెంటు దగ్గరనుండి ఇండస్ట్రియలిస్టులదాకా అందరికీ ఆ విదేశీ ద్రవ్యం కావాలి ఇంకా ఇది వద్దని ఎవరు చెబుతారండి బాబూ మీరు చదివారో లేదో అమెరికావాడు ఏం చేశాడో తెలుసా?"

"చెప్పండి''

"అగ్నిపర్వతాలు తవ్వేసుకుంటున్నాడు. ఇంతకంటే దారుణం ఉందా? అసలు ఈ ప్రకృతిని కొల్లగొట్టింది ఆడు కాదూ. మన లాంటివారికి కోట్లు ఇస్తాం, చెట్లు పెంచండి అంటాడు. నేను చెబుతున్నాకదా! వాడి దాహా నికి ఏదీ ఆగదు. ఇంకోటి తెలుసా... ఆడు చేతకాక వదిలేస్తున్నాడుగాని ఏదోరోజు పొద్దు న్నే మనం లేచి చూస్తే అక్కడ సూర్యుడు కనిపించడు. పెద్ద డొల్ల కనిపిస్తుంది''

రవీంద్ర నవ్వాడు.

"మరి నేను వస్తా తన సంగతి చూడాలిక దా!"

"రాత్రికి వస్తారా ఏమిటి?"

"అవును. ఈ నాలుగు రోజులూ నేనే కాపలా''

"అక్కడ ఎలా ఉంటారండి బాబూ! అయి నా అవసరంలేదు. నేను మనిషిని పంపిస్తాను కదా!"

"అయినా ఉందాంలెండి. ఇదో అనుభ వంకదా!"

"అవును. మా గోపాల్‌గాడి సినిమా మొద లయింది చూశారా. అప్పుడే డేట్ కూడా ఇచ్చాడు. ఫలానా రోజు విడుదల చేస్తానని''

"ఆయన ఏమైనా చేయగల సమర్థుడు లెండి'' అన్నాడు బండి స్టార్ట్ చేస్తూ. ఇంటికి వెళ్లకుండా హాస్పటల్‌కి వెళ్లి వసుంధరని పంపించాడు నారాయణ భార్య రాగానే హాస్పటల్‌కు తీసుకురమ్మని. తను వెళ్లిపో యింది. సెలైన్ బాటిల్‌లో చుక్కలు మెల్లగా కదిలి శరీరంలోకి ఇంకుతున్నాయి. నారా యణ కళ్లు మూసుకుని పడుకున్నాడు.

రవీంద్ర ఆలోచిస్తూ కూర్చున్నాడు. కొద్దిసే పటి తర్వాత లేచి అటూ, ఇటూ తిరిగాడు. అదంతా విచిత్రమైన వాసనతో నిండిపోయి వుంది. రేపటినుండి పత్రికల్లో ఈ వార్త మారుమోగిపోతుందనుకున్నాడు.

హైదరాబాద్ నీళ్లు వేరు. అవి తాగితే నాలుగు రోజుల్లోనే తేడా కనిపిస్తుంది. నలు పంతా విరిగి ముఖాలు మెరిసిపోతాయి. తనకేకాదు వసుంధరకీ, సంకేత్‌కి కూడా ఆ నీళ్లు సరిపడ్డాయి.

చెరువుల సంగతలా వదిలేస్తే ఇక్కడ అన్నీ ఉప్పునీళ్లు. స్నానం చేస్తే సబ్బు విరిగి పోతుంది. ఆ ఫీలింగ్ రాదు. తాగటంవరకు ఫర్వాలేదు. అవి కూడా ప్రస్తుతం తాముండే ఏరియాకి కేవలం టాంకులద్వారా వస్తు న్నాయి. రేపు ఇక్కడా అలాంటి పరిస్థితి వస్తుందేమో! మనిషి ఆరోగ్యం పాడయ్యాక ఎన్ని లక్షలూ, కోట్లూ ఉండి లాభం




ఏముంటుంది?

చిన్నప్పుడు చదువుకున్న వాక్యాలు గుర్తొచ్చాయి.

'ఆరోగ్యమే మహాభాగ్యం'

ఆ పదాల్ని ఉచ్చరిస్తున్నప్పుడు ఎన్నడూ లేనంత సంతోషం కలిగింది. ఇప్పటివరకూ అతి మామూలు పదాలుగా, శతాబ్దాలుగా అరిగిపోయిన మాటల్లా కనిపించిన ఆ పదాల్లో అనంతమైన జీవనశక్తి ఉందనిపించింది.

'నీకు లక్షలు లేవు. కోట్లు లేవు. కనీసం వేలూ వందలూ లేవు. అయితేనేం నీకు ఆరోగ్యం ఉంది'

ఎవరిని ఉద్దేశించి ఆ మాటలనుకున్నాడో గాని... అంతకుమించి మనిషికేం కావాలి అనిపించిందాక్షణం.

వసుంధరతోపాటు నారాయణ భార్య వచ్చింది. తన భర్తని అలా మంచంమీద చూడగానే కొంగుతో కళ్లు వత్తుకొంది.

"ఊరుకో లక్ష్మీ... సెలైన్ ఎక్కిస్తున్నారు నీరసం రాకుండా. దానికంత భయపడాల్సిన అవసరం లేదు'' అంది వసుంధర.

ఆమెకు ధైర్యం చెప్పారు. తిరిగి ఉదయం వస్తానన్నారు. లక్ష్మికి కావలసిన ఏర్పాట్లు చేశారు. నర్సులకీ, కాంపౌండర్‌కి విషయం వివరించి అవసరమైతే ఫోన్ చేయమని నంబర్ ఇచ్చారు. సంతృప్తి చెందాక వసుంధరతో ఇంటికి వెళ్లాడు.

"ఈ రాత్రికి చెరువులదగ్గరికి వెళ్తాను'' అన్నాడు.

"భయం వెయ్యదా?" అంది వసుంధర.

"ఎందుకు?"

"మీరు వంటరిగా ఉండాలికదా!"

"సూర్యంగారు మనిషిని పంపిస్తామని చెప్పారు. అయినా పూర్తిగా వదలివేయటం మంచిదికాదు. రేపు చెరువులమీద ఉండాల్సి వస్తే ఈ అనుభవం ఉపయోగపడుతుంది''

"మీ ఇష్టం. నీళ్లుమాత్రం ఇక్కడనుండి తీసుకెళ్లండి. అక్కడ టీ కూడా తాగొద్దు''

"అలాగే'' అన్నాడు.

లుంగీ తీసుకుని, దాంతోపాటు రెండు బాటిల్స్‌లో మంచినీళ్లు తీసుకొని చెరువులమీదకెళ్లాడు.

వెన్నెల చెరువులమీద పడి మెరిసింది. చుట్టూ కొబ్బరిచెట్లమీద పడి గాలికి ఆకులు కదిలినప్పుడల్లా మెరుస్తోంది. అతను మంచం తెచ్చివేశాడు. ఓ మూలగా కూర్చుని చుట్ట వెలిగించుకున్నాడు.

"నారాయణకి ఎట్టుందయ్యా?" అన్నాడు.

"సెలైన్ ఎక్కిస్తున్నారు''

"ఏంటోలే బాబూ! దున్నపోతుల్లాంటి మనుషుల్ని కూడా గంటలో ఈడ్చేస్తున్నాయి వెధవరోగాలు. ఇదివరకటికి ఇలాలేదు బాబు. మినుముల బస్తా భుజానికెత్తుకుంటే ఆగేపని లేదు. ఆ ఓపికంతా ఏమైపోయిందో తెలియటంలేదు''

"వయసయిపోటంలా'' అన్నాడు.

"మా అయ్య అరవైఏళ్లదాకా గుండులా గుండి బస్తాలు మోసేవాడు. మరి మాకు ఇప్పుడే ఈ దరిద్రం ఎందుకండి బాబూ. ఆ తిండి వేరు. ఆ కథ వేరు. ఇప్పుడన్నీ సూపర్‌తిండే కదండి బాబూ!"

రవీంద్ర తలూపాడు.

గాలి మెల్లగా శరీరాన్ని తాకుతోంది. చల్లగా, హాయిగా ఉంది. ఇంట్లో ఫ్యాన్‌గాలి వేడికి ముక్కులుసైతం మండిపోతుంటాయి.

రవీంద్రకి లీలగా ఆ ఆలోచన ప్రవేశించింది.

'అలా చేస్తే బాగుంటుందా?' అనుకున్నాడు.

"చూద్దాం. ఇంకా సమయం ఉందికదా!" అని సరిపెట్టుకున్నాడు.

ఆ రాత్రిలాంటి రాత్రులు మరో వారం కరిగాకగాని నారాయణ చెరువుమీదకి రాలే

దు. ఆ శరీరంలోకి ఎన్ని సెలైన్లు ఎక్కించారో లెక్కలేదు. మొత్తం బిల్లు చూసేసరికి రెండు వేల చిల్లరైంది.

"మీరుగాని లేకపోతే నేనింక ఈ చెరువులు చూసేవాడినే కాదయ్యా'' అన్నాడు నారాయణ కళ్లెంట నీళ్లుపెట్టుకొని.

★ ★ ★

"వసుంధరా! నాలుగురోజులపాటు నీ షేర్‌బిజినెస్ మరిచిపోగలవా?" అన్నాడు రవీంద్ర.

"అదేమిటి అలా అంటున్నారు. మేం రోజూ అదేపనిగా కొని అమ్మటంలేదు. వారంరోజులు గ్యాప్ ఉంటుంది. అంత అవసరమైన పని అయితే వారం రోజులు కాదు. నెల రోజులయినా ఎలాంటి ఇబ్బంది లేదు. ఇంతకూ మీ పని గురించి చెప్పండి'' అందామె.

"ఇంపార్టెంట్. మనం సంకేత్‌ని తీసుకురావాలికదా!"

"అవును'' అంది వసుంధర.

"ఇంతవరకూ మనం చూసిన ప్రాంతాలు లేవు. సంకేత్‌తో కలిసి మనం కనీసం కొన్ని ప్రాంతాలయినా చూడాలనుకుంటున్నాను. అందుకే ముందు ఊటీ వెళ్దాం. అక్కడ నుండి మనం ఏం చూడాలంటే అది చూసివద్దాం"

"చెరువులు'' అంది.

"ముందే చెప్పానుకదా! చెరువులూ, షేర్లూ ఏమైపోయినా ఐ డోంట్‌కేర్. ఓ వారంపది రోజులు పిల్లవాడితో ఆనందంగా కాలం గడపాలి. ముందు వాడికి ఇంటి బెంగ పోయేలా చూడాలి. ఆ తర్వాతే ఏమైనా. అయినా నారాయణ ఉండగా ఇంక మనకు దిగులేముంది?"

"అలాగే!" అంది.

ప్రయాణానికి కావలసిన డబ్బులు తీసుకున్నాడు.

సంకేత్‌ని చూడగానే చిక్కిపోయినట్లు కనిపించాడు. "ఏం బాబూ! సరిగ్గా తినటంలేదా?" అనడిగింది వసుంధర. ముందు కొంచెంసేపు బుంగమూతి పెట్టి మాట్లాడలేదు. మెల్లగా వారి ప్రపంచంలోకి వచ్చాడు. అక్కడనుండి బయలుదేరి రకరకాల ప్రాంతాలు చూశారు.

సంకేత్‌ని మధ్యలో పడుకోబెట్టుకున్నారు. రవీంద్ర స్కూల్‌కి చెందిన విషయాలు అడిగి తెలుసుకున్నాడు. అక్కడి స్నేహితుల గురించీ, ఆటల గురించీ కళ్లు మెరుస్తుండగా చెప్పాడు.

వాడు ఆంగ్లంలోనే మాట్లాడుతున్నాడు. ఇదివరకటికంటే చాలా అభివృద్ధి కనిపించింది.

"అదిసరే సంకేత్ నీకు ఉత్తరాలు రాయటం రాదు. ప్రతి ఉత్తరంలోనూ రెండే ముక్కలుంటాయి. అమ్మనీ, నాన్ననీ చూడాలి అని. ఇప్పుడు ఇంత బాగా మాట్లాడావు కదా! ఉత్తరాలు అలా ఉండాలి''

సంకేత్ కొంచెంసేపు సీరియస్‌గా ఉండిపోయాడు.

"కోపం వచ్చిందా? ఇందుకేనా మమ్మల్ని చూడాలంటావ్?"

సంకేత్ తల అడ్డంగా ఊపుతూ గుండెల మీద కొడుతూ అన్నాడు.

"నేనక్కడ చదువుకోను. మీతోనే ఉంటాను''

"అలా అనకూడదు. మనదగ్గర ఇన్ని అవకాశాలుండవు. నువ్వు చూడు ఇంగ్లీష్‌లో ఎలా మాట్లాడేస్తున్నావో. నిన్ను చూస్తే అందరూ మెచ్చుకుంటారు. అంతేగాని అమ్మదగ్గర ఉంటానంటే కుదరదు''

"నాకే నేను ఇంక వెళ్లను''

"తప్పు. నీకోసం ఎన్ని డబ్బులు కట్టామో తెలుసా?"

"నాకు తెలియదు"

"చెబుతాను... విను''

"నేను వినను''

"మరేమిటి చెప్పు''

"నేను మీదగ్గరే ఉంటా'' అన్నాడు.

"ఉందువుగానమ్మా! ఇప్పుడు శెలవులు వచ్చాయి. అందరం కలుసుకున్నాం. ఊర్లు చూస్తున్నాం. మళ్లీ సెలవులు వస్తాయి. అప్పుడు కూడా ఇలానే చూస్తాం. అంతేగాని నేను చదువుకోను అంటే నవ్వుతారు''

"వీడితో పెద్ద సమస్యే'' అన్నాడు రవీంద్ర వాడు నిద్రపోయాక.

"మీరు అనవసరంగా గారాబం చేయకండి. తనే చదువుకుంటాడు. బాబూ, అయ్యా అంటే వాడలానే మాట్లాడతాడు'' అంది.

అన్ని ఊర్లూ తిరిగాక మావయ్య దగ్గరికి వెళ్లారు. ఆయన మనవడిని ప్రేమగా గుండెలకి హత్తుకున్నారు. నువ్వు చాలా గొప్పవాడివయిపోతావురా అనగానే తాతను రెండుచేతుల్తో చుట్టేశాడు సంకేత్.

ఆయన రవీంద్రతో మాట్లాడుతున్నప్పుడు అడగకుండా ఉండలేకపోయాడు.

"హైదరాబాద్‌లో అపార్ట్‌మెంట్ అమ్మేశారంటకదా!"

"అవునండీ! మొదట్లో నాకు కొంచెం బాధనిపించింది. అంత పెద్ద నగరంలో ఉన్న దానిని అమ్మటం ఏమిటని? ఇప్పుడు తలుచుకుంటే మంచిపనే అనిపిస్తుంది. మొన్నటివరకూ ది బెస్ట్ సిటీ హైదరాబాద్ అనుకునేవాడిని. చెమటలు పట్టవు. నీళ్లు సరిపడతాయి. అన్ని అవకాశాలూ ఉంటాయి. కానీ ఇండస్ట్రియలైజేషన్ అయ్యాక ఆ నగరం చచ్చిపోయింది. రేపు నా పిల్లాడికి ఆ మురికి నగరంలో వారసత్వంగా ఏమివ్వమంటారు?" అన్నాడు.

అల్లుడికేసి వింతగా చూశాడాయన.

"పొల్యూషన్ ఎక్కడలేదు?" అన్నాడాయన.

"హైదరాబాదంత లేదు. అందుకు నాకయితే సంతోషంగానే ఉంది''

"చేపలు పట్టారా?"

"లేదు. ఇప్పుడు పట్టాల్సివుంది''

"ధరలు పడిపోయాయంటున్నారు''

"అవును. ఇంక ఎక్కువకాలం ఉంచుకుంటే చేపలు మనని తినేస్తాయి''

"జాగ్రత్తగా చూసి అమ్మండి'' అన్నాడు.

సంకేత్‌తో ఉన్నన్ని రోజులూ సరదాగా గడిచిపోయాయి. తీరా తిరిగి వెళ్లబోయే ముందు పేచీపెట్టాడు. రవీంద్ర కొంచెం మెత్తబడ్డాడు. వసుంధరమాత్రం సీరియస్‌గా చెప్పింది.

"నువ్వు ఇలా చేస్తుంటే ఇంక సెలవులకి కూడా తీసుకురాం. ఆ తర్వాత నీ ఇష్టం"

ఏడుస్తూనే వెళ్లిపోయాడు సంకేత్.

"ఇంకో సంవత్సరం చూసి తీసుకువచ్చేద్దామా?" అన్నాడు రవీంద్ర.

"తీసుకొచ్చి ఏం చేద్దాం"

"దగ్గరలో ఎక్కడైనా పడేద్దాం"

"ఎక్కడైనా పడేసేటట్లయితే ఊటీ అయినా ఒకటే, మన పక్క ఊరయినా ఒకటే. వాడిని చదువుకోనీయండి'' అంది.

"చదువుకోమనేకదా మనం చెబుతున్నాం" అన్నాడు రవీంద్ర.

★ ★ ★

ముఖేష్‌ని కలిశాడు రవీంద్ర.

"ఏమిటి పరిస్థితి?" అనడిగాడు.

"ఏముంది. మనం అనుకున్నట్లే అయింది. కేజీ పదిహేనుకంటే పడటంలేదు''

"అలా అయితే చాలా నష్టం వస్తుందిగా''

"వస్తుంది''

"ఇంక రేట్లు పెరగవా?" అన్నాడు.

"ఎందుకు పెరగవు? కొంచెం టైమ్ తీసు

కుంటుంది''

"అంటే ఎంతని?"

"కనీసం రెండు నెలలు'' అన్నాడు.

"అప్పటిదాకా ఏ మార్పూ రాదంటావ్?"

"నా అంచనా అది'' అన్నాడు ముఖేష్.

"అంతకాలం మనం ఆగలేంకదా! ఓ వారం ఆగి పట్టించేద్దాం"

"అలాగే. ఇప్పుడయితే అసలు లారీలు ఆగిపోయినట్లే''

ఈసారి హౌరా వెళ్లాలా వద్దా అనేది ఇంకా నిర్ణయించుకోలేదు. ఈలోగా సూర్యం కలిశాడు.

"రవీంద్రా! మనం అనుకున్నది జరుగుతుందయ్యా'' అన్నాడు సంతోషంగా.

"ఏమిటండి అది?"

"చేపల రైతుల సమావేశం ఏర్పాటు చేయాలనుకున్నాంకదా! అది జరగబోతోంది. రాష్ట్ర వ్యవసాయ అభివృద్ధి బోర్డు సభ్యుల్ని పిలుస్తున్నారు. కాకపోతే ఈ కార్యక్రమం నిర్వహించాల్సిన బాధ్యత మనమీద పెట్టారు. వచ్చేవారందరికీ ఏ లోపం లేకుండా అన్ని ఏర్పాట్లు చేయాలి. నువ్వు కూడా నా వెనక ఉండాలి. సమయం కూడా ఎక్కువ లేదు'' అన్నాడు.

"అలాగే. కానీ చేపల పట్టుబడి వుందే''

"అదెంత... రెండుమూడురోజుల పని''

"హౌరా వెళ్లాలా వద్దా అని ఆలోచిస్తున్నా''

"ఏమో... ఈసారి నేను ఇక్కడే ఇచ్చేద్దామనుకుంటున్నా. అంతదూరం పోయినా శ్రమ తప్పించి పెద్దగా మిగలటంలేదు. మన ఖర్చులూ, అక్కడకెళ్లిన దగ్గర్నుండీ చేసే వెధవపనులు. ఈ దరిద్రం ఎందుకంటా?"

"సర్లెండి. ముఖేష్ ఉన్నాడు. మాకు బంధువే. తను లారీకి వెయ్యి రూపాయల కమీషన్‌మీద అమ్మిస్తానన్నాడు''

"మరింకేమిటి. అలా చేయండి'' అన్నాడు.

"అయితే ఈ సమావేశానికి ఎవరెవరు వస్తారు?"

"ఎవరెవరేమిటండి బాబూ అన్ని జిల్లాల నుండి రైతులు వస్తారు. మార్కెట్‌యార్డు ఛైర్మన్‌ని పిలుస్తాం. ఇంకా ఐస్ ఫ్యాక్టరీవాళ్లు, లారీ ఓనర్స్, వీళ్లు కాక రొయ్యల చెరువులవారు హాజరవుతారు. చాలా గ్రాండ్‌గా ఉంటుంది. ఇంతకుముందు నామమాత్రంగా ప్రెసిడెంటు, సెక్రటరీ అని అనుకున్నారు. ఈసారి అలాకాదు. మంచి సంఘం తయారవుతుంది. అవసరమైతే మినిస్టర్‌గారు కూడా రావచ్చునంటున్నారు. నేనోసారి వెళ్లివస్తే పూర్తి వివరాలు తెలుస్తాయి''

"అలాగే వెళ్లిరండి'' అన్నాడు.

ఇంటికొచ్చాక చేపల పట్టుబడి గురించీ, ముఖేష్‌కి వాటిని ఇచ్చే విషయం గురించి చెప్పాడు.

"అలానే చేయండి. వారంరోజుల్లో డబ్బులు ఇచ్చేస్తారు. ఈ లారీ కిరాయిలూ, మీరు వెళ్లడం అన్నీ లెక్కలు చూసుకుంటే ఇదే బెటర్. ముందు మీకు అంతదూరం వెళ్లే శ్రమ తప్పుతుంది''

రవీంద్ర తిరిగి ముఖేష్‌ని కలిశాడు.

"మీ పార్టీ హౌరాలో ఉన్నాడా?" అనడిగాడు.

"ఉన్నాడు''

"ఇదివరకు మనం అనుకున్న పద్ధతేనా?"

"అవునండి. లారీకి వెయ్యి రూపాయలు చాలు. ఆరోజు ఎంత ధర ఉంటే అంత. అయినా మీదగ్గర అలా చేయంకదా!" అన్నాడు.

"అలా అయితే మిగతా ఏర్పాట్లు చూసుకోండి'' అన్నాడు.

ముఖేష్ తలూపాడు.

చేపల పట్టుబడి ప్రారంభం అయింది. కొంచెంసేపు సూర్యం కూడా వచ్చి




కూర్చున్నాడు. మొత్తంమీద చూస్తుంటే చేపల పెరుగుదల కూడా సంతృప్తికరంగా లేదనిపించింది. ధరలు లేకపోవటంతోపాటు ఇదో దెబ్బ. ఈసారి నష్టం రాకపోయినా గతంతో పోల్చుకుంటే ఆ లాభం రాదు. ఆమేరకు అది నష్టమే.

"ఎల్లుండినుండి మీరు నాతో ఉంటున్నారు'' అన్నాడు సూర్యం.

"తప్పకుండా'' అన్నాడు.

రెండు రోజుల్లో చేపలు పట్టడం పూర్తయింది. లారీలు వెళ్ళిపోయాయి. ఇంక రవీంద్రకి తీరికే లేదు. సూర్యంతో కలసి తిరుగుతున్నాడు. ముందు హాలు మాట్లాడటం, అధికారులకీ, రైతులకీ ఆహ్వానాలు అందించడమూ కొన్ని లాడ్జిలు బుక్ చేయటం అంతా పెద్ద పని. కారు చేతిలో ఉన్నా ఒక్కొక్కరి దగ్గరకు వెళ్ళగానే కాఫీలంటారు. వారి బాధలు చెబుతుంటారు. ఎంత తప్పించుకుందామన్నా కుదరదు. తర్వాత లోకల్ ప్రెస్‌వారిని కలుసుకుని మాట్లాడటం జరిగింది. వారు తప్పకుండా కవర్ చేయగలమని చెప్పారు.

"కర్టెన్ రైజర్‌గా మీలో ఎవరన్నా ఈ సమస్యలమీద ఓ వ్యాసం రాస్తే ఓరోజు ముందుగా ప్రచురిద్దాం" అన్నారు కొందరు.

"అదేదో మీరే చేయండి. చాలాపనులు మీద తిరుగుతున్నాం. అంతగా డిటెయిల్స్ కావాలంటే కొన్ని పత్రికలు ఇస్తాను. ఇంక మీ పాతపేపర్లు తిరగేసినా చాలా విశేషాలు తెలుస్తాయి'' అన్నాడు సూర్యం.

ప్రతినిధులకు చెంది భోజన ఏర్పాట్లు చూడాలి. అలాగే టీ స్నాక్స్ అందించాలి. పూలదండలనుండి మొదలై, వందన సమర్పణదాకా ఏమేం చేయాలో అన్నీ వివరంగా రాసుకున్నాడు. చాలా చక్కగా కార్యక్రమం రూపొందించాడు సూర్యం. ఆయన పనివిధానం చాలా ముచ్చటగా అనిపించింది.

అంత హడావుడిలోనూ రవీంద్ర హౌరా ఫోన్ చేయటం మరిచిపోలేదు. ఆరోజు కేజీ ధర పంధొమ్మిది రూపాయలు. సంతోషం కలిగింది. కొంచెం మార్పు వచ్చింది. తిరిగి ధరలు పెరగొచ్చుననే ఆశాభావం కలిగింది.

"ధర పెరిగింది. కారణం ఏమిటంటారు?" అనడిగాడు సూర్యాన్ని.

"ఏముంది డిమాండ్ అండ్ సప్లై?" ధర లేదు అనేసరికి ఒక్కసారిగా రైతులందరూ సరుకు పంపటం మానేశారు. సరుకు తగ్గిపోయింది. డిమాండ్ పెరిగింది. రేపట్నుంచి మళ్ళీ బాగా పంపించారనుకోండి. సరుకు ఎక్కువయితే ధర తగ్గుతుంది. ఇదంతా ఎకనామిక్స్‌కదా'' అన్నాడు.



మొత్తంమీద అంత బిజీలోనూ రాత్రి తొమ్మిదిగంటల తర్వాత సూర్యం కారుని సినిమాహాలు ముందు ఆపాడు. అక్కడ ఎవరినైనా కలవాల్సి ఉందేమో అనుకున్నాడు. అయితే రెండు టిక్కెట్లు తెచ్చి "పదండి'' అన్నాడు.

"ఇదేంటండి బాబూ. ఇంత హడావిడిలో

సినిమా చూడటం. అంత గొప్ప కళాఖండ మూ... అందులోనూ మొదటిరోజు''

"ఛస్తామా? మన చేపలవాళ్లు సినిమా తీస్తే కనీసం మనమైనా చూడాలికదా''

"అంటే'' అన్నాడు ఆశ్చర్యంగా.

"ఇది మన గోపాల్‌గాడి సినిమా''

"నిజమా. నాకసలు గుర్తులేదండి. అసలు మొన్ననేగా మొదలుపెట్టాడు. ఎప్పుడు పూర్తి చేశాడు. ఎప్పుడు ప్రింట్లు తీశాడు. ఇదేదో హాంఫట్ మంత్రంలా ఉందే''

"సొమ్మొంటే కొండమీద కోతి కూడా దిగివస్తుంది. నేను కాల్షీట్‌లివ్వను. అని ఎవడూ కూర్చోడు. విసురుతుంటాడంతే. ఈరోజు తెలుగు సినిమా ప్రొడక్షన్ కాస్ట్ మన ఫీడ్‌ధరల్లా విపరీతంగా ఎందుకు పెరిగిపోయాయనుకుంటున్నారు. మనాడిలాంటి వారి వల్లే. వీళ్ళేమీ సీరియస్ ప్రొడ్యూసర్స్ కాదు. సినిమా తియ్యటం కావాలి. లక్ష అయ్యేచోట పది లక్షలు చేస్తారు. ఇంక వాళ్లు ఆ రేటుమీదే ఉంటారు. ఓ క్రమశిక్షణా ఇంకోటా...''

థియేటర్‌లోకి వెళ్ళికూర్చున్నారు. హాలంతా కోలాహలంగా ఉంది. జనం వెల్లువలా దూసుకొస్తున్నారు. అభిమానులు కరపత్రాలు పంచుతున్నారు. తెరముందు పూలబుట్లతో తయారుగా ఉన్నారు. బూరలు ఊదుతున్నారు.

సినిమా ప్రారంభం అయింది. నిర్మాతగా గోపాల్ పేరు క్షణం మెరిసి మాయం అయింది. మొదటి సగం అయింది. అప్పటికి మూడు పాటలు మాత్రం పూర్తిఅయ్యాయి. సినిమాలో ఇద్దరు హీరోయిన్లు ఉన్నారు. వారి నాభిసౌందర్యం తెరనిండుగా పరుచుకుంది. పాటలకి ఎంత ఖర్చుపెట్టారో చెప్పటానికి లేదు. డబ్బు అలా విరజిమ్మారు. అందులో కథేమిటో ఇంతవరకూ అర్థంకాలేదు.

కూల్‌డ్రింక్ తాగుతూ అన్నాడు సూర్యం.

"సినిమా ఎలా ఉందంటారు?"

"మీకెలా ఉందో చెప్పండి'' అన్నాడు రవీంద్ర.

"చెప్పేదేముంది. హౌరా మార్కెట్‌లా ఉంది. మనం ముందే చెప్పాంకదా వాడికి. కనీసం మంచికథ చూడరా బాబూ అని. అది తప్పించి అన్నీ ఉన్నాయి. చివరకి ఈ కథలో దేశభక్తి కూడా''

"మరి అప్పుడప్పుడూ ప్రత్తి చెక్క పడుతుంటేనేకదా చేపలు పెరిగేది''

"వీళ్ళకి దేశభక్తి దగ్గర్నుంచి అన్నీ మషాళాలే. ఆ హీరోయిన్ చూశావా. గొప్ప భక్తిపరురాలు. చీరమాత్రం బొడ్డు కింద. వీళ్ళకంటే నీరజా వాళ్లు చాలా నయంకదూ. ఎంత హుందాగా కనిపించారు''

"కనిపించటం కాదండి. వాళ్లు మనందరికంటే ఏ విషయంలో చూసినా హుందాగానే ఉన్నారు. ఏం చేస్తాం. కానీయండి. ఇంతకూ సినిమా హిట్ అవుతుందంటారా?"

"హిట్టా? ఇప్పటికి మూడు పాటలకి డాన్సులు చేశారు. రేపు ఇదే సూపర్ డూపర్ హిట్ అండి బాబు. గోపాల్‌గాడికి ఫాలోయింగ్ వచ్చేసినట్లే. ఈసారి వాల్‌పోస్టర్‌లో వాడి బొమ్మ తప్పదు''

రవీంద్ర నవ్వుతుంటే "పదండి'' అన్నాడు.

"ఓ పది సినిమాలు తీసి వాల్‌పోస్టర్‌మీద వేసుకున్నాడంటే ఓ అందం ఉంది. తీసేది మొదటి సినిమా. తర్వాత కనిపిస్తాడో లేదో తెలియదు. ముందు ఆడు నిర్మాతా, జేబుదొంగా తేల్చుకోలేం. ఆడి ఫొటో... నిజం చెబుతున్నా. కొంతమంది ఫొటోలు చూస్తే సినిమాకి వెళ్ళాలనిపించదు''

"మీరు మరీనండి. అంతంత డబ్బు ఖర్చుపెడితే కనీసం ఫొటో అయినా వేయించుకోకపోతే ఎలా?"

తిరిగి సినిమా మొదలైంది. క్లైమాక్స్ మాత్రం చాలా గంభీరంగా తీశారు. కార్లు ఎగిరి లోయల్లో పడిపోయాయి. ఎటుచూసినా




మంటలు... బాంబులు... అల్లకల్లోలం. వాటి నడుమ హీరోగారి విన్యాసం... సినిమా అయిపోయింది. చివరనో టైటిల్ కార్డ్ పడింది.

"ఎ ఫిల్మ్ బై..."

"బాగుంది. పదండి'' అన్నాడు సూర్యం.

కారులో కూర్చున్నాక అన్నాడు, "సినిమాలు మారమంటే ఎందుకు మారతాయి. ఇప్పట్లో తెలుగు సినిమా మారితే నా మీసం గొరిగించుకుంటా''

"మారకపోతే వాళ్ళే పోతారు''

"మన చేపలకి స్లంపు రావటంలా వాళ్లకీ అంతే. వరసనే ఓ ఇరవై సినిమాలు పోతాయి. ఓ సినిమా ఆడుతుంది. మళ్ళీ మొదలు. ఏంలేదు. గోపాల్‌గాడు రేపు రావటమో, ఫోన్ చేయటమో చేస్తాడు. సినిమా ఎట్లా ఉందిరా అంటే చెప్పాలికదా. టాక్ ఎలా ఉందంటాడు. మనం గేటు దగ్గర నిలబడి వచ్చేవారిని అడగాలన్నమాట. సినిమా ఎలా ఉంది సార్ అని. నేను వాడికి చెప్పేస్తా. ఇలాంటి కళాఖండాలు వరసగా ఓ వంద తీసేయండి. జనాలు పిచ్చెక్కి ఛస్తారు అని''

కారు ముందుకు దూసుకుపోయింది.

★ ★ ★

సమావేశం ఆరంభం అయింది.

రవీంద్ర ఆశ్చర్యపోయాడు. తాము ఊహించిన దానికంటే రైతులు ఎక్కువ మంది వచ్చారు. ముందుగా రాష్ట్ర వ్యవసాయబోర్డు సభ్యుడు మాట్లాడాడు.

"ఇప్పటికైనా అందరూ ఓచోట సమావేశం అయ్యారు. చాలా సంతోషం. ముందు చేపల రైతుల మధ్యన సమన్వయం లేదు. ఓ సంఘం స్థాపించుకోవాలన్న ఆరాటం లేదు. ఈరోజు సంఘంగా లేని రంగం అంటూ లేదు. రెండవది చేపల చెరువులు విపరీతంగా తవ్వుతున్నారు. దానికో పద్ధతి అంటూ లేదు. డ్రెయినేజి ఉందా లేదా అని కూడా చూడటం లేదు. బాగా పండే భూములు కూడా చేపల చెరువులుగా తవ్వుతుంటే రేపు రాబోయే కాలంలో తిండిగింజల కొరత వస్తుంది. అంతగా అయితే అవి దిగుమతి చేసుకుంటా మనేది వేరే విషయంగానీ ఓ పద్ధతి లేకుండా. చెరువులు తవ్వుకుపోవటం మూలాన చాలా నష్టాలు వస్తున్నాయి. ఈ విషయం మీ అందరికీ తెలుసు. ముందసలు ఓ సమాఖ్యగా ఏర్పడండి. జిల్లాలవారీ సంఘాలు ఏర్పాటు చేసుకోండి. ప్రతి పదిహేనురోజులకోసారి కలుసుకోండి. మీ సమస్యల గురించి చెప్పుకోండి. చర్చించుకోండి. అప్పుడు ప్రభుత్వం ఏం చేయాలో, ఎలా ముందుకు వెళ్ళాలో ఓ కార్యక్రమం తీసుకుంటానికి వీలవుతుంది.

అతనింకా మాట్లాడుతూ,

"మన దగ్గరో బలహీనతుంది. పక్కవాడు ఏంచేస్తే మనం అది చేస్తాం. వాడికి లాభం వస్తే మనకి వస్తుంది. అంతేగాని కొత్త మార్గంలోకి వెళ్ళటానికి భయం. నేను చెబుతున్నాను. అందరూ ఒకేరకం చేపలు పెంచితే లాభాలు రావటం కష్టం. కొత్తరకం చేపలు ఉత్పత్తి చేయాలి. అందుకు రీసెర్చి సెంటర్లు కావాలి. మావరకు మేం ఆ ప్రయత్నంలో ఉన్నాం. క్యాట్‌ఫిష్ అనే రకం తయారయింది. ఇంక రైతుకి అసలు సమస్య ఫీడ్. దీని ధర విపరీతంగా పెరిగిపోయింది. దీనిని ఎంత తక్కువ ధరకు తయారుచేసుకోవచ్చో ఆలోచించాలి. ఈ విషయంలో కూడా మేం ప్రయోగాలు చేస్తున్నాం. అతితక్కువ ధరలో ఫీడ్‌ని తయారు చేయబోతున్నాం. అని ఈ సందర్భంలో మీకు చెబుతున్నాను''
హాలంతా చప్పట్లతో మోగిపోయింది.

"అంతేకాదు. సంప్రదాయ పద్ధతుల్లో వ్యవసాయం చేస్తానంటే కుదరదు. అలాగే చేపలు పెంచుతానంటే సాధ్యంకాదు. కొత్త ప్రాంతాలకు వెళ్ళాలి. శాస్త్రజ్ఞుల్ని కలవాలి. వారిని తీసుకొచ్చి మన ప్రాంతం చూపించాలి. ఆ నేలని పరిశీలించాక వాళ్లు సలహా ఇస్తారు. ఆ రకంగా అధిక ఉత్పత్తులు

సాధించగలం తప్పితే చెరువులో నీళ్లు పెట్టేసి మేతలు కడతాం... పురుగుమందులు చల్లుతాం అంటే కుదరదు. ఈరోజున రెండుటన్నులు తీస్తే పది సంవత్సరాలకీ అంతే తీస్తావ్. నీ నోట్లోకి వచ్చేదేం ఉండదు''

"ఇంకా చాలా విషయాలున్నాయి. డ్రెయిన్ల నిర్మాణం జరగాలి. నీటిలో అవకతవకలు జరగకుండా మనం ఓ కన్ను వేయాలి. ఇంకో విషయం పొల్యూషన్. ఈ విషయంలో మాత్రం చాలా జాగ్రత్త అవసరం. నేను లాభాలు తింటాను. మీకు రోగాలిస్తాను. అంటే సమాజం చూస్తూ ఊరుకోదు. ఇప్పటివరకూ ఫ్యాక్టరీల కాలుష్యం భరిస్తున్నారు. ఇప్పటికే అతిసారంలాంటి వ్యాధులు ముదిరిపోతున్నాయి. రేపు మొత్తంగా సమాజాన్ని వ్యాధులు ముంచెత్తకముందే మనం తగిన జాగ్రత్తలు తీసుకోకపోతే సమాజంనుండి ఓ యాజిటేషన్... అదేంటి నిరసన వస్తుంది. ఆ తర్వాత అది ఏ రూపం తీసుకుంటుందో చెప్పలేం. రైతులు ఇవన్నీ దృష్టిలో పెట్టుకోవాలి. అలాగే విదేశాలవారి ఆహారపు అలవాట్లు తెలుసుకోవాలి. పైకి కనిపించినంత సులభం కాదు. నీళ్లు పైకి కనిపిస్తుంటాయి. అడుగునేం జరుగుతుందో మనకి కనిపించదు. మనం ఆ అడుగుభాగంలో జరిగేది చూడగలిగే స్థితికి రావాలి''

సమావేశం సగంలో రామచంద్రరావు కనిపించాడు. అందరూ టీలు తాగుతూ మాట్లాడుకుంటున్నారు. "ఏం బాబూ... ఈ ఏర్పాట్లు నువ్వూ ఆ సూర్యం కలిసి చేశారంటకదా. చాలా బాగున్నాయి'' అని ప్రశంసించాడు.

"ఆయన చెప్పిన మాటలు విన్నావుకదా. దేశమంతా తిరగాలి. ప్రపంచాన్ని చూడాలి. పనిలోపని నువ్వు కూడా ఇలాగే రాజకీయాల్లోకి ప్రవేశించాలి''

ఎవరో పిలిస్తే వెళ్ళాడు. రవీంద్రకి ఆయన్ని చూస్తుంటే నవ్వూ, ఆశ్చర్యం రెండూ కలుగుతుంటాయి. నామీద పడ్డాడేమిట్రా నాయనా అనుకున్నాడు.

రెండో సెషన్ వేడివేడిగా సాగింది. ఓ రైతు ఊగిపోతూ మాట్లాడాడు.

"చేపల చెరువులు తవ్విన రైతుకి ఈరోజు మిగులుతున్నదేమిటి? నాకోసారి ఎవరన్నా లెక్కలు చెబితే సంతోషిస్తా. నీయమ్మ... నా నోటికి బూతులొస్తాయి. పండించేది మేమూ... డబ్బులన్నీ బ్రోకర్‌గాళ్ళకా. అసలు మీకు తెలుసా... ధరలు తక్కువ ఇవ్వటం కాదు. ఆలస్యంగా ఇవ్వటంకాదు. సొంతం కొంపలు ముంచిపోతున్నారు. అలాంటివాళ్లను ఏం చేయగలం. ఓ లెక్క చచ్చిందా? ఓ ఆధారం చచ్చిందా? ఆడిస్తే ఇచ్చినట్టు లేకపోతే లేదు. దేశమంతా మేం తినేస్తన్నామనో, గుట్టలు పోసుకుంటున్నావనో ఏడుపులు. పైగా పచ్చిసరుకుమీద టాక్సులు. ఇదిగో ఈరోజున లాభాలు ఐస్‌ఫ్యాక్టరీలవారికి, లారీలోల్లకి, పురుగుమందుల కంపెనీలకి, మేత తయారుచేసేవాళ్ళకి, ఇంకానేమో ఆ దళారులకి. వాళ్ళందరికీ పోగా మిగిలితే రైతుకి. లేకపోతే ఆ పురుగుమందులున్నాయిగా. అయి తాగుతాడు''

అక్కడనుండి ఐస్‌ఫ్యాక్టరీలవాళ్లు, లారీ ఓనర్స్ వారి బాధల గురించి వారు చెప్పారు. పెరిగిపోయిన టాక్సులు. రోడ్లు బాగుండకపోవటం, సరైన పద్ధతులు లేకపోవటం, కరెంట్ కోత... వింటుంటే సమస్యలు తప్పించి మరేమీ కనిపించలేదు. అరుపులూ, కేకల మధ్య మొత్తంమీద ఓ సమాఖ్యగా ఏర్పడాలని నిర్ణయించుకున్నారు. వెంటవెంటనే జిల్లా సంఘాలు ఏర్పడాలనీ, ఆ సమావేశాలు కూడా ఏర్పాటుచేయాలని తీర్మానం చేసుకున్నారు.

సభ ఏకగ్రీవంగా "మార్కెట్ సెస్సు'' ఎత్తివేయాలని తీర్మానం చేసింది.

సూర్యం వందన సమర్పణ చేశాడు.

రైతులందరూ తిరిగి ఎవరి ఊర్లకి వారు




ప్రయాణం అయ్యారు.

"రెండురోజులు పూర్తి విశ్రాంతి తీసుకోవాలి'' అనుకున్నారిద్దరూ

రవీంద్ర ఆ రెండురోజులు ఇంటి దగ్గర నుండి కదలనేలేదు.

★ ★ ★

వారంరోజుల గడిచిపోయాయి.

ముఖేష్ జాడలేదు. మరో రెండురోజులు ఆగాడు. అయినా రాలేదు. ఇంతవరకూ కనీసం అతను ఎక్కడ ఉంటాడో కూడా తెలుసుకోలేదు. ఎక్కడ దొరుకుతాడు అనుకుంటుండగా క్లబ్బు గుర్తుకువచ్చింది. వెంటనే అక్కడికి వెళ్ళాడు. ఆ సమయంలో తను సీరియస్‌గా ఆడుతున్నాడు.

రవీంద్రని చూడగానే విష్ చేశాడు. ఆ రౌండ్ పూర్తయిన తర్వాత పక్కకొచ్చాడు.

"ఏంటిసార్ విశేషాలు?"

"మీరింతవరకూ కనిపించలేదు''

"డబ్బులు రాగానే వద్దామనుకున్నాను'' అన్నాడు.

"ఇంతవరకూ డబ్బులు రాలేదా?"

"ఫోన్ చేశాను. పంపించానన్నాడు. రేపు వచ్చేస్తాయి''

"ఇంటికి వస్తారా?"

"బ్యాంక్ దగ్గరికి రాకూడదూ'' అన్నాడు.

"పదిగంటలకల్లా వస్తాను''

"అలాగే రండి. కూర్చుంటారా?" అన్నాడు.

"లేదు. నేను బయలుదేరతాను'' అన్నాడు. వెంటనే వెనక్కి తిరిగాడు. ఇంకొంచెంసేపు అక్కడే ఉంటే ఆడాలనే కోరికను తప్పించుకోవటం సాధ్యంకాదు. ముందుపోయిన డబ్బులే గుర్తుకొస్తుంటాయి. అనవసరంగా ముఖేష్‌ని అనుమానించానా అనుకున్నాడు.

ఉదయం బ్యాంక్ దగ్గర కెళ్ళగానే ముఖేష్ అరవైవేలు చేతిలోపెట్టాడు "ఇదేమిటి?" అన్నాడు రవీంద్ర ఆశ్చర్యంగా.

"తనింకా డబ్బులు పంపించలేదు. ముందు మీకు అర్జెంటని నా డబ్బు డ్రా చేసి ఇస్తున్నాను''

"ఇన్నిరోజులదాకా అతను డబ్బులు పంపించకపోవటం ఏమిటి?" అన్నాడు.

"అక్కడేం సమస్యలు ఉన్నాయో''

"సమస్యలుండటం ఏముంది. హౌరా మార్కెట్ గురించా నాకు తెలుసు. సరుకు తీసుకున్న వెంటనే డబ్బులు ఇస్తారు. ఇందులో రిస్క్‌గానీ, ప్రాబ్లమ్స్‌గానే లేవే''

"అది కాదులెండి'' అన్నాడు.

"ఏమిటో విషయం సూటిగా చెప్పు''

"అతను నా స్నేహితుడండి. నమ్మి వ్యాపారంలోకి దిగాను. మనిషి మంచోడే. కాకపోతే సెకండ్ ఫ్యామిలీ ఉంది. ఖర్చులెక్కువ"

"అయితే విషయం ఏమిటో చెప్పు''

"ఏంలేదు సార్. పేమెంట్ కొంచెం లేటవుతుంది. మెల్లగా పంపిస్తున్నాడు''

"ఆ ముక్క నాకు ముందే చెబితే నేనే వెళ్ళేవాడినికదా''

"భలేవారే. డబ్బుల గురించి మీకేం భయంలేదు. నేను రేపు మిగతావి సర్దకపోతే చూడండి'' అన్నాడు.

"ఇవన్నీ కాదు ముఖేష్. నాకు ముందు డబ్బులు కావాలి. నీకూ ఆయనకి ఏం గొడవలున్నాయో నాకు తెలియదు. రేపు నాకు రావలసింది క్లియర్ చెయ్యి''

"తప్పకుండా సార్' అన్నాడు.

అతను వెంటనే బండిమీద వెళ్ళిపోయాడు.

ఎందుకో అనుమానం వచ్చింది. సరాసరి సూర్యం దగ్గరకి వెళ్ళి జరిగిన విషయం చెప్పాడు.

"మీ చుట్టాలని చెప్పావుగా రవీంద్రా''

"ఏదో దూరానికి. పైగా ఇతను లవ్‌మారేజ్

చేసుకోవటంవలన ఇంటి దగ్గర గొడవలయి పోయాయి. వాళ్లు మాట్లాడటంలేదు''

"అతని పేరన ఆస్తులు లేవా?"

"ఉండవనుకుంటున్నా. రామచంద్రరావు గారు తెలుసుకదా''

"ఆయనా! తెలుసు''

"ఓరోజు పొద్దున్నే తీసుకొచ్చాడు. మంచి కుర్రాడు. నువ్వు అందరికీ చెప్పి సరుకు ఇప్పించాలన్నాడు. ఇంకా నయం. ఎవరికన్నా చెప్పుంటే నామీద పడిపోయేవారు''

"ఇప్పుడింతకీ కేసు అనుమానమంటావా?" అన్నాడు.

"చూద్దాం. రేపు ఇస్తానంటున్నాడుగా''

"ఇంతకీ అతని అమ్మా, బాబన్నా సొండేనా?"

"చాలా ఉందండి బాబూ. కాకపోతే చెప్పకుండా ఆ పెళ్ళి చేసుకున్నాడని గోల తప్పితే అతనికేంటి?"

- "ఓపని చెయ్యి. ఓసారి రామచంద్రరావుగారిని కలిసి మాటేసి ఉంచు. ఆయనింకా పదిమందికి చెబుతాడు. లేనిపోని తలనొప్పి. అయినా నీకు బాగా తెలుసు. చుట్టం అంటే ఫర్వాలేదులే అనుకున్నాను. ఇలా ఇవ్వకూడదండి బాబూ. రూపాయి పోయినా నష్టంలేదు. చేతిలో క్యాష్ పడ్డాక సరుకు ఇవ్వటం. లేదా పెద్ద కంపెనీ అయినా అయివుండాలి. వాళ్ళకంటే ఆస్తులుంటాయి. కొంతలో కొంత నయంకదూ''

"కానీండి. ఇదో అనుభవం" అనేసి వెళ్ళాడు.

రామచంద్రరావుగారు దొరుకుతాడా దొరకడా అని సందేహించాడుగాని మొత్తంమీద ఇంటి దగ్గర విశ్రాంతి తీసుకుంటూ కనిపించాడు.

"రా బాబూ రా'' అంటూ లేచివచ్చాడు.

"దొరికేవాడినే కాదు. ఆరోగ్యం బాగుండలా? ఇంటి దగ్గర గొడవ చేశారు. పనులు చాలా ఉన్నాయి'' అన్నాడు తనే.

"ఇదిగో కొంచెం టీ పంపించు'' అని కేకపెట్టాక...

"చెప్పు బాబూ ఏం పనిమీద వచ్చావు?"

"ఆరోజు మీరు మా ఇంటికి తీసుకొచ్చారే ముఖేష్'' ఆయనకి వెంటనే గుర్తుకు రాలేదు.

"అదేనండి..."

"ఆగాగు. గుర్తొచ్చింది. కేశవరావు కొడుకేగా. నేను తీసుకొచ్చాగా''

"ఈసారి మన సరుకు తన ద్వారానే హౌరాకి పంపించా''

"అలాగా. మంచిపని చేశావ్'' అన్నాడాయన.

"మంచిపని కాదండి బాబూ. ఇంతవరకూ సొంతం డబ్బులు రాలేదు. నిన్న కొద్దిగా ఇచ్చాడు. రేపు మిగతావి ఇస్తానన్నాడు. తన పార్టనర్‌కి ఏవేవో ఉన్నాయని చెబుతున్నాడు. అతని గురించి తెలుసుకుని మీకు చెప్పిపోదామని వచ్చాను''

రామచంద్రరావు ముఖం మాడిపోయింది.

"ఓరి వెధవా ఇలా చేశాడా?" అన్నాడు.

"ఇంతకూ ముఖేష్ గురించి తెలిసింది చెప్పండి''

"ఏముంది? మనాడు. పైగా వాళ్ళ బాబు తెలిసినవాడు. నా ముందుకొచ్చి పెళ్ళి చేసుకుంటే తరిమేశారు అని ఏడిస్తే నీలాంటివారికి చెప్పా. వాడింత వెధవనుకోలా''

"తను కాదనుకుంటాలెండి. అతని పార్టనర్''

"వాడెక్కడివాడో. అసలు వీడి గురించి ఈ మధ్యనే తెలిసింది. ఈడికి ఎప్పుడూ ఆ క్లబ్బు దగ్గర పనేంటో నాకు చెప్పు'' అన్నాడాయన.

"ఈడి వయసెంతయ్యా రోజూ క్లబ్బులో పేకాట. అది లేకపోతే కూర్చుని తాగటం. అది కాదయ్యా. నువ్వు లక్షణంగా ప్రేమించి పెళ్లి చేసుకున్నావు. ఇంకా నీకు ఇంకోరికేని





చూసే పనేంటి. ఎవరో చెప్పారు. ఆడి ముఖా నికి ఇంకా అమ్మాయిలు కావాల్సి వచ్చింది. నిజం చెబుతున్నా. ఆడు ఇంతవరకూ నాకు కనిపించలేదు. ఇదిగో ఈ వ్యాపారం చేసు కుంటున్నా అని చెప్పలా. సామాన్యుడను కుంటున్నావేంటి?"

"అదేంటండి బాబూ. కొత్త విషయాలు చెబుతున్నారు. ఇదంతా తన పార్టనర్ చేస్తు న్నాడని చెప్పాడు''

"ఆడక్కడ చేస్తాడు. ఈడిక్కడ. నాకు కనిపించాలి. ముఖం పగిలేలా చీవాట్లు పెడ తాను. నిజం చెబుతున్నా బాబు. మనాడు బాగా డబ్బులున్నాడు. ఈ కాలంలో కుర్రాళ్లు ఇంకా లక్షలు వస్తాయని చూస్తారుగానీ ప్రే మించి పెళ్ళి చేసుకుందామనుకోరు. పెద్దాళ్లు ఛాదస్తంతో కోపంగా ఉన్నారనుకున్నాను. ఇంత వెధవని తెలియదు'' రవీంద్రకి ఈ వ్యవహారం చాలా చిరాకనిపించింది.

"అతనెలాంటి వాడయితే మనకేమిటి లెండి. మన డబ్బులు మనకొస్తే చాలు''

"అవునవును. ఆ విషయంలో నువ్వు వెుత్తబడకు. గొంతుమీద కూర్చో'' అన్నాడు.

రవీంద్ర ఆయన దగ్గరనుండి వచ్చాడు. ఓ విషయం స్పష్టంగా తెలిసిపోయింది. ముఖేష్ డబ్బులు ఇవ్వలేని పక్షంలో రామచంద్రరావు చేయగలిగిందేమీ లేదు. అతనివల్ల ఈ పను లు కావు. తనెంతసేపటికీ ఎం.ఎల్.ఎల చు ట్టూ తిరగటం, మంత్రుల దగ్గరికి రాయ బారం పోవటం, ఆఫీసుపనులు చేయించ టంమించి ఇవి వేయలేడు. ఇంక ఈ వ్యవహా రంలో తనేదో ఒకటి ఆలోచించుకోవాలి.

ఇంటికి వెళ్ళి స్నానం చేశాక ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"ఏంటి అలా ఉన్నారు?" అంటూ వచ్చింది వసుంధర.

జరిగిందంతా చెప్పాడు. ఆమె ముఖం వివర్ణమైపోయింది.

"ఇంత మోసమా?" అంది.

"చూద్దాం. రేపు ఇస్తానంటున్నాడుకదా?"

"అసలు ఎంతివ్వాలో తేల్చుకున్నారా?"

ఉలిక్కిపడ్డాడు రవీంద్ర. ఇంతవరకూ ఆ విషయం గురించి అడగనేలేదు. ఆరోజు మార్కెట్ ధర కేజీ పంథొమ్మిది రూపాయలు ఉంది. వీళ్ళు ఎంత వేసుకున్నారో చూడాలి. మనసు మరింతగా కృంగిపోయింది. రావల సిన డబ్బులు రావటం ఓ ఎత్తు. పైగా ఇదొకటి కూడా. రాత్రంతా నిద్రపట్టలేదు. ఆరోజు వసుంధర కూడా పుస్తకాల జోలికి పోలేదు. ఆమె కూడా పడుకొని ఆలోచిస్తోంది.



తను చాలా కష్టపడుతోంది. దాదాపు లక్ష రూపాయలకు పైగా షేర్లమీద తిరుగుతు న్నాయి. ఇంత చేస్తుంటే ఓసారి జూదంలో ఇరవై తగలేశాడు. ఈ వ్యవహారంలో ఎంత పోతుందో తెలియదు. కాగితాలమీద లెక్కలు ఉంటాయి. ఇదేం ఎగ్రిమెంట్ కాదు. అతను చేతులెత్తేసినా చేయగలిగిందేంలేదు. ఆమె కెందుకో దుఃఖం వచ్చింది. హైదరాబాద్ నుండి వచ్చాక జీవితం గురించి ఆమె

సమీక్షించుకుంది. ఓరకంగా ఈ క్రమానికి ఆమె అలవాటుపడిపోయింది. ఇదేం పెద్ద బాధకాదు గానీ ఇలాంటి దెబ్బలు నాలుగు తగిలితే తమ పరిస్థితి ఏమిటా అని ఆలోచించింది.

ఆ దృశ్యం గుర్తొచ్చి వణికిపోయింది.

ముందు సంకేత్‌ని అక్కడ చదివించటం కుదరదు. ఊటీనుండి తీసుకువచ్చేయాలి. తిరిగి హైదరాబాద్ వెళ్ళినా అందరూ వెనక నవ్వుకుంటారు. బంగారంలాంటి అపార్ట్ మెంట్ అమ్మేశారుకదా అనుకుంటారు. తిరిగి అన్ని విషయాల్లో చూసుకుని డబ్బులు వాడుకోవాలి. పెద్ద పెద్దవారితో పరిచయాలుండవు. షాపింగ్‌లుండవు. ఈ ఇంటికి వచ్చాక చాలా విషయాలు తెలుసుకొంది. ఆవిడకి ఎంత డబ్బున్నా గర్వంలేదు. చాలా మంది తెలుసు. త్వరలో ఆడవారందరితో కలిసి పిక్‌నిక్ ప్రోగ్రాం ఎనౌన్స్ చేసింది. ఇలాంటి ఆనందాలుండవు. అక్కడి జీవితం అదోరకం. అప్పటికి బాగుంది. ఇప్పుడు తిరిగి పాతజీవితాన్ని తను కోరుకోవటం లేదు. అంత ఆందోళనలోనూ ఆమెకి ధైర్యం ఇచ్చింది ప్రారంభంలో తాము తీసుకున్న షేర్లు.

అది పబ్లిక్ ఇష్యూగా వచ్చింది. ఇప్పుడు దాని ధర వందరూపాయలు దాటిపోయింది. ఇలా కొనసాగితే నూట ఎనభైనుండి రెండు వందల మధ్య నిలబడేలా ఉంది. మరీ అంత అవసరమైతే ఆదుకోవటానికి ఇంటి ఓనర్స్ ఉన్నారు. అదే ధైర్యం. ఏది ఏమైనా హైదరాబాద్‌లో ఉన్నప్పుడు ఇలాంటి జీవితాన్ని ఊహించలేదు. రేపు అలానే తను ఊహించింది జరగవచ్చు అనుకొంది.

ఎప్పుడు తెల్లారిందో తెలియదు. రవీంద్ర ముఖం పీక్కుపోయి వుంది. తనని చూడగానే వసుంధరకే జాలి కలిగింది.

"మీరు బాగా వర్రీ అవుతున్నట్లున్నారు. ఈసారి క్రాప్ సరిగ్గా రాలేదనుకుందాం. అంతగా అయితే రావలసింది రాదు. మహాఅయితే ఓ పాతికవేలు నష్టం వస్తుంది. మరేం బాధపడకండి. దానివార మన షేర్లు బాగున్నాయి. అందులో రికవర్ అవుతాం. ముందు ఆ ముఖేష్‌ని మాత్రం వదలగూడదు. అది మాత్రం గుర్తుంచుకోండి'' అంది.

రవీంద్రకి ఆ మాటలు ఉత్తేజం కలిగించాయి. వసుంధరకున్న ధైర్యం తనకి లేకపోయింది అనుకున్నాడు. అతను ఎంత ఆత్మవిశ్వాసానికి లోనయ్యాడంటే...

ఇవన్నీ పోయినా ఫర్లేదు. నా దగ్గర విద్య ఉంది. నేను కనీసంగా జీవించగలను'' అనుకున్నాడు.

బ్యాంక్ దగ్గర ముఖేష్ కలిశాడు. రవీంద్రని చూడగానే నవ్వాడు.

"మీవాడి దగ్గరనుంచి డబ్బులు వచ్చాయా?" అన్నాడు మామూలుగా ఉండటానికి ప్రయత్నిస్తూ.

"రేపు వస్తున్నాడండి'' అన్నాడు.

"దేనికి?" అన్నాడు.

"మేం లెక్కలు చూసుకుని సెపరేట్ అవుదామనుకుంటున్నాం" అన్నాడు.

"మీరెక్కడ ఉంటున్నారు?" అన్నాడు. ముఖేష్ చెప్పాడు.

"ఇంతవరకు మీ ఇల్లు చూడలేదు''

"పదండి వెళ్దాం" అన్నాడు. ఇద్దరూ కలిసి వెళ్ళారు. ఆ అమ్మాయి వచ్చి నమస్కరించింది. పిల్ల చాలా చక్కగా ఉంది. తను ఎందుకంతగా తల్లిదండ్రుల్ని కాదన్నాడో అర్థం అయింది.

"మీరు నాకో సహాయం చేయాలి'' అన్నాడు ముఖేష్.

"ఏమిటది?"

"రేపు అతన్తో మాట్లాడేటప్పుడు మీరూ దగ్గరుండాలి''

"అలాగే. ఇక్కడేనా?"

"ఇక్కడ కాదులెండి. క్లబ్బు దగ్గర




కూర్చుందాం"

"అక్కడెలా కుదురుతుంది"

"పైన ఖాళీగా ఉంటుంది. అక్కడికెవరూ రారు"

రవీంద్ర తలూపాడు.

★ ★ ★

రవీంద్ర సూర్యాన్నీ, ఇంకో వ్యక్తిని తీసుకొని వచ్చాడు. అతను సూర్యం మిత్రుడు. ముఖంలో పెద్ద పెద్ద మీసాలతో భయంకరంగా కనిపిస్తున్నాడు.

ముఖేష్ పక్కనే అతని పార్టనర్ ఉన్నాడు. నల్లగానూ, సన్నగా ఉన్నాడు. ఇతనికి ఇన్ని వ్యవహారాలు ఉన్నాయా అనే ఆశ్చర్యం కలుగుతుంది.

"నేను ఇక్కడినుండి సరుకు పంపించేట్లూ అక్కడ తను మిగతా వ్యవహారాలు చూసేట్టు అనుకున్నాం. చెరిసగం లాభం తీసుకుందాం అనుకున్నాం. తను ఖర్చులు ఎక్కువవుతున్నాయంటున్నాడు. రెండవది డబ్బులు పంపించే విషయంలో ఆలస్యం జరుగుతోంది. అందుకే విడిపోవాలనుకుంటున్నాను. ముందు నాకు రావలసింది ఇస్తే నా బాకీలు నేను తీర్చుకుంటాను" అన్నాడు ముఖేష్.

"ఇదంతా అనవసరం ముఖేష్. నేను ఎక్కువ ఖర్చులు పెడుతున్నానో, నువ్వు పెడుతున్నావో మనకి తెలుసు. నేను డబ్బులు పంపిస్తున్నా. నువ్వు సరిగ్గా పేమెంట్ చేస్తున్నావో, ఆ డబ్బులు ఇంకేమైనా చేస్తున్నావో నాకు తెలియదు"

"ఇంకేమిటి చెయ్యటం? నాకింకేమన్నా వ్యాపారం ఉందా?"

"వ్యాపారం ఉండనవసరంలేదు. వారంరోజులు ఈ క్లబ్బులో కూర్చుంటే చాలదా? అయినా నువ్వు కూర్చుంటే ఎంత తాగుతావో నాకు తెలుసు?"

"నువ్వు తక్కువా. రెండు ఫ్యామిలీలకి ఎంతవుతుందో చెప్పు"

"నా ఇష్టమయ్యా. పది ఫ్యామిలీలు పెట్టుకుంటా. నీకేమైనా అభ్యంతరమా? నయాపైసాలేకుండా నిన్ను చేర్చుకున్నా. బండి కొన్నావ్. ఎక్కడినుండి వచ్చింది డబ్బు? నీ మెయింటినెన్స్ ఎంతవుతుంది? ఎలా వచ్చింది డబ్బు?" సూర్యం కలిగించుకున్నాడు.

"అవన్నీ తర్వాత. ముందు మా రవీంద్ర లెక్క చూడండి"

అతను ఏవో కాగితాలు ముందుంచాడు.

"దీని ప్రకారం నేను ఇవ్వాల్సింది ఇంత. మిగతాది నాకు సంబంధంలేదు" ఆ మొత్తం చూసేటప్పటికి రవీంద్రకి కళ్ళు తిరిగాయి.

"ఇదేమిటి కేజీ ఎంత పడింది?"

"పదమూడు రూపాయలు"



"అదేమిటి ఆరోజు పంథొమ్మిది రూపాయలుంది"

"లేదండి. మన సరుకు అమ్మింది పదమూడు రూపాయలకి. కావాలంటే మా ఏజంట్ దగ్గరకొచ్చి ఎంక్వైరీ చేసుకోండి"

"అదేంటి సూర్యంగారూ... మనం ఆరోజు ఫోన్‌చేసి కనుక్కున్నాంకదా''

"సరే ఆ ధరకి ముందు లెక్కకట్టండి'' అన్నాడు సూర్యం.

రవీంద్రకు శరీరం స్వాధీనంలో ఉందా అనిపించింది. అమాంతం ఇద్దరిమీదాపడి గొంతు పిసికి చంపేయాలనిపించింది. సూర్యం ఆవేశపడకు అని సైగ చేశాడు. వారిద్దరి లెక్కల ప్రకారం తను ఇవ్వాల్సింది ఇచ్చాడు. అట్లా చూస్తే అసలులో ఇంక ముప్ఫైవేలు ఇవ్వాలి. ధర తేడా విషయం తర్వాత తేల్చుకుందాం అనుకున్నారు.ఆ ముప్ఫైవేలూ ముఖేష్ ఇవ్వవలసివుంది. ఇదే అతను తేల్చిన అంశం.

"ఇప్పుడు చెప్పండి. మీరు డబ్బులు ఎప్పుడు ఇస్తున్నారు'' అన్నాడు సూర్యం.

ముఖేష్ నోటివెంట మాట రావటంలేదు.

"నన్ను చాలా మోసం చేశాడు'' అన్నాడు.

"అదంతా మీరు చూసుకోండి''

"నా దగ్గర డబ్బులు లేవు'' అన్నాడు తలవంచుకొని.

"అంటే... ఐ.పి. పెట్టినట్లా?" కోపంగా అన్నాడు రవీంద్ర.

ముఖేష్ సీరియస్‌గా తలెత్తి చెప్పాడు.

"నాకేం అంత దరిద్రం పట్టలా''

"దరిద్రంకాక ఏంటిరా? ముష్టినాకొడుకులా రామచంద్రరావుని నా కొంపకి తీసుకొచ్చావ్. చుట్టం చుట్టం అంటూ తిరిగావ్. పంథొమ్మిది రూపాయలు మార్కెట్ ధరుంటే పదమూడు రూపాయలు వేశారు. ఎవడబ్బ సొమ్మురా. పైగా మీ లెక్కల ప్రకారం చూసుకున్నా ఇందులో కోత. నాకిప్పుడు డబ్బులు కావాలి''

"ఇదిగో మీరు రా గీ అనొద్దు. మర్యాదగా మాట్లాడండి''

"నీకు మర్యాదేంటిరా బేవార్స్ వెధవ్వి. ఇద్దర్నీ పొడిచి పారేస్తా. నా కొడకల్లారా దేశమొల్ల డబ్బుల్తో ముండల్ని పెట్టుకొని కులకటం, క్లబ్బులో పేకాటలు, హీరోహొండాలు''

"మీరు అనవసరంగా నన్ను అంటున్నారు'' అన్నాడు ముఖేష్ మిత్రుడు.

"ఏంటిరా అనేది. పదమూడు రూపాయలకి అమ్ముతావా. బ్రోకర్ నా కొడకా. లాడ్జింగ్‌లో అమ్మాయిల్ని పడుకోబెడుతున్నావా? చేపలు అమ్ముతున్నారా? నా కొడకా... హౌరా వచ్చి లెక్కలు చూసి నీ తిత్తి తీయక పోతానా''

"మాటలు అనవసరం అండి. మీరు చెప్పండి సార్. నేను ఎవరికి అమ్మానో వారి అడ్రస్ ఇస్తా. తేదీ ఉంది. వాళ్ళ దగ్గర లెక్కలున్నాయి. చూసుకోండి. తేడా వస్తే అడగండి. ఇక్కడేదో స్థానబలిమి ఉందని ఇష్టం వచ్చినట్లు మాట్లాడుకోవటం బాగుండదు. మేం వ్యాపారం చేసుకునేవాళ్ళం. ఈరోజు దుకాణం మూసిపోయేవాళ్ళం కాదు''

"రవీంద్రా కొంచెం ఉండు. మీరు డబ్బులు ఎప్పుడిస్తారు'' అన్నాడు ముఖేష్‌ని.

"నాక్కొంచెం టైమ్ కావాలి''

"అదే ఎంత?"

"రెండు నెలలు''

"అంత కుదరదు''

"ఈలోగా వస్తే ఇచ్చేస్తాను''

"ఎక్కడినుండి వస్తాయో అడుగు సూర్యం. ఆడి మొఖానికి రేపట్నించి బొచ్చె పట్టుకోవాలి''

"ఇదిగో. నువ్వెంత... నీ బోడి పదెకరాల చెరువెంత. పిచ్చిపిచ్చిగా మాట్లాడితే ఊరుకను. అసలు నీకూ నాకూ సాపత్యం ఏంటిరా? నా ఇంటిదూలం ఖరీదు చెయ్యవు'' అన్నాడు కోపంగా.

చేతులు మడిచి మీదకొచ్చాడు రవీంద్ర.

"అంత మొనగాడివయితే నా డబ్బు నాకు





పారేయరా''

"అదే ఉంటే నీ ముఖంమీద విసిరికొట్టేవా డ్ని''

సూర్యం కలిగించుకున్నాడు.

"రెండు నెలలు అంత డబ్బంటే ఎలా కుదురుతుంది?"

"రెండు రూపాయలకి ఎవరు ఇస్తున్నా రు?"

"పోనీ మూడు''

"ఆడికేంటి సూర్యం పది రూపాయలు వడ్డీ ఇస్తానంటాడు. రేపటినుంచి అడ్రసుండ డు''

"ఓహో... తమరికిమల్లే ఏం కొంపలు అమ్ముకోలా''

"మీరెందుకమ్ముకుంటారు? కొంపలు కూలుస్తారుగానీ''

సూర్యంతో వచ్చి నాయన కల్పించుకుని అన్నాడు.

"మీరేంటి అరుస్తున్నారు. ఆయనకి డబ్బు లు రావాలి కాబట్టి బాధ ఉంటుంది. ఆయన నాలుగంటే మీరు పడాలి. లేదంటే ఉన్నదేదో అమ్ముకుని చెల్లించాలి. డబ్బులు లేకుండా పౌరుషాలెందుకు?"

"అది కాదు సార్. ఆయన చుట్టం అయి ఉండి ఎంతెంత మాటలు అంటున్నాడో చూ డండి. నా పరిస్థితి బాగుండలేదని ఆయనకి తెలుసు. 'ముష్టి' వాడు అంటే నేనంత అడుక్కుతినేవాడిలా కనిపిస్తున్నానా?"

"అదలా ఉంచండి. మీరెప్పుడో డబ్బులు ఇస్తానంటే ఎలా? దానికేం పద్ధతి ఉండదా?"

"ఏం చేయమంటారో మీరే చెప్పండి'' అన్నాడు.

"నోటురాసివ్వండి'' అన్నాడాయన.

కొంచెంసేపు ఆలోచించి అన్నాడు- "అలా గే... నాకభ్యంతరం లేదు''

సూర్యం క్రిందకు వెళ్ళాడు. ఆయన దగ్గర నోట్లూ, రెవిన్యూస్టాంపులూ ఎప్పుడూ రెడీగా ఉంటాయి. మొత్తం రెండునోట్లు తెచ్చాడు. సూర్యం మిత్రుడు స్వయంగా రాసి సంతకం పెట్టమని అందించాడు. వాటివంక చూసి అన్నాడు.

"ఏభైవేలకా?"

"అవును... మీరు అంత ఇవ్వనవసరంలే దు. ముప్పై వేలు ఇస్తే చాలు. అయినా నమ్మకం మీద మీకంత సరుకు ఇచ్చినప్పు డు నోట్‌మీద సంతకం పెట్టటానికి ఇబ్బంది ఏమిటి?" అన్నాడు.

ముఖేష్ మాట్లాడకుండా వాటినందుకొని సంతకం చేశాడు.

"అందులో తారీఖువేయకండి'' అన్నాడా యన.

"సాధ్యమైనంత త్వరలో ఇచ్చెయ్యండి'' అన్నాడు సూర్యం.

ముఖేష్ తలూపాడు.

"రవీంద్రా పోదాం పద. కొంచెం పనుంది''

ముగ్గురూ బయటకు నడిచారు. సరాసరి ఓ బార్‌లోకి వెళ్ళి కూర్చున్నారు.

"చాలా డేంజర్ ఫెలోస్''

"ఆ నోట్లు ఎందుకు బాసూ- నాలిక గీసుకుంటానికి కూడా పనికిరావు. ఆడి పే రుతో అర ఎకరం కూడా లేదు. ముందసలు ఆ బండి కూడా వాడి పేరుమీద లేదు. ఎవరి దగ్గరో తీసుకున్నాడు. సొంతం డబ్బులు కట్టి ఉండడు. రేపో మాపో లాక్కుపోయినా ఆశ్చ ర్యం లేదు''

"అది కాదులే రవీంద్రా. నోటు ఉండటంవ లన మనకు ఎప్పటికైనా లాభమే. వాడు వెధవ కావచ్చు. వాళ్ళ అమ్మా, బాబుకి బాగానే ఉంది కదా. ఆలోచించుదాం"

అందరూ 'చీర్స్' చెప్పుకున్నాక అన్నాడు.

"ముందు మనం హౌరా వెళ్ళాలి బాస్. అక్కడ ఎంత రేటు పడిందో చూసి ఆ రెండో వాడి వ్యవహారం తేల్చాలి. అదయిపోయాక

ముఖేష్‌గాడి సంగతి చూస్తా. వీడిని అంత తేలికగా వదిలే సమస్యలేదు. ముందు కొడుకుని అరెస్ట్ చేయించాలి. అదీ వ్యవహారం"

"అది కుదురుతుందో లేదో"

"కుదరాలంతే. ఎంత ఖర్చయినా నేను లెక్క చెయ్యను. మీరు కొంచెం తీరిక చేసుకుంటే మనం హౌరా వెళ్ళివద్దాం" అన్నాడు.

"అలాగే" అన్నాడు సూర్యం.

ఇంటికి వెళ్ళాక వసుంధరతో చెప్పాడు.

"అలానే చేయండి. అంతగా అయితే మన ఓనర్‌గారి సహాయం కూడా తీసుకుందాం" అంది.

★ ★ ★

హౌరా వెళ్ళారు రవీంద్రా, సూర్యం, అతని మిత్రుడు. నాలుగు రోజులకిగాని వారికి అసలు విషయం తెలిసి రాలేదు. ఆరోజు మార్కెట్ ధర పందొమ్మిది రూపాయలు ఉండటం నిజమే. అతను పదమూడు రూపాయలకు అమ్మింది కూడా నిజమే. అందుకు కారణం ముందుగా అడ్వాన్స్ తీసుకోవటం. ఆ నాలుగు రోజులూ ముఖేష్ పార్టనర్ అక్కడ కనిపించనే లేదు. అంతకుముందు ఏ అనుభవమూ లేకుండా వచ్చి అమ్మిన విషయం గుర్తొచ్చింది.

"నా అనుమానం వాడు ఇంక ఇక్కడికి రాడు. ఆ వ్యాపారం ఇంతటితో అయిపోయినట్లే" అన్నాడు సూర్యం మిత్రుడు.

"ఇంకెందుకు. వెనక్కిపోదాం" అనుకున్నారు.

వెనక్కివచ్చి లెక్కలు చూసుకుంటే దాదాపు పదివేలు ఖర్చయ్యాయి. ఇంక ఇంతటితో ఆపుదామా అనుకున్నాడు. కానీ మనస్సు అంగీకరించలేదు. చేపల చెరువు దగ్గరికి వెళితే చాలు ముఖేష్ గుర్తొస్తాడు.

"ఎంతమోసం జరిగింది" అనుకుంటాడు.

రాగానే తిరిగి సూర్యంతో సమావేశం జరిపాడు.

"వాడిని అలా తిరగనిస్తే కాదు. ఛీటింగ్ కేస్ పెట్టాల్సిందే. ముందు వాడిని లాకప్‌లోకి తోయించేంతవరకూ నాకు నిద్రపట్టదు"

"కానీ ఆ కేసుపెట్టడం ఎలా?"

"అదెలానో నాకు తెలియదు"

"ఉండు... మనకో లాయర్ ఉన్నాడు. ఆయన్ని కలుసుకుందాం" అన్నాడు. రవీంద్ర ఎంత కోపంగా ఉన్నాడంటే సూర్యాన్ని వెంటనే బయలుదేర తీశాడు. లాయర్ వారు చెప్పిందంతా విన్నాడు.

"ఛీటింగ్ కేస్ పెట్టాలి. అంతే కదా"

"అది కాదండి. ముందు వాడిని అరెస్ట్ చేయించాలి"

"ఆపని సి.ఐ. చేస్తాడులెండి. మీకెందుకు నేను ఫ్రేమ్ చేస్తాగా. కేసు పెట్టడం ఏముంది" అన్నాడు.

మరుసటి రోజుకి కేసు తయారైపోయింది. సి.ఐ.గారిని కలిసి మాట్లాడారు. ఇంటి చిరునామా ఇచ్చారు.

"నేను చూస్తాను కదా" అన్నాడాయన.

ముందో కానిస్టేబుల్‌ని పంపించి 'రమ్మంటున్నారు' అన్నారు. ఇంట్లో ముఖేష్ ఉండి లేడనిపించాడు. 'వస్తే ఓసారి సి.ఐ.గారిని కలవమని చెప్పండి" అన్నాడతను.

ఆ అమ్మాయి దీనంగా అడిగింది.

"ఎందుకో కొంచెం చెప్పగలరా?"

"ఛీటింగ్ కేసు పెట్టారనుకుంటానండి" అన్నాడు.

ఆ అమ్మాయి ముఖేష్‌తో ఈ విషయం చెప్పింది. వెంటనే వెళ్ళిపోయాడు. తన బాబాయిని కలుసుకుని వివరంగా చెప్పాడు.

"ఏం చేయమంటావో చెప్పు. అరెస్ట్ అయితే ఇది మన 'పరువు' సమస్య"

"అంతదాకా ఎందుకు చేసుకున్నావురా" అన్నాడు.

ముఖేష్ తల వంచుకున్నాడు.





"కూర్చోబెట్టి మాట్లాడదాం"

"మాట్లాడేదేముంది. మనం ముప్పైవేలు ఇవ్వాలి. నోటు రాశాం. ఈలోగా మనం అరెస్ట్‌కాకుండా బెయిల్ తెచ్చుకోవాలి''

"అంతా డబ్బుతో పని. మీ అయ్యా దగ్గర్నుంచి కానీ రాదు. ఏం చేయమంటావో చెప్పు''

ముఖేష్ తల వంచుకున్నాడు. ఆయనకి జాలి కలిగింది.

"సర్లే... ఏదో ఆలోచించుదాం" అన్నాడు.

రెండురోజులు చూశాడు రవీంద్ర. ఏమీ చలనంలేదు. తిరిగి లాయర్‌ని కలుసుకున్నాడు. "ఇలా అయితే పనులు కావు. ముందు సి.ఐ.గారితో మాట్లాడండి'' అని సలహా ఇచ్చాడాయన. రవీంద్రకి ఎలా ప్రొసీడ్ అవ్వాలో తెలియదు. అయినా అవసరాలు కొన్నింటిని నేర్పుతాయి. తనే వెళ్ళి సి.ఐ.గారిని కలిశాడు.

"ఏంటి మీ పని కాలేదుకదా'' అని కానిస్టేబుల్‌ని పిలిచాడు.

"ఏం జరిగిందయ్యా'' అన్నాడు రాగానే.

"మొన్న ఇంటి దగ్గర చెప్పి వచ్చానండి. పంపిస్తానన్నారు''

"ఇంతవరకు కలవలేదుగా''

"లేదండి''

"సరే... వెళ్ళు'' అన్నాడాయన.

సిగరెట్ వెలిగించాక చెప్పాడు.

"అతను అరెస్ట్ కాకుండా బెయిల్ తెచ్చుకోబోతున్నాడని విన్నాను''

"అలా కాదు సార్. మీరు తలుచుకుంటే చేయగలరు. నాకు సహాయం చేసిపెట్టాలి. నేను అన్నిటికీ తయారుగా ఉన్నాను. ముందు తెచ్చి లాకప్‌లో పడేస్తే ఆ తర్వాత ఏం చేయాలో చూద్దాం"

ఆయన తలూపుతున్నాడు.

"ఇంక మనమధ్య వేరేవాళ్ళు అనవసరం సార్. తను నాకు ముప్ఫైవేలు ఇవ్వాలి దాన్నిబట్టి మీరు చెప్పండి''

"రెండు వేలు ఇవ్వండి'' అన్నాడాయన.

మాట్లాడకుండా జేబులో నుండి తీసి అందించాడు. తిరిగి కానిస్టేబుల్‌ని పిలిచాడు. కొంచెం 'టీ' పంపించు. 'హెచ్.పి'ని ఇలా రమ్మను. అతను వచ్చి శాల్యూట్ కొట్టాడు.

"ఇదిగో వీరి కేస్ ఉంది కదా. ఆ ముఖేష్. అతని ఇంటిదగ్గర మఫ్టీలో ఎవరన్నా ఉండి, భోజనానికో, దేనికో వస్తాడు కదా. రాగానే తీసుకొచ్చి ఇక్కడ కూర్చోబెట్టండి''



"యస్ సార్'

"ఏ విషయం నాకు ఫోన్ చేసి చెప్పాలి''

"యస్ సర్'

తను ముందుకి వంగి మెల్లగా చెప్పాడు.

"మీతో మాట్లాడటానికి ప్రెసిడెంటుగారు వచ్చారు''

"ఆయనా రమ్మను'' అన్నాడు.

రవీంద్రకి ఇంక అక్కడ ఉండాలనిపించలేదు.

"మరి నేను వస్తాను సార్"

"చెప్పానుకదా. ఈరోజు పని పూర్తవుతుంది. ఈరోజు రాత్రి లాకప్‌లోనే కాపురం" అని నవ్వాడు.

"నమస్కారం"

""టీ చెప్పాం కదా"

"ఫర్వాలేదు సార్. ఆయనెవరో వచ్చారు కదా"

"ఇట్సాల్‌రైట్" అన్నాడు.

రవీంద్ర బయటకు వచ్చాడు.

ఆ గదిలో 'రైటర్' కూర్చుని ఉన్నాడు. మఫ్టీలో ఉన్న కానిస్టేబుల్స్ కనిపించారు. వారితో మాట్లాడుతున్నాడెవరో వ్యక్తి. మనిషి లావుగా ఉన్నాడు. ఖద్దరు చొక్కా తొడిగాడు. రేబాన్ కళ్ళజోడు తగిలించాడు. ఆయనతో చాలా వినయంగా మాట్లాడుతున్నారందరూ. రవీంద్రని చూడగానే 'రైటర్' 'మీరు వెళ్ళండి' అన్నాడు. ఆయన హుందాగా నడుచుకుంటూ సి.ఐ.గదికి వెళ్లాడు.

"కూర్చోండి సార్" అన్నాడు రైటర్.

"కానిస్టేబుల్ 'టీ' అందించాడు. "మాట్లాడారా" అన్నాడాయన. 'హెచ్.సి.'గారికి చెప్పారు అన్నాడు రవీంద్ర.

"ఈ నడుమ కేసులు బాగా పెరిగిపోయాయి. అన్నీ ఛీటింగ్ కేసులూ, విషాలు కలుపుకోటాలూ, తన్నుకోవటాలూ" ఆయనంటున్నాడు గానీ రవీంద్ర మనసు అక్కడలేదు. ఏదో ఆలోచిస్తున్నాడు. 'టీ' తాగటం పూర్తయ్యాక హెడ్ కానిస్టేబుల్‌ని పక్కకు పిలుచుకువెళ్ళాడు. ఆయన చేతిలో ఓ వంద రూపాయలుంచాడు.

"ఈరోజు పని జరిగిపోవాలి"

"ఓ పని చెయ్యండి. మీరు దూరంగా ఉండండి. మీ కళ్ళతో చూద్దురుగాని" రవీంద్ర సరేనన్నాడు. ఏం చేశారో, ఏం చెప్పారో తెలియదు. ముఖేష్ ఇంటినుండి బయటకు వచ్చి వారితో నడిచాడు. ఆ తర్వాత రిక్షా ఎక్కి స్టేషన్‌కి వెళ్ళారు.

రవీంద్ర సంతృప్తితో ఇంటికి వెళ్ళాడు.

★ ★ ★

తిరిగి రాత్రి ఎంతసేపటికీ నిద్రపట్టదు.

ముఖేష్ అరెస్ట్ అయ్యాడు. అంతకుమించి సాధించిందేమీ కనపడటం లేదు. అందుకు ఎంత డబ్బు ఖర్చయిందో, ఎంత టెన్షన్ అనుభవించాడో తలుచుకుంటే తనమీద తనకే జాలి కలిగింది.

జీవితంలో ఇదివరకెప్పుడూ లాయర్‌తో అవసరం రాలేదు. పోలీసులతో అవసరం రాలేదు. కానీ ఈ ప్రపంచంలో కొచ్చేసరికి పరిచయం కాని రంగం అంటూ కనిపించటం లేదు. అయితే అది ఎలాంటిది? ఒక్క అనుభవం అయినా సంతృప్తి పెడుతుందా? 'గిల్టీ'గా ఫీలవటమే...

ఆ రాత్రి ఎందుకో 'పూజ' గుర్తొచ్చింది.

తనొక్కతే జీవితంలో జ్ఞాపకముంచుకునే వ్యక్తి. హైదరాబాద్‌లో ఉన్నా ఆమె పరిచయం అయి ఉండేది కాదు. అంతకుమించి ప్రతి అనుభవమూ తననితాను కుంచింపచేసుకునేదే. ఇందులో తన ప్రమేయం లేకుండా పోలేదుగానీ, అన్నీ తనే చేశాడన్నా అంగీకరించాలనిపించదు. తనిప్పుడు రవీంద్రేనా?

కాదు. ఖచ్చితంగా కాదు. జీవితాన్ని అర్థవంతంగా మలుచుకోవటం కాదిది. అంతవరకూ అర్థం అవుతూనే ఉంది.

ఇదివరకు జీవితపు రథం కళ్ళాలు తన చేతిలో ఉండేవి. ఇప్పుడు తనూ ఓ గుర్రంలాంటివాడు. తన కళ్ళాలు ఎవరి చేతిలోనో ఉన్నాయి. పరుగులు తీస్తున్నది మాత్రం తను.

ఇంక పరుగులు ఆపితే...

తర్వాత... వెనక్కే ప్రయాణమా!

చెమటలు పడుతున్నాయి. మనసు ఓ ఆలోచన మీద నిలవటం లేదు. ముఖేష్ గుర్తొచ్చాడు.

"నీలా మేం కొంపలు అమ్ముకోలేదు".




ఆ మాటలే తనని రెచ్చగొట్టింది.

వాడెవడు ఆ మాటలు అనటానికి. అది తనిల్లు. తను అమ్ముకుంటాడు. లేదా దానం చేసుకుంటాడు. మాట్లాడటానికి వాడికి హక్కు ఎక్కడ ఉంది. అయినా... ఎందుకో ఆ మాటలు ఇంకోరకంగా వినిపిస్తున్నాయి.

అమ్ముకుంది ఇల్లునేనా? ఆనందాన్ని కాదూ! సంకేత్ లేదు. వసుంధర మారింది. తను మారిపోయాడు. చేతినిండా డబ్బులు న్నాయి. అయితే ఆనందం ఏదీ? ఆ జీవన రహస్యం అర్థంకాలేదు. 'అహం' వచ్చింది. 'అవసరాలు' పెరిగాయి. వస్తువులు వరదలా వస్తున్నాయి. ఇంక నిలబడటానికి చోటేలేదు. కంటికి నిండుగా కునుకే లేదు. ఇది విషాదం కాదా?

అటూ ఇటూ దొర్లుతాడు. లేచి కొంచెంసేపు ఆకాశంకేసి చూస్తాడు. అప్పటికప్పుడు బండి మీద చెరువుల దగ్గరికి వెళ్ళిపోవాలని పించింది. అలా వెన్నెల్లో ఆరుబయట మంచంవేసి పడుకుంటే ఏ ఆలోచనలూ లేకుండా హాయిగా నిద్రపోవచ్చు.

అంతలోనే అనుమానం వచ్చింది.

నారాయణ చచ్చి బతికాడు. రోగం చాలా మందిని కుదిపేసింది. ఏం జరుగుతుందోనని భయపడ్డారు. తిరిగి మామూలే. ఇంతకూ నారాయణ నిద్రపోతున్నాడా? మేల్కొన్నాడా? ఇంత గొడవ జరిగాక ముఖేష్ పగబట్టకుండా ఉంటాడా? రేపు ఏ అర్ధరాత్రో, నారాయణ నిద్రపోతుంటాడు. బహుశా చేపలు కూడా నేమో అప్పుడు. ఆ చీకట్లో విషం డబ్బాలతో ముఖేష్ వస్తాడేమో. చేపలు ఆ నీరు తాగి, గిలగిలలాడుతూ... నీటి మీదకు తేలతా యేమో! అలానే జరుగుతుందా? జరగదని గ్యారంటీ ఏముంది?

వెనక్కి వచ్చాడు.

మంచంమీద పడుకుని దుప్పటి కప్పుకు న్నాడు.

వసుంధర మాత్రం ఆనందంగా నిద్రపో తోంది. ఆమెకు ఈ సమస్యలు పట్టవు. ఆవిడ ప్రపంచం ఆవిడది. తను సొంతం పట్టించుకో వటం మానేశాడు. తను ఏమైనా నష్టం కలిగించే పనులు చేయవచ్చేమోగాని ఆమె చెయ్యదు. ఇంక ఆమె ఊహించని విధంగా ఎదురుదెబ్బలు తగిలితే చేయగలిగింది లే దు.

ఇంతకూ ముఖేష్ భోంచేశాడా?

చేస్తే ఏమిటి? చెయ్యకపోతే ఏమిటి? అతని భార్య ఏడుస్తుందేమో.

అవును మరి. అలాంటివాడిని కట్టుకు న్నాక ఏడవకేం చేస్తుంది. ఇంక ఇవన్నీ తనకి అనవసరం. నిద్రపోవాలి అంతే.

బలవంతంగా కళ్ళు మూసుకున్నాడు.

ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు. కళ్ళు తెరిచేటప్పటికి పది గంటలయింది. గబగబా లేచాడు. స్నానం చేసి ముందుగా పోలీస్‌స్టేష న్‌కి వెళ్దామా అనుకున్నాడు గానీ ఈ విషయం సూర్యానికి చెబితే బాగుండునని పించింది. అందుకని అటు వెళ్ళాడు.

మొత్తానికి అనుకున్నది సాధించావ్''

"అది కాదు. మనకి ఆ డబ్బులు రావా లంటే ఈ మాత్రం చెయ్యక తప్పదు''

"ఏమాత్రం"

"ఆయనకి రెండువేలు ఇస్తేగాని లోపల పడెయ్యలా''

"ఇంకో రెండువేలు తీసుకొని బయటపడే స్తాడు''

"అంతేనా?"

"మరేంటనుకున్నావ్. నేను చెప్పాను గు ర్తుందా? చేపల 'రూపాయి' ఎంతమంది దగ్గరికి వెళ్తుందోనని. అందులో వీళ్ళూ ఒక రు''

రవీంద్ర వెర్రి నవ్వు నవ్వాడు.

అప్పుడు తెచ్చి పేపర్ అందించాడు సూర్యానికి, పనిమనిషి.

"వార్తలు చూద్దాం" అంటూ తిరగేశాడు.

ఓచోట ఆగిపోయాడు. కళ్ళు మసగ్గా.

అనిపించాయి.

"ఇదేంటో కొంచెం చదువు. మనకి చెందిందిలా కనిపిస్తోంది'' అన్నాడు.

'చేపల రైతుకి రెండుకోట్లు టోపీ!' పెద్దగా చదివాడు రవీంద్ర.

"అయిందీ, చదువ్ చదువ్'

రవీంద్రపైకి చదవాలనుకున్నాడుగానీ చదవలేకపోయాడు. తమకి దగ్గర్లోని టౌన్‌లోనే జరిగింది. ఆయనకి చాలా పేరుంది. రోజూ కొన్ని పదుల లారీల సరుకు పంపిస్తుంటాడు. ఆయనకి స్వయంగా లారీలున్నాయి. చిన్న ఐస్ ఫ్యాక్టరీ ఉంది. ఇంకా ఇల్లూ, పొలాలున్నాయి. ఇప్పటివరకూ బాగానే ఉంది. ఖచ్చితంగా డబ్బులు ఇస్తాడనే పేరుంది. ఈ వార్తల ప్రకారం చూస్తుంటే చిన్నా, చితకా రైతులు అవుట్... ఉన్న బంగారాలు అమ్ముకోవటమో, సొంతం పొలాలే అమ్మేసుకోవటమో చేయాలి.

ఇంక మరికొందరు ఈ దెబ్బకి తట్టుకున్నా ఫీడింగ్‌కి అప్పులకోసం దేశమంతా తిరగాలి. ఈ ప్రభావం ఏరకంగా ఉంటుందో చూడాలి. రవీంద్రకి నోటంట మాట కరువై పేపర్ తిరిగి సూర్యానికిచ్చాడు.

అంతా చదివి అవతల పడేశాడు.

"ఆయనకి హౌరా వాళ్ళు నెత్తిన చేతులు పెట్టుంటారు. చిన్న చేపని పెద్ద చేప మింగుతుందంటారు చూశావా. అదీ జరుగుతుంది. అందుకని రైతుకి ముద్దనోటికాడదాకా వచ్చేదాకా అనుమానమే. ఛ...ఛ... ఈ ప్రపంచంలో ఎవరిని నమ్మాలో తెలియటంలా. దీన్నిబట్టి చూస్తుంటే ఓ రకంగా నువ్వే అదృష్టవంతుడివి. ముప్పైతో ఆగావు''

రవీంద్రకి నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు.

"పద... నాలుగురోజులు ఏరియా మొత్తం గందరగోళం. ఎంతమంది నాశనం అయిపోయారో కానీ''

మరో పావుగంటకి టౌన్ బయలుదేరారు. రవీంద్రకి 'రాజు'గారు కనిపించారు. ఆయన ముఖంలో ఇదివరకటి తేజస్సు కనిపించలేదు.

"ఏంటి సంగతులు'' అడిగాడాయనే.

"ఏముందండి, మొదటి సంవత్సరం బాగానే ఉంది. ఈ సంవత్సరం ఓ దళారి చేతిలో ఇరుక్కుపోయాం''

"ఏం చేస్తాం చెప్పు. మనకి పది దాకా రావాలి. పేపర్లో చూశావు కదా. రెండంటున్నారుగానీ ఇంకా ఎక్కువే ఉంటుంది''

"ఇంక రావటం కష్టమంటారా?''

"ఇంకేంటి ఏట్లో పోసినట్లే. ఇంకేంటి వచ్చేది''

'అది కాదు సార్. బాగా ఆస్తులున్నాయంటగా''

"ఏభై లక్షలుంటే గొప్ప. అదంతా ఎప్పుడు అమ్మాలి. ఎప్పుడివ్వాలి. ఇదంతా జరిగి చచ్చేదనుకుంటున్నావా? చివరాఖరికి ఎవడో రౌడీ ముండాకొడుకుకి రాసిపెట్టుంది'' అన్నాడు.

రవీంద్రకి అదెలానో అర్థం కాలేదు.

"వస్తా'' అంటూ వెళ్ళిపోయాడాయన.

స్టేషన్ దగ్గరికి వెళ్ళేటప్పటికి తెలిసింది.

"ముఖేష్‌ని ఎవరో విడిపించుకు వెళ్ళారు''

ఎవరా అని ఆరా తీశాడు.

ఆయన పేరు 'సత్యంబాబు' అని తెలిసింది.

★ ★ ★

'సత్యంబాబు' గురించి వివరాలు సేకరించేసరికి మరికొన్ని కొత్త విషయాలు తెలిశాయి.

అతనికి ఇల్లూ-బారూ-పోలీస్‌స్టేషన్ తప్పితే ఇంకోటి తెలియదు. ఇవి మూడూ కాకపోతే ఏ అర్జెంట్ పనిలోనో ఉంటాడు. అరెస్ట్ అయినవారిని విడిపించటం నుండి మొదలై రకరకాల పనులు చేస్తుంటాడు. అతనికి బ




ట్లెట్ ఉంది. మెడలో బంగారపు గొలుసుంటుంది. మనిషి చూట్టానికి ఏమంత క్రూరంగా కనిపించడు. అదేమిటో ఆయన బండి స్టేషన్ ముందు ఆగగానే డి.యస్.పి.గారు వచ్చినట్టు ఉలిక్కిపడతారు. సి.ఐ.గారి గదిలోకి పర్మిషన్ లేకుండా వెళ్ళేది 'బాబు' ఒక్కడే.

ఆయనకి ఆస్తులేం ఉన్నాయో తెలియదు. జేబులో మాత్రం ఎప్పుడూ కొత్త వంద రూపాయల నోట్లు కనిపిస్తుంటాయి. ఎప్పుడూ పక్కన ఎవరో ఒకరుంటారు. వాళ్ళు చెబుతుంటే జాగ్రత్తగా వింటాడు. చాలా తక్కువగా మాట్లాడుతాడు. తనకి ఆంజనేయస్వామి అంటే భక్తి. ఎప్పుడూ నుదుటి మీద బొట్టు ఉంటుంది.

రవీంద్రకి ఏం చేయాలో పాలుపోలేదు. అయినా సి.ఐ.గారిని కలిశాడు.

"నిన్నంతా ఉంచాం, బాబు వచ్చి తీసుకెళ్ళాడు. అయితే ఊరు విడిచిపెట్టకూడదని చెప్పాను. రోజూ వచ్చి స్టేషన్లో హాజరు వేయించుకుంటాడు. అలా రాలేదనుకోండి. ఇంకోసారి తెచ్చి లోపల పడేస్తాం"

"మనకి కూడా అతన్ని ఇక్కడ ఉంచాలని కాదు సార్. మన డబ్బులు మనకి వచ్చేటట్లు చూడాలి. అందుకే"

"చూద్దాంలెండి'' అన్నాడు.

రవీంద్రకి తిరిగి రామచంద్రరావుని కలుసుకోవాలనిపించింది. ఆయన ఈసారి కూడా ఇంటిదగ్గరే ఉన్నాడు. జరిగిందంతా చెప్పాడు.

"ఇంతకీ బాబు ఎవరండి'' అన్నాడు.

"ఏ బాబు... సత్యం బాబా''

"అవునండి... అతనే''

"వాడికి చదువు అబ్బలేదయ్యా. మొన్నటిదాకా అల్లరి చిల్లరగా తిరిగాడు. ముఖ్యంగా ఆ పోలీసులెంట తిరిగేవాడు. ఈ మద్దెన ఆడు పెద్ద మొనగాడయిపోయాడు''

"అంటే'' అన్నాడు రవీంద్ర.

"ఏముంది దాదాగిరి. నీ ఇల్లు ఖాళీ చెయ్యరనుకో, కోర్టు కెళ్తే సంవత్సరాలు పడుతుంది. ఆడికో పది పారేశావనుకో. తెల్లారేటప్పటికి ఖాళీ చేయిస్తాడు. నీకు డబ్బులు రావాలి. పోలీసుల్తోకాదు. 'బాబు' చేసి పెడతాడు. ఇప్పుడు కోర్టులకి వెళ్ళే వాళ్ళు వేరు. మనదేశంలో ఈ కోర్టుల ఆలస్యం భరించలేక ఇదిగో ఇలాంటి వారందరూ పుట్టుకొస్తారు. వీళ్ళు కూడా కమీషన్ ఏజెంట్లే. పర్సంటేజ్ తీసుకుంటారు''

"బాబు మీకు తెలుసా?''



"భలేవాడవే... ఇంతకీ అతనెవరనుకున్నావ్. మనోడేనయ్యా బాబూ. ఇంతవరకూ ఈ దాదాగాళ్ళంతా వేరే కులంవాళ్ళు. ఇంత కాలానికి మన కులంనుండి కూడా ఓ దాదా వచ్చాడంటే మనం చాలా సంతోషించాలి''

రవీంద్ర రామచంద్రరావు హాస్యానికంటున్నాడో, సీరియస్‌గా అంటున్నాడో తేల్చుకోలేకపోయాడు.

"ఇప్పుడేం చేద్దామంటారు'' అన్నాడు.

"వాడికి కబురు చేద్దామంటే చేద్దాం. మన దగ్గరికి వస్తాడు. నన్ను గురువుగారూ అంటాడు. ఎవడన్నా వింటే వాడికివన్నీ నేనే నేర్పాననుకుంటారు" అన్నాడు బిగ్గరగా నవ్వి.

"అయితే నన్నెప్పుడు రమ్మంటారో చెప్పండి" అన్నాడు.

"రేపు సాయంకాలం రాగలవా. ఈ లోపుగా నేను కబురు చేస్తాను"

"తప్పకుండా వస్తాను" అన్నాడు రవీంద్ర.

★ ★ ★

వసుంధర చాలా ఉత్సాహంగా ఉందారోజు. రవీంద్రని చూడగానే చెప్పింది.

"మీకోసమే చూస్తున్నాను... త్వరగా రండి"

"ఏమిటీ విశేషం?"

"మేం మినిస్టర్‌గారి శ్రీమతిని కలుసుకోబోతున్నాం"

"ఎప్పుడు?"

"ఇంకో అరగంటలో"

"అయితే..."

"అయితే కాదండి బాబూ. మన ఇంటి ఓనర్స్ ఓ ప్రపోజల్ పెట్టబోతున్నారు. ఆక్వా కల్చర్ కోసంవారు లాండ్ చూశారంట. అందులో కొంత ప్రైవేట్ వారిది. కొంత లాండ్ గవర్నమెంటుది. ఆ విషయం గురించి ఆవిడతో మాట్లాడాలి"

"ఆవిడేం చేస్తుంది"

"మీకు తెలియదు కదా. మన ఓనర్స్‌కి బంధువులవుతారు"

"ఇంతకాలం చెప్పలేదే"

"ఎందుకు చెప్పలా. ఇప్పుడు ఇటు వస్తున్నారు కాబట్టి కలుసుకుంటున్నాం"

"ఇంతకూ నువ్వేం చెబుతున్నావో నాకు అర్థంకావటంలేదు"

"ఇప్పుడు చేపల చెరువుల పరిస్థితి అంత బాగుండలేదని మనకు అర్థమైంది. పైగా సంవత్సరం అంతకంటే ఎక్కువ ఆగాలి. రొయ్యల చెరువులకి అంతదూరం అవసరం లేదు. ముందు ఆదాయం బాగా వస్తుంది. ఇంటర్నేషనల్ మార్కెట్ ఉంది. చేపలు ఇండియా వరకు మాత్రమే. ఆ మాటకొస్తే కలకత్తా వరకే కదా. ఇవన్నీ ఆలోచించాక నాక్కూడా మనం ఆ రంగంలోకి వెళ్తే బాగుండుననిపించింది. ట్రై చేద్దాం. నష్టం ఏమిటంట?" అంది.

"ఏమో నాకేం ఇష్టం లేదు"

"రొయ్యల చెరువులా లేక నేను ఆమెను కలుసుకోవటమా?"

"నువ్వు కలుసుకో. నాకెలాంటి అభ్యంతరం లేదు. నాకీ చెరువులంటేనే విరక్తి కలుగుతోంది"

"అప్పుడేనా?"

"ఈ సమయం చాలు. ఇరవై సంవత్సరాల అనుభవం వచ్చింది"

"సర్లెండి... రోడ్డుమీద ప్రమాదాలు జరుగుతాయని, నడవకుండా ఉంటామా"

రవీంద్ర మాట్లాడలేదు.

వసుంధర ఇంటావిడతో కలసి వెళ్ళింది.

★ ★ ★

రామచంద్రరావు గారింట్లో సమావేశం జరిగింది.

రవీంద్రని 'బాబు'కి పరిచయం చేశాడు.

"బాబూ- రవీంద్ర మనకి కావలసినవాడు. అసలు ఆ ముఖేష్‌కి తీసుకెళ్ళి పరిచయం చేసింది నేను. అయినా వాడు సరిగ్గా వ్యాపారం చేసుకోరా అంటే ఇలా చేశాడు. ఇంతకీ ఏమంటావో చెప్పు" అన్నాడాయన.

"నేను జరిగింది చెబుతా" అంటూ రవీంద్ర మొత్తం పూసగుచ్చినట్లు చెప్పాడు.

బాబు విన్నాడు.

"నా దగ్గరకొచ్చి వాళ్ళ బాబాయి గోలపె




ట్టాడండి. మనాడిని లాకప్‌లో ఉంచారు. ఎలా అయినా బయటకు తీసుకురావాలని. సర్లే అని బయటకు తీసుకొచ్చాను. ఇప్పుడు మనం చేయాల్సిందేమిటో చెప్పండి. ఆలో చించుదాం. ముందు వాడిని తిరిగి అరెస్ట్ చేయించుదాం అంటే నాకేం అభ్యంతరం లేదు. వాళ్ళు ఏదో ప్రయత్నం చేస్తున్నారు''

"అది కాదు బాబూ. ఈ ఏడుపంతా ఎందుకు. ఆ ఖర్చులన్నీ పెట్టుకునే బదులు బాకీ తీర్చవచ్చును కదా''

"నిజం చెప్పమంటారా?"

"చెప్పండి''

"ఇవ్వటానికి ప్రస్తుతం అతని దగ్గర నయా పైసాలేదు. ఆ బండి కూడా తీసుకుపోయారు. వాళ్ళ ఇంటి దగ్గరకి పంపించాలని ప్రయత్నం చేస్తున్నారు. ముఖేష్ నాన్న కొంతవరకు ఫర్వాలేదు. వాళ్ళ అమ్మ మాత్రం ససేమిరా అంటోంది''

"అది కాదండి. అతని పేరుమీద ఏదో ఒకటి ఉంటుంది. అది కనుక్కోవాలి''

"ఆ సంగతి చూడరా అబ్బాయి'' అన్నాడు రామచంద్రరావు.

"అది కాదండీ... వాళ్ళ అమ్మా, నాన్నల్ని కూడా స్టేషన్‌కి పిలిపిస్తే బాగుంటుందని నా అభిప్రాయం"

"అదేం పెద్ద సమస్యకాదు. అవసరమైతే రెండు రోజులు అక్కడే ఉంచుతాం"

"మా అబ్బాయి చేసిందానితో మాకేం సంబంధం లేదంటారేమో'' అన్నాడు రామచంద్రరావు.

"అలానే అంటారనుకోండి. ఛీటింగ్ కేసులో వాళ్ళని కూడా చేరుస్తాం. రోజూ ఇంటికి పోలీసులు వెళ్తుంటే వాళ్ళకయినా అవమానంగా ఉండదా''

"అదే ఏడిస్తే ఇంతదాకా ఎందుకు. ఎప్పుడో సరిగానే ఉండేది. ఆవిడ మాత్రం పిడుగులు పడినా చలించదు. నయాపైసా వదులుకోదు'' అన్నాడు రామచంద్రరావు.

"ముఖేష్‌ని కూర్చోపెడదామంటే అలానే చేద్దాం. డబ్బులు ఎక్కడికీ పోవులెండి. అంతగా అయితే నాలుగు వాయించేస్తాం. కాకపోతే వాళ్ళు ఎలా ఫీలౌతారా అనేది ఆలోచించాలి. సి.ఐ.మనాడే. మనం ఎంత చెబితే అంత మీరు ఆలోచించుకుని నాకు కబురు చేయండి'' అన్నాడు.

"నువ్వు చెప్పబ్బాయ్''

"నేను అదే అనుకుంటున్నాను. ముందు వాళ్ళింటికి పోలీసుల్ని పంపించి స్టేషన్‌కి తీసుకురావాలి. యస్.ఐ.గారితోనూ, సి.ఐ.గారితోనూ బాగా బెదిరించాలి. ఆ దెబ్బకి లొంగి వస్తారనుకుంటున్నాను''

"సరే... అలాగే చేయించుదాం. ఏం బాబూ''

"అలాగే... నేను సి.ఐ.గారితో చెప్పి కానిస్టేబుల్స్‌ని పంపిస్తా'' అన్నాడు.

"ఇదిగో మీ ఇద్దరికీ పరిచయం చేశాను. ఇంక ఏం పనొచ్చినా మీ ఇద్దరూ మాట్లాడుకోండి'' అన్నాడు రామచంద్రరావు తన పని అయిపోయినట్లుగా.

బాబు నవ్వాడు.

"బాబూ, ఆ రెండుకోట్లు ఎగేసిన కేసు ఏమైంది?"

"ఏమౌతుంది. ప్రయత్నాలు జరుగుతున్నాయి. కొంతమొత్తం వస్తుంది''

"ఇంక వాళ్ళు దివాళా తీసినట్లేనా?"

"ఎందుకు తీస్తారు గురువుగారూ. ఓ వేళ పైవాడు ఓ కోటి రూపాయలకి ముంచాడనుకోండి. వీడు మూడుకోట్లకి ముంచుతాడు. ఓ ఏభైలక్షలు వెనక్కి ఇచ్చినా కోటిన్నర మిగిలినట్లే కదా''

"అంతేనంటావా?"

"అంతగాక ఇంకేమిటి. దేశం గొడ్డుపోయిందా. ఈ ఊర్లో కాకపోతే ఇంకో ఊర్లో తిరిగి వ్యాపారం చేస్తాడు. అంతదాకా ఎందుకు నాలుగు ఇవ్వాల్సిన చోట రెండు.

ఇవ్వమను. తిరిగి ఆయనకే సరుకు వెయ్యక పోతే అప్పుడు నన్నడుగు. ఇదంతే. ఎవడూ చేయగలిగిందిలేదు. చేతయినంత, చేతయిన పద్ధతుల్లో సంపాదించుకోవటమే. నువ్వు ఎలా సంపాదించావని కాదు. నీ దగ్గర ఎంత సొమ్ముంది. దాన్నిబట్టే నీకు గౌరవం. గురువులాంటివాడివి. ఈ విషయాలు నేను మీకు ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు''

రామచంద్రరావు కొంచెంసేపటిదాకా మాట్లాడలేకపోయాడు.

"చివరికి దేశాన్ని ఇక్కడికి తీసుకొచ్చారన్నమాట"

"అప్పుడే ఏమైంది. ఇది మొదలు. అసలు కథ ఇక్కడినుంచి మొదలవుతుంది. ఇంక పది సంవత్సరాల తర్వాత చూడు. ఈ ప్రపంచమే మారిపోతుంది'' అని లేచాడు.

"ఈలోపుగా మేం బతకకూడదురా. ఇంత ఘోరం మేం చూసి చావలేం"

బాబు నవ్వి "మరివస్తా... మీరు కలవండి సార్' అని వెళ్ళిపోయాడు. రవీంద్ర మాట్లాడకుండా కూర్చున్నాడు.

"అదబ్బాయ్. ఆలోచించుకో. నేనూ బాబుతో మాట్లాడతాను. నువ్వే ఎంతోకొంత వసూలుచేసి ఇవ్వరా అని. అసలే నష్టం. ఇంక పోలీసుస్టేషన్ల చుట్టూ తిరగటం ఎందుకు చెప్పు. ఓసారి కోర్టులకీ, స్టేషన్లకీ అలవాటుపడ్డామో ఇంక తిరుగుతూ ఉంటాం. సామెత చెబుతారు చూశావా. ఓడిపోయినవాడు అక్కడ ఏడిస్తే గెలిచినవాడు ఇంటి దగ్గర ఏడుస్తాడంట. అందుకే నీ పని నువ్వు చేసుకుంటే బాగుంటుంది. వచ్చినప్పుడు డబ్బులొస్తాయి. లేదా నష్టం వచ్చిందనుకో. ఇది నా సలహా మాత్రమే. కాదూ కూడదంటే మాత్రం నీ ఇష్టం. నువ్వెలా చేద్దామంటే అలా చేద్దాం"

"నేను వస్తానండి'' అంటూ లేచాడు.

"మంచిది బాబూ'' అన్నాడు.

★ ★ ★

"వసుంధరా నాకిక్కడ నచ్చటం లేదు'' అన్నాడు రవీంద్ర.

"ఏమి నచ్చటం లేదంటారు?" అంది.

"ఈ చెరువులూ, ఈ టెన్షన్. ఇదంతా అసలేమీ నచ్చటంలేదు. నేనిప్పుడు నేనేనా అని అనుమానంగా ఉంది''

"నాకు తెలియక అడుగుతున్నాను. ఈ సమస్యలు మీ ఒక్కరికేనా? అందరికీ ఉన్నాయా? చెప్పండి''

"అందరి సంగతి నాకు అనవసరం"

"ఇంతకుముందు హైదరాబాద్ నచ్చటం లేదన్నారు. సరే అనుకున్నాం. ఇక్కడకు వచ్చాం. రేపు ఇంకెక్కడికి వెళ్దామంటారు?"

"అదే ఆలోచించాలి''

"నాకేం ఆలోచించాలో తెలియదు. అసలు ఓ రంగంలో కాలు మోపాక అనేక సమస్యలుంటాయి. ఏ రంగంలో అయినా అంతే. మనం పారిపోతూంటే ఇంక నిలబడేది ఎక్కడో నాకు అర్థం కావటంలేదు''

"నువ్వు నన్ను అర్థంచేసుకోవటంలేదు''

"అదే పొరపాటు. నాకు బాగా అర్థంఅయ్యారు. మీరు దేనికీ తట్టుకోలేరు. ఎటు గాలివీస్తే అటు కొట్టుకుపోతారు. ఇదివరకే నయం. ఏమున్నా లేకపోయినా ఆ ఉద్యోగం ఉంది. ఇంక వేరే ఆలోచనలేకుండా ఆ పనే సరిపోయేది. అయినా అకస్మాత్తుగా ఈ నిర్ణయం తీసుకున్నారు. మళ్ళీ రెండు దెబ్బలు తగిలేసరికి... ఇంతకీ వెనక్కి వెళ్దామా'' అంది.

రవీంద్ర మాట్లాడలేదు.

"మీ ఇష్టం. సంకేత్‌ని మాన్పించేద్దాం. చెరువులు అమ్మేయటమో, లీజుకి ఇవ్వటమో చేద్దాం. లీవ్ కాన్సిల్ చేసుకొని తిరిగి ఉద్యోగంలో జాయిన్ అయిపోదురుగానీ'' రవీంద్ర అక్కడినుండి లేచి వెళ్ళిపోయాడు.

తిరిగి భాగ్యనగరమా!




ఇదివరకు ఉండటం వేరు. ఇప్పుడు అతిథిగా వెళ్లటం మించి అక్కడ ఉండలేడు. వసుంధర చెప్పింది వాస్తవమే. తను నిలకడ లేనివాడు. గాలికి కొట్టుకుపోయేవాడు. తిరిగి అక్కడకి వెళ్తే.. ఆ వైభవాలు పిలుస్తుంటాయి. వాటి ఆకర్షణనుండి తను తప్పించుకోలేడు. ఆర్థిక పరిస్థితి సహకరించదు. తిరిగి అశాంతి... ఆందోళన. ఏదో చేయాలనిపిస్తుంది. ఎక్కడికో పరుగులు తీయాలనిపిస్తుంది. వసుంధర నవ్వుతుంది కోపం తెచ్చుకుంటుంది. ఇలా అయితే నీ జీవితం నువ్వు చూసుకో అంటుందేమో... అంటే...

ఈ డబ్బులు... ఈ వస్తువులు... ఈ వైభవాలు మనుషుల్ని కలుపుతున్నాయా? కలపటంలేదు. అంతకంతకూ దూరం చేస్తున్నాయి. వసుంధరా, తను పక్కపక్కనే కూర్చుంటారు. ఎవరి ప్రపంచంలో వారు. ఎన్ని మైళ్లదూరం. సంకేత్ ఎంతదూరంలో ఉన్నాడు... ఈ దూరాలు తగ్గవా?

ఇవిలా పెరిగి... పెరిగి...

మనుషులందరూ ఏకాంతంలో మగ్గిపోతారు. నిరంతరం తగాదాలు... మోసాలు... కోర్టులు... పోలీసులు... రౌడీలు... కుటుంబాలు విధ్వంసం అవుతాయి. జీవితాదర్శం ఏమిటో బోధపడదు. ఆనందం అంటే తెలియదు. ఇదే సంస్కృతి?

ఈ ప్రయాణం ఎటు... ఎటు...?

ఆలోచనల్తో తల పగిలిపోతుందా అనిపించింది.

బార్‌కి వెళ్లాడు. టీ.వీలో ఎవరో నర్తిస్తున్నారు. జుట్టంతా విరబోసుకొని పాటలు పాడుతున్నారు. కళ్లప్పగించి చూస్తుండిపోయాడు. ఎలాంటి స్పందనా లేదు. అలా కూర్చున్నాడు. సమయం కరిగిపోయింది.

"సార్... టైం అయిపోయింది'' బేరర్ అంటున్నాడు వినయంగా.

"అవునుకదూ!" బిల్‌తోపాటు పది రూపాయలు అదనంగా ఇచ్చాడు. అతని కళ్లలో మెరుపులు.

'పిచ్చివాడా... ఎందుకంత ఆనందం... ఇదంతా భ్రాంతిరా' అనుకున్నాడు.

ఇంటిదగ్గర తలుపు తీయగానే ముక్కు మూసుకొంది వసుంధర...

ఎలా మంచంమీద వాలిపోయాడో తెలియదు.

వసుంధర కోపంగా చూసింది. మాట్లాడకుండా ఓ పక్కన పడుకొంది.

'ఈ మనిషితో ఎలా వ్యవహరించాలి' అనుకొంది.

ఆమెకీ నిద్రపట్టడంలేదు. ఇది ఏ రూపం తీసుకుంటుందో అర్థంకావటంలేదు. రవీంద్ర మనసులో ఏముందో తెలియటంలేదు. అదేదో చెబితే బాగుంటుంది. మంచో, చెడో నిర్ణయించుకోవచ్చు. ఒకటిమాత్రం నిజం. తిరిగి రవీంద్ర ఏదో నిర్ణయం తీసుకుంటాడు. అది ఎప్పుడు, ఏ రూపంలో బ్రద్దలవుతుందో తెలియదు. అయితే అదిమాత్రం ఖాయం.

ఆమె లేచింది. రవీంద్రకేసి చూసింది.

ఎందుకో సంకేత్ గుర్తుకొచ్చాడు.

స్కూల్‌కి వెళ్లనని తను ఏడవటం గుర్తొచ్చింది. అవును. తనుకఠినంగా ఉండాలి. లేకపోతే రవీంద్ర తనతోపాటు ఈ కుటుంబాన్ని ఏంచేస్తాడో ఊహించటం కష్టం అనుకుంది.

★ ★ ★

"అరేయ్ నిన్ను చంపేస్తా'' అరిచాడు రవీంద్ర.

"ఏడ్చావులే. ఇలా కూర్చో'' అన్నాడు శ్యామ్.

మాట్లాడకుండా కూర్చున్నాడు రవీంద్ర.

"ఎందుకురా నీకంత కోపం వచ్చింది?" అన్నాడు.

"ఇదంతా నీమూలంగానే. అసలు ను

వ్వారోజు హైదరాబాద్‌లో నన్ను కలవకుండా ఉంటే ఈ కథ లేదు. రవీంద్ర జీవితం వేరుగా ఉండేది''

"ఇప్పుడేమైందిరా?"

"ఏమైందా? సంతోషం ఎక్కడ?"

"సంతోషమా? అంటే ఏమిట్రా?"

"సంతోషంరా... సంతోషం"

"పిచ్చివాడా సంతోషం అంటే ఏమిటో ముందు తెలుసుకో. ఏది సంతోషంకాదు. నువ్వు బతికే చోటులోనే అది ఉంటుంది. నీ ప్రతి అనుభవమూ సంతోషమే. నీ దుఃఖం సంతోషం కాదా? నీ పొరపాట్లు సంతోషం కాదా? పిచ్చివాడా మనిషి అనుభవమే సంతోషం"

"నీ తర్కంతో ఇంకా మోసం చేయొద్దు. నేను బతికేచోటులోనే సంతోషంగా ఉన్నాను. అది నువ్వు కొల్లగొట్టావ్''

"పిచ్చివాడా... నేను చేసిందేముంది. నీ సంతోషం భ్రమన్నాను''

"కానీ కాదు''

"ఆ విషయం ఈరోజు గుర్తిస్తున్నావ్''.

"ఇదంతా నీ మూలానే''

"పిచ్చి రవీంద్రా... శ్యామ్ కాకుంటే ఇంకొకడు వస్తాడు. నీ జీవితంలో ఏముందిరా అంటాడు. అప్పుడయినా నువ్వు పరుగులు తీసేవాడివే. ముందు ఆనందంగా ఉండటం నేర్చుకో'

"అంటే..."

"నువ్వేం చేస్తే అదే సరయింది''

"అంతేనా?"

"అంతే... ఆలోచనలు వద్దు. ఎవరో ఏదో చెప్పారని కాదు. నీ బతుకుని నిర్ణయించుకో వలసింది నువ్వు. అయినా ఇప్పుడేమైందిరా. అంతగా అయితే నాదగ్గరికి రమ్మని చెప్పాను. వచ్చేయ్. ఇద్దరం కలిసి చేద్దాం"





"నీతోనా?"

శ్యామ్ నవ్వుతున్నాడు. తెరలు తెరలుగా నవ్వుతున్నాడు. రవీంద్ర నిద్రలో కలవరిస్తూ ఓ పక్కకు తిరిగాడు. కొద్దిసేపటి తర్వాత తిరిగి ఇంకో కలలోకి జారిపోయాడు.

దివ్యమైన ఓ మందిరంలో అద్దాల గది నడుమ పూజ కూర్చునివుంది. రవీంద్ర పరుగులు తీసుకుంటూ వెళ్లి ఆమె పాదాలచెంత వాలిపోయాడు.

"పూజా... నాకు నువ్వు కావాలి''

ఆమె మౌనంగా నవ్వింది.

"మాట్లాడు పూజా... నాకు నువ్వు కావాలి''

"పూజ ఒకరి సొంతం కాదు రవీంద్రా''

"అలా అనకు. నేను అన్ని బంధనాలూ విడిచివచ్చాను. నాకు కుటుంబం లేదు. ఆస్తి లేదు. నేనుగా మిగిలిపోయి నీకోసం వచ్చాను''

"అది నీ భ్రమ"

"భ్రమా?"

"అవును. అటు చూడు''

గది అవతల వసుంధర నిలబడివుంది. ఆమెముందు సంకేత్ నిలబడ్డాడు.

"వీళ్లెలా వచ్చారు?"

"నిన్ను వెతుక్కుంటూ''

"నీ చిరునామా వారికి తెలియదు''

"ఈ ప్రపంచంలో తెలుసుకోలేనిది అసలు ఉండదు''

"వారి సంగతి నాకు అనవసరం"

"అంటే కుదరదు. వెళ్లు రవీంద్రా... వెళ్లిపో... నిన్ను నా స్నేహితుడివిగా భావిస్తాను. అదిగో ఎదురు చూస్తున్నారు. వెళ్లిరా రవీంద్రా''

"నాకు అశాంతిగా వుంది''

"ఈ ప్రపంచమే అంత'

"నాకు సంతోషం కావాలి''

"ఈ ప్రపంచాన్ని మార్చుకో'

"నాకు చేతకాదు''

"అయితే అనుభవించు"

"లేదు. నేను భరించలేను"

"ఎవరేం చెయ్యగలరు?"

"నువ్వు చేయగలవు. నువ్వు తలుచుకుంటే నన్ను ఈ అశాంతినుండి బయటకు తీసుకురాగలవు. రా... నాతోరా... ఈ ప్రపంచానికి దూరంగా వెళ్లిపోదాం"

"పిచ్చి రవీంద్రా. ఈ ప్రపంచానికి దూరంగా ఏమీలేదు. అంతా ఇక్కడే వుంది"

"అయితే నీ ఇష్టం వచ్చినచోటుకి వెళ్దాం"

"సారీ రవీంద్రా. నేను ఏకాంతాన్ని కోరుకుంటాను. ఎవరి ఆధిపత్యం నాకొద్దు"

"నేను నీ దాసుడ్ని"

"నాకు అధికారం అవసరంలేదు"

"నువ్వు నాకు అర్థంకావటంలేదు"

పూజ నవ్వింది.

"మనిషి ఈ ప్రపంచాన్ని స్వంతం చేసుకోవాలనుకుంటాడు. అందుకే ఈ బాధంతా. అదేం లేకుండా ఆలోచించి చూడు. ఎంత ఆనందమో"

"అంతేనా?"

"అంతే..."

"కానీ ఈ ప్రపంచాన్ని కాదనుకుని, నా సర్వస్వాన్నీ వదిలి నీ దగ్గరకొచ్చాను. నువ్వు తిరస్కరించావ్"

"పిచ్చి రవీంద్రా... నువ్వొక్కడివి వదులుకుంటే సరిపోయిందా? ఈ ప్రపంచం వదులుకోవాలి. నువ్వు నాకోసం వచ్చావుసరే. నేను నీకోసం రావాలికదా!"

"అంటే..."

"నువ్వు నా స్నేహితుడివి మాత్రమే"

"అంటే..."

"అదిగో వసుంధర పిలుస్తోంది. వెళ్లు"

"నాన్నగారూ..." సంకేత్ పిలుస్తున్నాడు.

వెనక్కి తిరిగాడు. ఇంక ఆగలేకపోయాడు. పరుగు పరుగున వెళ్లి సంకేత్‌ని కౌగలించుకుని ముద్దులు పెట్టుకున్నాడు.

వారు ముగ్గురూ చేతులు పట్టుకొని నడుస్తున్నారు.

ఎందుకో వెనక్కి తిరిగాడు.

పూజ చెయ్యి ఊపుతోంది.

★ ★ ★

ఉదయం నిద్రలేవగానే రవీంద్ర ముందుగా చేసినపని శ్యామ్ విజిటింగ్ కార్డు ఎక్కడుందో వెతకటం. ఎక్కడ పెట్టాడో ఎంతకీ గుర్తుకురానేలేదు. పుస్తకాలూ, పరుపుకింద అన్నీ వెతికాడు. బీరువా తీశాడు. అందులో అన్నీ వసుంధరకు చెందిన కాగితాలున్నాయి. పదినిమిషాలు కూర్చుని తీవ్రంగా ఆలోచించాడు. ఎందుకో పాత డైరీ గుర్తొచ్చింది. పుస్తకాలు వెదికితే కనిపించింది. అందుకుని చూశాడు. దొరికింది.

అక్షరాలు మెరుస్తున్నాయి. జేబులో వేసుకొని బయటకు నడిచాడు.

ముందు వాడికి ఫోన్ చేయాలి అనుకున్నాడు.

ఎంత ప్రయత్నం చేసినా ఎంగేజ్ సౌండే.

పదినిముషాలు ఆగాడు. తిరిగి చేస్తే రింగయింది.

"శ్యామ్‌గారు కావాలి"

"ఎవరండి మాట్లాడేది?"

"నేను ఆయన ఫ్రెండ్‌ని"

"ఆయన ఊర్లో లేరు. రాత్రికి వస్తారు"

ఫోన్ పెట్టేశాడు.

రాత్రి ఎప్పుడవుతుందా అని ఎదురుచూశాడు. అసలు గడియారంలో ముల్లు కదలదు. కాలం స్తంభించిందా అనిపిస్తుంది. చాలా అశాంతిగా ఫీలయ్యాడు. బార్‌లో కూర్చుందామా అనుకున్నాడు. ఎందుకో మనస్కరించలేదు. సినిమాకి వెళ్దాం అనుకున్నాడు. తీరా కూర్చున్నాక తలనొప్పి. సగంలోనే లేచి వచ్చాడు. ఏడు గంటలనుండి ఫోన్ దగ్గర కూర్చుంటే రాత్రి ఎనిమిది గంటలకి మొ

త్తంమీద దొరికాడు.

"ఎవరూ...?"

"నేనురా... రవీంద్రని"

"ఎక్కడనుంచి... హైదరాబాద్‌నుంచా?"

"కాదు బాబూ... తమరు కలిశాకే ఆ ఉద్యోగానికి సెలవుపెట్టి చేపల చెరువులు తీసుకున్నా"

"వెరీగుడ్. మంచిపని చేశావ్"

"ఏం మంచిపనిలే. తలనొప్పిగా ఉంది. నువ్వు ఉంటావా... రేపోసారి నిన్ను కలుస్తాను"

"వస్తావా... ఉండు. ముందు ప్రోగ్రాం చూడనీ" అన్నాడు.

"రేపు కాదుగానీ గురువారం ఉంటాను వస్తావా?"

"తప్పకుండా. నువ్వు మరేం ప్రోగ్రాం పెట్టుకోవద్దు"

"భలేవాడివే. నీకోసం చూస్తుంటా"

★ ★ ★

"ఏరా... ఏమిటి విశేషం? మామీద దయ కలిగింది"

"ఏం లేదురా. ఓ విషయం తేల్చుకుందామని వచ్చాను. ఇంతకీ నువ్వు ఆనందంగా ఉన్నావా?"

శ్యామ్ నవ్వాడు.

"నీ భార్యతో పది నిముషాలు తీరికగా మాట్లాడుతున్నావా? నీ పిల్లలతో కాలక్షేపం చేయగలుగుతున్నావా? అసలు నీ దినచర్య ఎలా ఉందో చూసి వెళ్లాలని వచ్చాను" అన్నాడు.

"ఏమిట్రోయ్... రవీంద్రబాబాలా మాట్లాడుతున్నావు"

"నేను అడిగింది చెప్పరా?"

"ఇదంతా ట్రాష్‌రా. అన్నీ కుదరాలంటే సాధ్యంకాదు. నువ్వు చెప్పేదాని ప్రకారం అయితే అడవుల్లోకి పోయి తపస్సు చేసుకుంటే సరిపోతుంది. అయినా మనం చేసే పని గురించి ఆలోచించాలిగాని మిగతావి అనవసరం. ఆ వయసు ముందుందిగా"

"అలా కాదురా... సీరియస్‌గా అడుగుతున్నాను"

శ్యామ్ ఆలోచించాడు.

"చెప్పరా?"

"ఏం చెప్పమంటావు. నేను నా భార్యనీ, పిల్లలనీ ఎప్పుడూ ఏమీ అడగలేదురా. వారికేం కావాలో అది ఇవ్వటం తెలుసు. అంతే"

"ఆనందం తప్పించి" అన్నాడు రవీంద్ర.

"బహుశా కావచ్చు"

"ఇంకో విషయం అడుగుతా చెప్పు"

"అడుగు"

"నువ్వు సుఖంగా ఉన్నావా?"

"ఉన్నావా అంటే ఉన్నాను. లేనంటే లేను"

"అలా కాదు"

"నేను చెప్పేది వినరా. సుఖం ఒక్క బాల్యంలోనే. ఆ సుఖం ఇంతవరకూ నాకు దొరకలా"

"మరెందుకిదంతా"

"మనదేముందిరా పిచ్చోడా. వందల కోట్లు సంపాదించినవారందరూ ఇలానే అనుకుంటున్నారా? అలా అయితే ప్రపంచం ఇంకోరకంగా ఉంటుంది. ఈ యుద్ధాలుండవు. ఈ గోలలుండవు. అసలు అలాంటిది మనం ఊహించలేం కూడా"

"అవును" అన్నాడు రవీంద్ర.

"నీ ఆరోగ్యం ఎట్లా ఉందిరా?" అన్నాడు మామూలుగా.

**ఉలిక్కిపడ్డాడు శ్యామ్. కొంచెంసేపు మాట్లాడలేదు.**

'ఆరోగ్యం అంటే... నీకు నిజం చెబుతున్నారా. నాకో చిత్రమైన రోగం వచ్చింది"

"అంటే...?" అన్నాడు అర్థంకాక.

"ఎయిడ్స్ మాత్రం కాదు"





"ఛ... ఛ..." అన్నాడు రవీంద్ర.

"ఎందుకు ఛ... ఛ. అదేమంత గొప్పవిషయం కాదు. ఈరోజు నాకు రావచ్చు. నీకు రావచ్చు. ముందీ రోగం ఏమిటో తెలుసుకోవటానికి నేను అమెరికా పోతున్నాను"

రవీంద్ర నిర్ఘాంతపోయాడు.

"నిజంగానా?"

"నిజమేరా!"

"నయమవుతుందా?"

"అవుతుంది"

"ఇప్పటికీ నీకు జీవితం గురించి ఆలోచన రావటంలేదా?"

'పిచ్చివాడా' అన్నట్లు భుజంతట్టాడు శ్యామ్.





**ఉపసంహారం**

రవీంద్ర చెరువులు అమ్మేశాడు. దూరంగా ప్రశాంతకరమైన వాతావరణంలో ఓ పదెకరాల కొబ్బరితోట కొనుక్కొన్నాడు. అందులో రెల్లుగడ్డితో ఇల్లు నిర్మించుకున్నాడు. చూడటానికి అదో కుటీరంలా ఉంటుంది. అందులో రంగుల టీ.వీ. ఉంది. వి.సి.ఆర్ ఉంది. తనకోసం ఓ ప్రత్యేక గది ఉంది. దాన్నిండా పుస్తకాలున్నాయి. ఇంకా రకరకాల సంగీతానికి చెందిన క్యాసెట్లున్నాయి. ప్రపంచ సినిమాకి చెందిన క్లాసిక్స్ సేకరించి పెట్టుకున్నాడు.

అయిదు గంటలకి నిద్ర లేస్తాడు. తోటంతా తిరుగుతాడు. స్నానం చేశాక ఏదో ఒక పనిలో మునిగిపోతాడు. వసుంధర ఇప్పుడు తిరిగి ఫిక్షన్ చదవటం ఆరంభించింది. కొంచెం ఆలస్యంగా పత్రికలు వస్తాయి. అయినా ప్రపంచం గురించి టీవీద్వారా తెలుస్తూనే వుంటుంది.

సాయంకాలాలు పాటలు వింటాడు. వెన్నెల్లో విహరిస్తుంటాడు. బాల్యం గుర్తొస్తుంటుంది. శ్యామ్ గుర్తొస్తాడు. చేపల చెరువులూ, హౌరా... పూజా... గోపాల్... సూర్యం... ముఖేష్... రామచంద్రరావు... అందరూ తలపుకొస్తుంటారు.

సంకేత్ ఇంకా ఊటీలోనే ఉన్నాడు. ఇప్పుడు పెద్దగా ఆందోళనలు లేవు. ఆదాయమూ లేదు. అయితే... పడుకోగానే నిద్ర పడుతోంది. అనిర్వచనీయమైన తృప్తిగా ఉంటోంది. ఎప్పుడన్నా మాత్రం ఓ ఆలోచన వస్తుంటుంది.

'ఈ జీవితం ఇలా ఉంటేచాలు. ఇంకే గాలికీ నేను కొట్టుకుపోకూడదు'

తనయితే అలా అనుకుంటాడుగానీ, అది ఎంతవరకో అని అనుమానమే వసుంధరకి!



**ఈ రంగంపై పూర్తి స్థాయి నవల రాయాలని పట్టుబట్టి, దానికి సంబంధించిన సాంకేతిక అంశాలన్నిటినీ ఓపిగ్గా వివరించి, ప్రోత్సహించిన నా మిత్రుడు శ్రీ కూనవరాజు కుమార్ కి ఈ నవల అంకితం.**

**-పి.చంద్రశేఖర అజాద్**

# "తప్పు"పై సమీక్షలు

మార్చి 'చతుర'లో ప్రచురితమైన యమ్.లక్ష్మీరమణకుమారి నవల 'తప్పు'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## పక్షపాతం లేని అర్థం

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

ఈ నవల చదువుతుంటే ఇలాంటి మగాళ్లు వుంటారా అనిపించి, పూర్తిగా చదివాక ఎంత మంది ఇలా తయారవుతారోనని భయమేసింది. అలాగే చదివిన ఆడవారిని 'ఇలాటి మగాళ్లు కూడా వుంటారు, తస్మాత్ జాగ్రత్త!' అని హెచ్చరించింది. డబ్బుకొరకు ఎలాంటి కక్కుర్తి పనులైనా చేయటం గురించి కథలు, సినిమాలు ఎన్నో వచ్చాయి. కానీ డబ్బుకొరకు జీవితాంతం కలిసుండాల్సిన భార్యను, కేవలం డబ్బుకొరకే నటించి, వలవేసి పట్టి పెళ్లి చేసుకున్న మగాడి కథల్లో ఇదే మొదటిదనుకుంటాను.

ప్రతి మగాడు ఏ గుణమైతే భార్యకు కనీసం వుండాలనుకుంటాడో అది లేకున్నా





సరే డబ్బు సంపాదిస్తే చాలనుకున్న రాజేష్ లాంటివాడు కథ చివరన మారినట్లుగా రచయిత్రి రాశారు. అలాంటివారు మారటమనేది కల్ల, కానీ మారతారని మనమనుకోవాలి. అనుకుంటేనే మార్పుకొరకు ఎదురుచూస్తాము, ప్రయత్నిస్తాము కూడా. రచయిత్రి, రాజేష్ ఒకలాంటి భయంవల్ల మారినట్లుగా రాశారు. అలా కాక కథను కొంచెం పొడిగించి అతడు ఆత్మ పరిశీలన చేసుకునేలాంటి సంఘటనల తర్వాత మారినట్లుగా రాసివుంటే కొంచెం నమ్మకం కలిగేది. ఇప్పుడు రాసిన ముగింపు ఏదో రాయాలి కాబట్టి రాసినట్లుగా వుంది. కానీ, కథమాత్రం మొత్తంగా చూస్తే చాలా వెరైటీగా వుంది.

అయితే అందరాడవారికి ఇలాంటి ఇబ్బందులు కలగవు. ఒకవేళ అలాంటి వ్యక్తే తగిలినా వారు ఏ తప్పూ చేయనివారైతే అన్ని కష్టాల్ని ఎదుర్కొనవలసిన అవసరం వుండేదికాదని బాగా తెలియపరిచారు. కొందరు ఆడవారు విచ్చలవిడిగా తిరగటం అలవరచుకున్నందువల్ల తర్వాత్తర్వాత చాలా సమస్యలను ఎదుర్కొనవలసి వస్తుందని చాలా చక్కగా వివరించారు. ఆడ, మగ ఇద్దరూ కలిసి చేసిన తప్పును జనం ఎప్పుడైతే ఇద్దరి తప్పుగా భావిస్తారో అప్పుడే 'తప్పు' అనే మాటకు 'పక్షపాతంలేని అర్థం' అందరికీ అర్థమవుతుంది. అప్పుడే 'తప్పు'లు చేయటానికి ఇద్దరూ వెనుకాడతారు.

-పి.పద్మావతమ్మ
నంద్యాల

---

## యదార్థగాథే

---

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

ఈమధ్య వచ్చే నవలల్లో 'తప్పు' నవల మట్టిలో మాణిక్యమనవచ్చు. నవలలో ప్రతీ ఘటనా నేటి సభ్యసమాజంలో ఎక్కడో ఒక చోట జరిగినదే! జరుగుతున్నదే! నా ఎరికలో చాలామంది ఈ నవలలోని నాయికలాగా నానా పాట్లు పడినవారే. ఇందులోని నాయికే కొంత నయం! తను వండుకున్నప్పుడేనా కొంత తినగలిగింది. బండెడు చాకిరీ చేయించుకొని కూడా తిండి పెట్టని మగమహారాజులు కోకొల్లలు. రాజేష్‌లాటి మగవాడు భార్యనలా కాల్చుకుతినడంలో వింతేమిటి? సమాజంలో పురుషులంతా అలాంటివారని కాదుగానీ అచ్చు రాజేష్‌లాంటి మగవాళ్లని చాలామందిని చూశాను. వాళ్లు సహవాసుల వల్ల మరీ పేట్రేగిపోతారు. ఇక ప్రియ మొదటి తప్పునే దిద్దుకొనేట్లయితే నవలే లేదు. తప్పునిసరిగా రెండోతప్పును (రాజేష్‌ను పెళ్లాడడం) చెయ్యాల్సొచ్చింది. అయితే రాజేష్, ప్రియ నిజాలు తెలుసుకున్నాక మరిన్ని తప్పులు చేశారు. మరోదారి లేక ప్రియ తప్పుచేస్తే మగవాడినన్న అహంతో రాజేష్ తప్పుచేశాడు. ఇలా ఇద్దరూ కూడా తప్పులు చేశారు. నిండా ఊబిలో కూరుకుపోతున్న ప్రియకు చేయూతనిచ్చి బైటకు లాగి 'తప్పు' దిద్దుకొని తన బతుకు తను బతకవచ్చునని మార్గం చూపించిన రాజేశ్వరి ఈ నవలలో చెప్పుకోతగ్గ స్త్రీ. ఈ సభ్యసమాజంలో వెయ్యికి ఒక రాజేశ్వరి వున్నా ఎన్నో కాపురాలు బాగుపడేవి. ఇక సంఘసంస్కర్తలు శుభాదేవి, సుభద్ర నిజంగా గర్వించదగ్గ గొప్పవాళ్లు. ఈ ప్రపంచంలో అలాంటివాళ్లని వేళ్లమీద లెక్కించవచ్చు. ప్రతీ నవలలో నాయిక కష్టాలు పడడమే రాస్తున్నారుగానీ, కష్టాలు గట్టెక్కి సుఖపడేమార్గం చూపించి సంస్కరించే రీతిలో చెప్పింది ఈ నవలలోనే అనుకుంటాను. ఆదినుండి అంతంవరకు పకడ్బందీగా నవలని రాయగలిగేరు శ్రీమతి లక్ష్మీరమణ కుమారిగారు. పొరపాటుగా తెలియక 'తప్పు' చేస్తే సంఘానికి భయపడి ఒణికిపోకుండా తప్పు సరిదిద్దుకొని తల ఎత్తిన నాడు ఈ సంఘం మననేమీ చేయలేదని చివరికి తెలుసుకొన్న ప్రియ ధైర్యంగా నిలబడిన తీరు నాకు చాలా నచ్చింది. తప్పు చేసినవాళ్లకంటే

తప్పు చెయ్యమని రెచ్చగొట్టి ఒప్పించేవాళ్లే పూర్తిగా శిక్షార్హులు. ఇందులోని రాజేష్‌ను ఏ స్త్రీ కూడా క్షమించలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే 'తప్పు' నవల మణిపూస.

**టి.వి. అన్నపూర్ణ**
భువనేశ్వర్

---

## హెచ్చరిక

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**'చ**తుర ద్వారా సున్నితమైన ఓ 'హెచ్చరిక ఈ 'తప్పు' నవల. విషయం తక్కువై, వివరణ కాస్త ఎక్కువై, అంతరాంతరంగాలను తాకే పదజాలం లేనప్పటికీ... పాత్రల్ని నేటి ఫరిస్థితులకనుగుణంగా మలచి... ఉత్కంఠభరితంగా చదివించగలిగారు ఎమ్.లక్ష్మీరమణ కుమారిగారు.

ఆడది ప్రేమలో ముందడుగు వేసినా... మాటకోసం మగవాడివైపే చూస్తుంది. ఆవిధంగా మధు మాటల భరోసావల్ల సుప్రియ 'తప్పు' చేసింది. అయితే సుప్రియ మంజరిని మోసగించటం 'ఆడదానికి ఆడదే శత్రువు' అనేదానికి అర్థంలావుంది. నవల ప్రథమభాగంలో రాగిణి పాత్రద్వారా 'ఓ టీనేజ్ యువతీ... తస్మాత్ జాగ్రత్త!' అని హెచ్చరించారు.

తరతరాలుగా స్త్రీని బానిసగా, ఒక ఆటవస్తువుగా భావిస్తూ ఆడదాన్ని అణగదొక్కాలనే పురుషాహంకార సంకుచిత స్వభావంతోపాటు స్వార్థపూరిత సోమరితనంతో, సమస్యల వలయంలో చిక్కుకుని జీవితాలను అధోగతి చేసుకునే రాజేష్‌లాంటివారు ఈ సమాజంలో కోకొల్లలు. అటువంటివారికి ఈ నవల స్ఫూర్తిదాయకమైన హెచ్చరిక.

విచ్చలవిడి జీవితం, విలాసవంతమైన ఖర్చులకి పగ్గాలు వేయకుంటే కోరికల అసంతృప్తి మనిషిని శాడిస్టుగా చేసి ఎటువంటి కిరాతకానికైనా సిద్ధంచేస్తుందనే నిజాన్ని సుప్రియ దొంగతనంద్వారా తెలియజేశారు. తప్పులు చేయటం సహజంగాని అవి సరిదిద్దుకుని నడవడమే గొప్పతనం అనే ముగింపుతో సున్నితంగా హెచ్చరించారు. పాత్రలు వాస్తవానికి దగ్గరగా ఉన్నాయి. నవలను నాటకీయంగా రక్తికట్టించి సినీమాఫక్కీలో ముగింపు ఇచ్చినా... శుభాదేవిలాంటి లాయర్ల అవసరం వాస్తవ సమాజంలో ఎంతైనా వుంది.

నైతిక విలువలు కాలరాస్తూ, యాంత్రికంగా పరుగెత్తుతూ, కష్టాలు కోరి తెచ్చుకుంటున్న నేటి యువతకు ఒక సుదీర్ఘమైన హెచ్చరిక ఈ 'తప్పు' నవల.

**-టి.త్రినాధరావు**
హడ్డుబంగి (ఒరిస్సా)

---

## దోరవయసు జోరులో...

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**తె**లుగు నవలా సాహిత్యంలో పాఠకులను భూమ్మీద నడిపించి, ఆలోచింపచేసే రచనలు అరుదు. అప్పుడప్పుడు ఒకటో, రెండో వస్తున్నా, అవి 'చతుర'లోనే రావటం ముదావహం.

ఒక వయసులో యువత తీసుకొనే తప్పుడు నిర్ణయాలవల్ల వారి జీవితాలలో ఏర్పడే కల్లోలం, నిర్దిష్టంగా ఈ నవలలో చెప్పబడింది. బియ్యేలు చదివి బియ్యానికి గతిలేని నిరుద్యోగులెందరో ఉన్న ఈ సమాజంలో పదో తరగతి ఫెయిలై ఉన్నపళంగా శ్రీమంతుడైపోవాలని, స్వాప్నిక జగత్తులో విహరించి మెరుపో, మరకో గ్రహించలేని రాజు ఉరఫ్ రాజేష్‌లాంటి యువకులు కోకొల్లలు.

డబ్బున్న అమ్మాయిని ప్రేమించి, పెళ్లాడి తర్వాత ఆ ఆస్తినంతటిని హాయిగా కాలుమీద కాలు వేసుకొని అనుభవించాలనుకునే రాజేష్, మధుచేత వంచింపబడి, విధిలేక రాజేష్




ను పెళ్లాడిన ప్రియ - ఇద్దరూ తమ జీవితాల ను రంగుటద్దాలలో చూసి భంగపడినవాళ్లే. డిగ్రీ చదివి, ఉద్యోగం చేసుకొంటున్న ప్రియ, ఏ చదువూ లేని రాజేష్ ఎత్తులకు చిత్తయిపో వడం విడ్డూరం అనిపించినా, మొండివాడు రాజుకంటే బలవంతుడన్న సామెత ఇక్కడ నిరూపణ అయింది.

రాజేష్‌ను మార్చే ప్రయత్నంలో విఫలమై తానే అతనికి అనుకూలంగా మారి, దొరికిన చోటల్లా అప్పులు చేసి, చివరకు దొంగతనాని కి పాల్పడిన ప్రియ నైతిక పతనానికి పరాకా ష్ఠ. చివరికి శుభాదేవి అందించిన ఆధారంతో ప్రియ తన జీవితాన్ని చక్కగా మలచుకోవటా నికి ప్రయత్నించడం మంచి ముగింపు.

దోరవయసు జోరులో యువతీయువకు లు చేసే 'తప్పు'లు ఎన్ని అనర్థాలకు దారితీ స్తాయో చాలా చక్కగా తన నవలలో వివ రించారు రచయిత్రి. అందరూ చదివి ఆలో చించాల్సిన నవల ఇది.

-కర్రి సత్తిరెడ్డి
గొల్లలమామిడాడ

---

## అనవగాహనాఫలం

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**జీ**వితంపట్ల సరైన అవగాహన లేక చేజేతు లా బతుకుని నరకప్రాయం చేసుకుని, చేసిన పొరపాట్లని సరిదిద్దుకోవటానికి బదులు మరి న్ని 'తప్పు'లు చేసే ఒక అసహాయురాలైన యువతికి, ఒక మహిళాసంస్థని నడిపే అడ్వ కేటు శుభాదేవి చూపిన సరైన దారి - 'తప్పు' నవలలోని సారాంశం. 'దొంగతనాలు చేయడా నికీ, అక్రమ సంబంధాలు పెట్టుకోవడానికీ లేని జంకు, తప్పు మార్గంలో నడవడానికి లేని జంకు మంచిమార్గంలో నడవడానికిమా త్రం కల్గుతుందా. అందుకు భయంగా వుంటుందా?! భర్త బ్లాక్‌మెయిల్‌కి లొంగేవా ర్ని హితుల మంచిమాటలు లొంగదియ్యా వా?!' అంటూ అంతంలేని 'తప్పు'ల చిట్టాకు ఫుల్‌స్టాప్ పెట్టించి సుప్రియ జీవితంలో కొత్త అధ్యాయానికి నాంది పలికిన మంచి నవల 'తప్పు'

పరాన్నభుక్కులుగానూ, ఆషాడభూతులు గానూ అతి సులువుగా చక్రం తిప్పగల రాజేష్‌లాంటి దౌర్భాగ్యులకి కనువిప్పు - ఈ 'తప్పు' తొలుత అతడి ధోరణి నవ్వు కల్గించే దిగా వున్నా జీవితం పరచుకొన్నకొద్దీ అది వికృతంగా రూపొందింది. సమాజంలో ఉన్న ద్వంద్వనీతిని అడ్డంపెట్టుకొని ఎందుకూ కొర గాని రాజేష్‌లాంటి చీడపురుగులు దర్జాగా మనగల్గుతున్నారు.

గురజాడవారి 'కన్యాశుల్కం'లో గిరీశం ఒక్కడే! కానీ ఈనాటి వరకట్న, పురుషాధిక్య సమాజంలో ఇంటికొక్క గిరీశం. రాజేష్ లాంటి ఆషాడభూతులకి ఆనాడు గిరీశానికి బుద్ధిచెప్పిన సౌజన్యారావు పంతులుగారిలా ఈనాడు శుభాదేవిలాంటివారు వున్నారు. ప్ర పంచమనే రంగస్థలంమీద ఎప్పుడూ ఏదో ఒకరూపంలో 'కన్యాశుల్కం' ప్రదర్శించబ డుతూనేవుంటుంది.

కథలో సుప్రియ స్థితిని రచయిత్రి సహ జంగా మలచగలిగారు. నవల ఆసాంతమూ సుప్రియ మోసుపోతున్న తీరు, రోజురోజుకి నిస్సహాయురాలౌతున్న విషయం ఎలాంటి గిమ్మిక్కూ లేకుండా వాస్తవికంగా రాయగలి గేరు. నవల చివరకొచ్చేకొద్దీ 'రాజేష్‌లాంటి (భర్త) శత్రువుని ఎదుర్కోవటం ఎలా?' అనే ప్రశ్న చదివే పాఠలకులకి కూడా కలుగు తుంది. అయితే కథ అడ్డం తిప్పటం శుభాదే విలాంటివారికి మాత్రమే తగునన్న విషయం అంతగా ఎవరికీ స్ఫురించదు. అందుకే... ముఖ్యంగా అందుకే 'స్త్రీవాద సాహిత్యం' మరింతగా రావాలి. యం.లక్ష్మీరమణకుమా రిగారికి కృతజ్ఞతలు, అభినందనలు.

-గుజ్జుల వెంకటేశ్వరరావు
నెప్పల్లి, కృష్ణాజిల్లా

# బీరు సీసాలపై రాగాలాపన!






అమెరికాలో సౌత్‌ఈస్ట్ న్యూయార్కులోని లాంగ్ ఐలెండ్‌కి చెందిన జోసెఫ్ అనే
పేరుగల ఈ ఆసామి ఎప్పుడూ తను తాగే బీరుసీసాలన్నీ పోగేస్తూవుండేవాడు.
స్నేహితులందరూ ఈ విషయంలో ఎగతాళి చేస్తూ 'ఈ సీసాలన్నీ ఏంచేద్దామని
పోగేస్తున్నావ్?' అని ప్రశ్నించేవారు. మామూలప్పుడేకాక మత్తు ప్రభావంలో వున్నప్పు
డు కూడా ఓ చిరునవ్వు నవ్వి ఊరుకునేవాడు ఈ మందుబాబు. అలాంటివాడు ఓ
శుభోదయాన తన స్నేహితులనందరినీ తేనీటివిందుకు ఆహ్వానించి సదరు బీరుబాటి
ల్స్‌తో తాను తయారుచేసిన పియానోను చూపించాడు జోసెఫ్. అందరూ నోరుతెరిచి
చూస్తుండగా ఆ పియానోమీద చక్కగా రాగాలాపన కూడా ప్రారంభించాడా బీరుబా
టిల్ ప్రియుడు.

# ఏరిన ముత్యాలు

★ వన్యమృగాలు కూడా సరదాకోసం సాటి జంతువును చంపవు కాని మనిషి ఒక్కడే సాటివాడిని హింసించి చంపుతాడు

-జె.ఎ.ఫ్రాడ్

★ నిరర్థకమైన శాంతికన్నా ఉపయుక్తమైన పోరాటం మేలు

-గోర్కీ

★ జీవితంలో ఒక లక్ష్యం ఏర్పరచుకోవాలి. దాన్ని సాధించుటకు సర్వశక్తిని వినియోగించుకోవాలి

-కార్లైల్

★ హింసకన్నా దుష్పరిపాలన ఎక్కువ ప్రభావాన్ని చూపుతుంది. ఈ రెంటిలో ఒకదాన్ని ఆమోదించాల్సివస్తే నేను హింసనే ఆమోదిస్తాను

-మహాత్మాగాంధీ

★ కేవలం బ్రతకడంలోనే విశేషం లేదు. ఒక ఉన్నతాదర్శంకోసం ఆత్మార్పణ చేయడంలోనే గొప్పదనం ఉంది

-ఆగస్ట్‌రోడిన్

★ మనకు ఏది అర్థంకాదో దాన్ని పొందలేము

-గథే

★ ఒక గెలుపు లక్ష తప్పులను మరుగుపరుస్తుంది

-జార్జ్ బెర్నార్డ్‌షా

★ అస్పృశ్యత ఒక మానసిక జబ్బు

-స్వామి వివేకానంద

★ అవకతవకలు చేసినవారిని రక్షిస్తే ఈ ప్రపంచమంతా బుద్ధిహీనుల నిలయమౌతుంది

-హెర్బర్ట్ స్పెన్సర్

★ బలహీనుల మూఢవిశ్వాసమే మతం

-ఎడ్మండ్ బర్క్

★ స్వేచ్ఛకోసం జరిపే పోరాటంలో భయం అనేది క్షమించరాని ద్రోహం. నిరాశ క్షమించరాని పాపం.

-సరోజినీ నాయుడు

★ బలహీనులు అదృష్టాన్ని నమ్ముతారు. బలవంతులు కృషిని నమ్ముతారు

-ఎమర్సన్

★ పుస్తకాలు లేని గది ఆత్మలేని శరీరంవంటిది

-సిసిరో

•— సేకరణ: కంజర్ల రంగాచార్య —•

# చతుర కథలు

## మేజిక్

సుబ్బారావు ట్రైన్ ఎక్కేసరికి ఒక్క సీటు కూడా ఖాళీగా లేదు. కంపార్టుమెంటంతా కిక్కిరిసివుంది. సీటు సంపాదించడమెలాగో అతనికి బాగా తెలుసు. అందుకే చిన్నగా నవ్వుకుంటూ జేబులోంచి చిన్న మేజిక్ స్టిక్ చేశాడు. ఆ స్టిక్‌ని అందరూ చూస్తుండగా ఒడుపుగా తిప్పుతూ మేజిక్ చెయ్యసాగాడు. దానిపై ఉన్న స్టార్ వంటిది పైనుంచి కిందికి అలా అలా జారిపోతుండడం వారంతా ఆశ్చర్యంగా గమనించారు.



అలా ఆశ్చర్యపోతున్న ఒక వ్యక్తిని చూస్తూ ఆ స్టిక్‌పై ఉన్న స్టార్‌ని చెరపమని చెప్పాడు సుబ్బారావు. ఆ వ్యక్తి చెరిపినట్లుగా వేలుతో రుద్దినా అది చెరగలేదు. తర్వాత సుబ్బారావు అక్కడ వేలుపెట్టి ఆ స్టార్‌ని చెరిపినట్లు రుద్ది వేలు తీయగానే అక్కడ ఆ చుక్కలేకుండా పోయింది.

దాంతో నిలబడ్డవారికి, కూర్చున్నవారికి మంచి కాలక్షేపం దొరికినట్లయింది. "మీరు మెజిషియనా?" అని ఒకతను అడిగాడు. అవునని గర్వంగా చెప్పాడు సుబ్బారావు. సీటులో కూర్చున్న ఒకవ్యక్తి వెంటనే లేచి సుబ్బారావుకు చోటిచ్చాడు. సుబ్బారావుకిది చాలా మామూలు విషయం. జనాలతో నిండుగా వున్న రైళ్లలో అనేకసార్లు ఇదేవిధంగా మేజిక్ చేసి సీటు సంపాదించాడు.

సీటులో కూర్చున్న సుబ్బారావు పక్కన కూర్చున్న వ్యక్తికేసి చూస్తూ "మీ దగ్గర నాలుగు రూపాయి బిళ్ళలున్నాయా?" అనడిగాడు. వెంటనే చుట్టూ ఉన్నవాళ్లు నాలుగు రూపాయికాసులు అతనికిచ్చారు. సుబ్బారావు వాటిని తన గుప్పెట్లో మూసివుంచి ఒకసారి వాటిని కదిపి "ఇప్పుడు నా చేతిలో ఎన్ని రూపాయలున్నాయి?" అని వారిని ప్రశ్నించాడు.

వారంతా "నాలుగు" అనగానే "భలే





కరక్టుగా చెప్పేశారే' అంటూ గుప్పెట విప్పాడు. రూపాయి కాసులుండవలసిన అరచేయి ఖాళీగా వుంది. తమ కళ్ళముందరే నాలుగు రూపాయలను మాయంచేసిన సుబ్బారావు మేజిక్ చూసి అంతా సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యారు. ఒక కుర్రాడైతే ఏకంగా "అమ్మ నీయమ్మ'' అనేశాడు అప్రయత్నంగా. దానికి సుబ్బారావు వెంటనే "మా అమ్మేం చేసింది బాబు నిన్ను'' అనగానే అంతా గొల్లున నవ్వారు. ఆ కుర్రాడు కాస్త సిగ్గుపడ్డాడు.

"ఇంతకీ ఆ నాలుగు రూపాయలు ఏమయ్యాయనుకుంటున్నారుకదూ! ఇదిగో ఇక్కడకు చేరాయి'' అని తన చొక్కా జేబులోంచి వాటిని తీసి ఇచ్చాడు సుబ్బారావు. అందరికీ భలే ఆశ్చర్యం కలిగింది. అబ్బురంగా అనిపించింది.

ఇటువంటి వాటితో తనకు సంబంధం లేదన్నట్లుగా ట్రైన్ వేగంగా దూసుకుపోసాగింది. ఇంతలో అక్కడ కలకలం రేగింది. ఒక కుర్రాడు తన జేబు తెగవెతికేసుకుంటూ "వంద రూపాయలు, నా వంద రూపాయలు కనిపించడం లేదు బాబోయ్'' అంటూ కంగారుపడిపోతున్నాడు. "సరిగా చూసుకోవయ్యా ఎక్కడికి పోతుంది?" అని ఎవరో అన్నారు?

"సరిగానే చూశాను. ఇప్పటివరకు ఉండాలి. ఇప్పటికిప్పుడే మేజిక్ చేసినట్లు మాయమైపోయింది'' అని ఏడుపు ముఖం పెట్టేసరికి అందరి చూపులు ఒక్కసారిగా సుబ్బారావు వైపుకు తిరిగి అతనివంక అనుమానంగా చూశాయి. సుబ్బారావుకి మతిపోయినంతపనైంది. పక్కన కూర్చున్న ఆసామి సుబ్బారావు చొక్కా జేబువంక చూస్తూ "దీంట్లో వందనోటు కనిపిస్తోందే'' అన్నాడు. సుబ్బారావుకి గుండె జారినట్లయ్యింది.

వంద రూపాయలు పోయాయని చెప్పిన కుర్రాడు వెంటనే "అయితే అది నాదే అయ్యుంటుంది'' అనగానే పక్కన కూర్చున్న వ్యక్తి సుబ్బారావు ఇష్టాయిష్టాలతో పనిలేనట్లు లటుక్కున అతని జేబులో చేయిపెట్టి ఆ నోటుని బయటకు తీసేశాడు. అది వందరూపాయలనోటు కావడంతో సుబ్బారావు ఇక ఏం చెబుతున్నా వినకుండా అంతా కలిసి అతడిని కొట్టినంత పనిచేశారు.

అంతలో ఏదో స్టేషన్ వచ్చి ట్రైన్ ఆగటంతో చావుతప్పి కన్నులొట్టపోయినట్లు సుబ్బారావు గబుక్కున దిగిపోయాడు.

వందరూపాయలు పోయాయని గోలపెట్టిన కుర్రాడు కూడా అదే స్టేషన్లో దిగి స్నేహితులతో "చూశార్రా నా మేజిక్! ఇందాకటివరకు నా జేబు ఖాళీగా వుంది. ఇప్పుడు వందరూపాయలతో నిండుగా వుంది'' అనగానే వాళ్లంతా పగలబడి నవ్వారు.

-తురాగో

## అమ్మ చెప్పినట్టు విను

రమణమూర్తి ఆఫీసునుంచి ఇంటికి వచ్చేసరికి అతని గారాలకూతురు పదేళ్ల రోజా ఏడుస్తూ వాకిట్లోనే ఎదురొచ్చింది.

"అడ్డెడ్డె ఏమైంది తల్లీ ఏడుస్తున్నావ్?" అంటూ చేతిలో పేపరు పక్కన పెట్టి రెండు చేతుల్తో కూతుర్ని ఎత్తుకుని అక్కున చేర్చుకున్నాడు మూర్తి. చెదిరిన కూతురి జుత్తు సవరించి ధారగా జారుతున్న ఆ పిల్ల కన్నీళ్లు తుడిచాడు.

అప్పటికే చాలాసేపట్నుంచి ఏడుస్తూందేమో ముఖం ఎర్రగా కంది కన్నీళ్లు ధారలు కట్టాయి. లేతబుగ్గలమీద వేళ్లు అచ్చుతేలాయ్.

"నా తల్లి... ఎందుకురా రోజా ఏడుస్తున్నావ్?" అన్నాడు.

"నా.... న్నా... మర్రే... అమ్మ కొట్టింది'' ఎక్కిళ్ల మధ్యలో మాటలు మింగేసింది. మళ్ళీ గొల్లుమని ఏడుస్తూ తండ్రి భుజాల్లో తల దాచుకుంది. రమణమూర్తికి పిచ్చికోపం వచ్చింది భార్యమీద.

"శిరీషా'' అంటూ గావుకేక పెట్టాడు.

"ఎందుకలా అరుస్తున్నారు?" అంటూ వంటగదిలోంచి ఇవతలకి వచ్చింది శిరీష.

"నీకెన్నిసార్లు చెప్పాను పాపని కొట్టొద్దని. వేళ్లు తట్టు తేలేలా అసలు దాన్ని ఎందుకు కొట్టావ్?"

"కొట్టక? దాని వెధవ ముదిపేరక్క మాటలకి ముద్దుపెట్టుకోమంటారా? రోజూ ఆడుకుందుకని ఎదురింటివాళ్ళ ఇంటికి వెడుతుంది. వెళితే వెళ్ళింది. దాని ఆట ఏదో




ఆడుకుని రావచ్చుగా. ఎదురింటివాళ్ళ ఇల్లంతా తిరగటం, వాళ్ల పడకగదిలోకి వెళ్ళటం, ఆవిడ,ఆయన మసలుకునే తీరంతా వర్ణించి చెప్పటం దాని వయసేంటి? ఆ మాటలేంటి? చిన్నపిల్ల చిన్నపిల్లలా వుండాలి గాని..."

"నోర్మూయ్... అందుకని ఆ పసిదాన్ని కొడతావా? ముగ్గురు పిల్లల తల్లిదండ్రులయి వుండి పట్టపగలు అదీ పసిపిల్లలు ఇల్లంతా తిరిగి ఆడుకుంటుంటే హద్దుమీరి ప్రవర్తించటం, వెకిలి శృంగార చేష్టలకి పాల్పడటం వాళ్ళ తప్పు. ఆ బుద్ధి వివేకం పెద్దవాళ్లకుండాలి. అంతేగాని చిన్నపిల్ల..."

"అదే నేనూఅనేది. చిన్నపిల్లల ఎదురుగా పెద్దవాళ్లు జాగ్రత్తగా వుండాలనే నేను మొత్తుకునేది ఇందాకట్నుంచీ. ఇంకా పాప రోజా పడుకోలేదండి. అది మెళుకువగానే ఉంది. ఏ మంచినీళ్లకన్నా లేస్తే బావుండదు. అని నేను ఎన్నిసార్లు చెప్పినా మీరు మాత్రం వింటున్నారా? ఫరవాలేదులేవోయ్ చిన్నపిల్లేకదా? దానికేం తెల్సునని? ఇంత అందాన్ని ఎదురుగా పెట్టుకుని వూరుకోవాలా? నావల్ల కాదు బాబు..." అంటూ మీరు రోజూ నా దగ్గర పిచ్చి శృంగారచేష్టలు చెయ్యటంలేదూ? దానికేం తెలియదని, చిన్నపిల్ల అని మనం అనుకుంటున్నాం. నిజానికి తెలిస్తే అలాంటి విషయాలు అది చెప్పనే చెప్పదు. చూసినా చూడనట్టు వూరుకుంటుంది. కాని దానికి ఏమీ తెలియదు గనకనే చూసింది చూసినట్లు వర్ణించి చెబుతోంది.

ఇవాళ ఎదురింటి వాళ్ళ గురించి మనకి చెప్పింది. అలాగే మన్ని గురించి ఎదురింటి వాళ్లకి ఎన్ని చెప్పిందో? అందుకే అలాంటి




విషయాలు మాట్లాడగూడదని దాన్ని చావగొట్టాను''

శిరీష రుసరుసలాడుతుంటే రమణమూర్తి అవాక్కు అయ్యాడు.

"నిజమే పిల్లలకి ఏమీ తెలియదు అనుకుంటూ..."

కానీ ఏమీ తెలియకపోవటం కూడా అన్నీ తెలిసిన దానికంటే ముప్పే.

అందుకే పెద్దలే వివేకంతో వ్యవహరించాలి అంటూ గతంలో శిరీష చేసిన వాదంతో ఏకీభవిస్తున్నవాడిలా చప్పున రోజాని భుజాలమీంచి కిందికి దింపి "రోజా! ఇకనుంచి అమ్మ చెప్పినట్టు విను తల్లీ'' అంటూ గబగబ తన గదిలోకి వెళ్ళిపోయాడు రమణమూర్తి

-కాకాని కమల

## అందుకా?!

డాక్టర్ గీతారావు అంత పిసినిగొట్టు మరొకడు ఉండడు. ఇది అంతా అనుకునేమాటే. డబ్బు విషయంలో మహానిర్మొహమాటస్తుడు. అలాంటివాడు ఓ సుదినాన అందరినీ ఆశ్చర్య చకితులను చేసాడు.

ఆ ఊరివాళ్ళకి ప్రపంచంలోని ఏడు వింతలేమిటో తెలియకపోయినా-గీతారావు కలర్ టి.వి.ని, వి.సి.పి.ని కొనటమేగాక వూరందరినీ పిలిచి మరీ చూపించటం ఎనిమిదో వింతగా పరిగణించారు వారు.

ఆ మారుమూల పల్లె ప్రజలింతదాకా టి.వి. మొహం ఎరగరు. పైగా డాక్టర్‌గారిది రంగులదేమో విరగబడిపోయారు. పైగా ఆయన దాన్ని బయటవరండాలోనే ఉంచాడు. అందరితోపాటే డాక్టర్ భార్య కనకం కూడా అచ్చెరువొందింది. ఇన్నాళ్ళూ భర్త పిసినారి తనంవల్ల తన సరదాలన్నీ దాచేసుకుంది. ఇంతకాలానికయినా భర్త మారినందుకు సంతోషించింది.

కాని ఆ సరదా ఎంతోకాలం నిలవలేదు. కారణం గీతారావు క్లినిక్‌కి వెళ్ళేముందు టి.వి. ఆన్ చేసేవాడు. తనను ఒంటరిగా, హాయిగా టి.వి. చూడనివ్వకుండా ఊరివారు ఒకరొకరే గడపలో చేరటం ప్రారంభమైంది. కొద్ది రోజులలా అవగానే వెర్రెత్తిపోయి కేకలేసి తగిలేసిందొకరోజు.

పాపం బిక్కమొహాలు వేసుకుని వెళ్ళిపోయారు జనం.

ఆ సాయంత్రం వచ్చీరావటంతోటే, జనాన్ని ఎందుకు పంపేశావని ఎగిరాడు గీతారావు.

మారుమాట్లాడలేకపోయింది కనకం.

రాన్రానూ, గీతారావు వింతగా మారిపోయాడు. మామూలుగా రిలే అయ్యే ప్రోగ్రాములే కాకుండా వి.సి.పి.లో కేసెట్స్ కూడా వేసేవాడు. దాంతో జనం ఆడ, మగ, కులమత, వర్గ విభేదాలన్నీ డాక్టర్‌గారి గడపలోనే వదిలేసి మిడతల దండులా ప్రవేశించి టి.వి.కి అతుక్కుపోయేవారు.

పోనీ ఓ కేసెట్‌తో సరిపెడితే బాగుండేది. రోజూ పగలు రెండు, రాత్రి ఒకటి వేసేవాడు. దీనివల్ల రాత్రీ, పగలూ కూడా డాక్టర్‌గారి ఇల్లు ఆ జనానికి సరిపోయేదికాదు. రాను రాను పరిస్థితి కనకానికి తలనొప్పిగా తయారయింది.

పగలంతా క్లినిక్‌లో గడిపి రాత్రి ఏ ఒంటిగంటకో వచ్చే డాక్టర్ గీతారావుకు ఏ సమస్యాలేదు. ఆరోజు, డాక్టర్ గీతారావు ఇంటిముందు వరండా ప్రేక్షకులతో కిక్కిరిసి ఉంది. బొమ్మ అస్పష్టంగా కదలాడ్తుంటే అందరూ గోల గోల పెట్టేసారు. కనకం ట్రాకింగ్ సర్దింది. టి.వి. ట్యూన్ చేసింది. అయినా మార్పులేదు.

ఎవరికివారే అదేదో కనకం చేతకానిత



నంలా చూడటం మొదలెట్టారు.

చివరికి అసంతృప్తిగా బయటికు కదిలారు జనం.

ఆ రాత్రి ఇంటికి వచ్చిన గీతారావు ఇల్లు ఖాళీగా వుండటం గమనించి, అడిగితే చెప్పింది కనకం.

"అబ్బ, వారందరినీ ఎందుకలా డిసపాయింట్ చేసావు. హెడ్ క్లీనర్‌తో స్ప్రే చేస్తే సరిపోయేది కదా, ఏదీ చేతగాదు'' అని రుసరుసలాడుతూ వి.సి.పి. హెడ్ క్లీన్ చేసాడు. తెరమీద స్పష్టంగా బొమ్మ కదలాడింది. "చూడు కనకం, నువ్వీపాటికి నేర్చుకుని సహకరించకపోతే మనకెంత ఆదాయం నష్టం" అన్నాడు గీతారావు.

అర్థంకాక దిక్కులు చూసింది కనకం.

"డబ్బు పులిసిపోయి, నేనేదో ఈ జనానికి ఉత్తనే వినోదం చూపించాలని టి.వి., వి.సి.పిలు కొనలేదు. పట్నంలో అడుక్కో డాక్టర్ ఉద్భవిస్తున్న తరుణంలో నా ప్రాక్టీసు మన వూర్లోనే పెట్టి, పెంచుకోవాలని ప్లాన్ చేసే టి.వి., వి.సి.పి. కొని పడేసాను'' అని ఆగాడు.

"మీ ప్రాక్టీసుకి, ఈ టి.వి.కి సంబంధం ఏమిటండీ బాబూ'' సస్పెన్స్ పట్టలేక ప్రశ్నించింది కనకం.

"అక్కడే వుంది కిటుకు. టి.వి.ని అదేపనిగా చూసిన జనానికి తలనొప్పులు, ఒళ్ళునొప్పులు, కళ్ళ జబ్బులు, ఇలా ఒకటేమిటి, ఒకదానివెంట ఒకటి వచ్చేస్తాయి. వాటికి మరి నేనే గతి. నేను ఫ్రీగా సిన్మాలు చూపిస్తున్నానన్న మొహమాటంతో నా దగ్గరకి తప్ప మరో చోటికి పోరు. మరి నేను వాళ్ళ దగ్గర ఫీజులెంత గుంజుతున్నానో, నీక్కూడా తెలీదు. ఇంక నా మీద వున్న పిసినారి, నిర్మొహమాటస్తుడు అన్న నిందలు కూడా హుష్‌కాకి'' అన్నాడు గీతారావు నవ్వేసి.

భర్తతోపాటు నవ్వేసిన కనకం నవ్వు మరి చెదరలేదేనాడు, ఎందుకంటే అడపా దడపా పట్టుచీరలు కూడా కొనిపెడ్తూనే వున్నాడు గీతారావు.

-కె.కె. రఘునందన

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

